# పెరుగుతున్న పాఠకుల అభిమానానికి కారణం ఏమిటి?

'కేవలం సీరియల్స్, ప్రముఖ రచయి త(త్రు)ల పేర్లు, సినిమా కబుర్లే పత్రికల సర్క్యులేషన్‌కు శ్రీరామరక్ష' అనేది కేవలం అపోహేననీ, విభిన్నమైన ఇతివృత్తాలతో, మేధకు పదును పెట్టేకథలతో పాఠకుల హృదయాలలో సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకోవచ్చుననేది 'చతుర' నమ్మకం. ఆ నమ్మకంతోనే పాఠకుల ఆదరణ చూరగొనే విధంగా నెలనెలా విభిన్న ఇతివృత్తాలతో నవలలు అందిస్తోంది 'చతుర'.



## నవంబరు'86 బావి

ఓ పల్లెటూర్లో ప్రశాంతంగా సాగిపోయే ప్రజల జీవితాల్లో హఠాత్తుగా ఓ అలజడి బయలుదేరింది. ఆ ఊళ్లోవున్న మగవాళ్లందరికీ నపుంసకత్వమూ, ఆడవాళ్లందరికీ విపరీతమైన కామవాంఛా ప్రబలిపోయాయి. ఈ వింత మార్పుకు కారణం కనుక్కోవడానికి ప్రభుత్వం ఓ కుర్రడాక్టరును, డాక్టరమ్మను ఆ ఊరు పంపింది.

పేజీ పేజీకి ఆసక్తిని పెంచే సైన్స్ ఫిక్షన్.



## డిసెంబరు '86 ముగింపు

భర్తవుండీ, విధవరాలిగా ముద్రవేయించుకొని, తన ఏడేళ్ల కొడుకూ, పేషెంట్లే లోకంగా బతుకుతున్న డాక్టర్ సమీర మోడువారిన జీవితంలోకి వసంతంలా ప్రవేశించాడు డాక్టర్ శరత్.

ఎదురుచూడని అనుబంధాలు, ఊహించని మలుపులతో కూడిన ప్రేమకథ.



## జనవరి '87 నిజం

ఓ యువతి సామూహిక మానభంగానికి గురయి, హత్యచేయబడింది. నీతి, నిజాయితి, వృత్తిపట్ల గౌరవంవున్న ఓ యువ రిపోర్టర్ ఆ దారుణానికి పాల్పడ్డవాళ్లను బయటకు లాగాలనుకొన్నాడు.

అడుగడుగునా ఉత్కంఠను రేకెత్తించే ఇన్వెస్టిగేటివ్ జర్నలిజం - దాని సాధకబాధకాలు.




## ఫిబ్రవరి '87 స్వేచ్ఛ

ప్రేమించే భర్తా, ఆప్యాయంగా చూసుకొనే అత్తగారూ, ముద్దులొలికే పాప, లెక్చరర్ ఉద్యోగం... సాధారణంగా స్త్రీ కోరుకొనేవన్నీవున్న అరుణ తన ఇంటినీ, తనవారినీ వదలి వెళ్లిపోయింది.

స్త్రీ స్వేచ్ఛ - సామాజిక కట్టుబాట్లను విశ్లేషిస్తూ సాగిన రచన



## మార్చి '87 జైలు

ఏ నేరం చేయని ఓ వ్యక్తి తన శ్రమకుతగ్గ ప్రతిఫలం ఉండాలన్నందుకు కఠినకారాగారశిక్ష విధించారు. నేరస్థులను సంస్కరించడానికి బదులుగా, వారిలోని మానవత్వాన్ని హరించేసి, మంచివారినిసైతం క్రూరులుగా రూపొందిస్తున్న మన జైళ్ళయదార్థ స్వరూపాన్ని చిత్రీకరించిన నవల.




## ఏప్రిల్ '87 పావులు

ఇంట్లో తండ్రి పెత్తనం భరించలేని ఓ యువకుడు, స్నేహితులతో కలసి మందు, మగువ, మార్పియాలతో ఒకొత్త ప్రపంచం సృష్టించుకొన్నాడు.

దేశానికి వెన్నెముకలాంటి యువకులు ఇంటా బయటా అనేకపత్తిడులకు లోనై, కుటిలరాజనీతిలో పావులుగా ఎలా మారుతున్నదీ వివరించే సాంఘిక ప్రయోజనంగల నవల.

# చతుర

నెలనెలా 'చతుర' ఇచ్చే బహుమానం!
రెండున్నర రూపాయలకే
మీ సొంత గ్రంథాలయం!



# చతుర ప్రపంచం



## వింత దానం

వైద్యరంగంలో శాస్త్రజ్ఞులు ఎంతో అభివృద్ధి సాధించారు. ఎన్నో భయంకరమైన వ్యాధులకు మందులు కనుక్కోగలిగారు. అయితే 'ల్యూకోడెర్మా' అనేవ్యాధికి ఇప్పటికీ సరయిన మందు లేకపోవడం దురదృష్టం. ఈ వ్యాధి సోకినవారికి శరీరమంతటా తెల్లనిమచ్చలు ఏర్పడి వికృతంగా వుంటారు. వారిని చూడగానే అందరూ భయపడుతూ అసహ్యించుకుంటారు. మోహన్ రామచంద్ర కులకర్ణి అనే ఓ జర్నలిస్టు, అతని భార్య మంజరి ఈ వ్యాధితో అనేకరకాల ఇబ్బందులకు గురయి, చివరకు ఓ నిర్ణయానికొచ్చారు. వారు బతికుండగానే తమ ఇద్దరి శరీరాలమీదా ఈ వ్యాధి నివారణకు పరిశోధనలు జరిపేందుకు శాస్త్రజ్ఞులకు అనుమతి ఇవ్వదలచుకొన్నారు.

ముప్ఫయి ఎనిమిదేళ్ల మోహన్‌కు ఎనిమిదేళ్ల వయసులో ఈ వ్యాధి సంక్రమించింది. అతని కుటుంబంలో ఇంకెవరికీ ఈ వ్యాధి లేదు. అతని భార్య మంజరికి పదకొండేళ్ల వయసులో ఈ వ్యాధి సోకింది. ఆమె కుటుంబంలో కూడా ఎవరికీ ఈ వ్యాధిలేదట. గత ఇరవయ్యేడేళ్లగా వీరిద్దరూ అనేకమంది వైద్యులను సంప్రదించారు. వివిధరకాల మందులు, మూలికలు, భస్మాలు సేవించారు. చివరికి ఉపవాసాలు, వ్రతాలవంటివికూడా ఆచరించారు. ఎన్నిమార్గాలు అనుసరించినా వీరి వ్యాధిమాత్రం నయంకాలేదు. అంతే 'ల్యూకోడెర్మా'ను నివారించే మందేలేదని వారు నిర్ధారించుకున్నారు. తరువాత వారు ఈ వ్యాధిగురించి పరిశోధనలు జరుపుతున్న అనేకమంది శాస్త్రజ్ఞులను కలుసుకొని చర్చించారు. ఆ చర్చల తరువాతనే వారికి తమ శరీరాలను పరిశోధనల నిమిత్తం ఇవ్వాలనే ఆలోచన వచ్చింది. భార్యాభర్తలిద్దరూ కలిసి చర్చించుకొని తాముచేయబోయే పనిలో ఎదురయ్యే పరిస్థితులను ఎదుర్కోవడానికి మానసికంగా, శారీరకంగా సిద్ధపడ్డారు. ల్యూకోడెర్మా వ్యాధితో వచ్చే ఇబ్బందుల్ని తుడిచివేయడమే వారి లక్ష్యం. ఆ వ్యాధితో ఎన్నోబాధలు అనుభవించినవారుగనుక అటువంటి బాధనుండీ ఇతరులను తప్పించడానికి ఏమాత్రం సహాయపడగలిగినా చాలుననుకుంటున్నారు ఈ దంపతులు.

ప్రస్తుతం అమెరికా, ఫ్రాన్సు దేశాల్లోనూ, మనదేశంలో ఢిల్లీ, బొంబాయి, చండీఘర్, పాండిచ్చేరిలలో చర్మవ్యాధులను గురించిన పరిశోధనాసంస్థలు ఉన్నాయి. ఇవన్నీ ఐ.సి.ఎమ్.ఆర్. అనే అంతర్జాతీయ పరిశోధనాసంస్థ ఆధ్వర్యంలోనే నిర్వహించబడుతున్నాయి. ఈ పరిశోధనలకుగాను ప్రస్తుతం 'గినీపిగ్స్'ను వాడుతున్నారు.

మోహన్, మంజరి పరిశోధనల నిమిత్తం తమ శరీరాలను ఇవ్వడానికి అవసరమైన, చట్టసంబంధమైన రాతకోతలుకూడా పూర్తిచేశారు. ఒక వ్యాధిని గురించి పరిశోధనలు జరవడానికి తమ శరీరాలనే దానం ఇచ్చిన మొదటి వ్యక్తులు వీరే.





# కార్నివల్



ఓ దేశం మరో దేశంమీద దాడిజరిపి, ఆక్రమించినప్పుడు, వారి సంస్కృతిని కూడా ఆ ఓడిపోయిన దేశస్థులు కొంతవరకూ అలవరచుకుంటారు. గోవాలో కూడా అదే జరిగింది. పోర్చుగీసు దేశస్థులు గోవాను ఆక్రమించకముందు అక్కడి హిందువులు 'షిగ్మో' అనే పండుగను జరుపుకొనేవారు. రకరకాల ఉత్సవాలు, వినాయకచవితివంటి పండుగలు జరుపుకొనేవారు. పోర్చుగీసు దేశస్థులు గోవాను ఆక్రమించినతరువాత క్రైస్తవమతానికి ప్రాధాన్యంపెరిగి 'క్రిస్మస్' పండుగను మాత్రమే పెద్దయెత్తున జరుపుకోవడం ప్రారంభించారు. క్రైస్తవ మతస్థులకు 'క్రిస్మస్' తప్ప మరో పెద్దపండుగ ఏదీ తమకులేదని కొంత చింత వుండేది. పోర్చుగీసు ప్రభుత్వానికేమో అక్కడి హిందువులను ఉత్సవాలద్వారా క్రైస్తవమతంవైపు ఆకర్షించాలని వుండేది. ఆ సమయంలోనే, ఇప్పుడు గోవాలో 'కార్నివల్' పేరుతో ఏటా జరుగుతున్న సామూహిక వీధినృత్యాలు రూపుదిద్దుకొన్నాయి. ఈ 'కార్నివల్' ఉత్సవానికీ, హోలీ పండుగకూ కొంతవరకూ పోలికలు వుంటాయి. స్త్రీ, పురుషులు రంగురంగుల వస్త్రాలు ధరించి రంగులు చల్లుకుంటారు. బాణాసంచా కాలుస్తారు. వివిధరకాలయిన వాయిద్యాలు వాయిస్తూ, ఆడుతూ, పాడుతూ వీధులవెంట ఊరేగింపుగావెళ్ళి, రాత్రి ఏడు గంటలప్రాంతంలో ఓ ముఖ్యకూడలివద్ద అన్ని వీధులవాళ్ళూ కలుసుకుంటారు. అక్కడి నుండి పెద్ద ఊరేగింపుగా ఒక చర్చివద్దనున్న మైదానానికి వెళతారు. ఈ మైదానంచుట్టూ కంచె ఉంటుంది. ఇక్కడ ప్రవేశరుసుం చెల్లించి లోపలికి వెళ్ళాలి. అయితే రుసుం మగవాళ్ళుమాత్రమే చెల్లించాలి. ఏ మగవాడైనా టికెట్ కొనుక్కొని లోపలికి వెళ్ళవచ్చు. అయితే వారికి ఓ అందమయిన నిబంధన వుంది. ప్రతి పురుషుడూ తనకు జంటగా ఓ స్త్రీని తీసుకొనివెళ్ళాలి. కానీ ఆ స్త్రీ ప్రవేశరుసుం చెల్లించనవసరంలేదు.

లోపల వాతావరణమంతా ఎంతో ఉత్సాహంగా, ఆహ్లాదకరంగా వుంటుంది. బీర్, బ్రాండీ, విస్కీ వంటి పానీయాలు పుష్కలంగా లభిస్తాయి. తమకు నచ్చిన పానీయాలు తీసుకున్న తరువాత అన్నిజంటలూ డాన్స్ చేయడం ప్రారంభిస్తారు. సాధారణంగా ఈ 'కార్నివల్'లో పాల్గొనే యువతీయువకులు పరస్పరం ప్రేమించుకొని పెళ్ళిళ్ళు చేసుకోవడం జరుగుతూ వుంటుంది. అందుకే గోవాలోని యువతీయువకుల వివాహాలు స్వర్గంలో నిర్ణయించబడతాయి అనటంకన్నా 'కార్నివల్ మైదానం'లో నిర్ణయించబడతాయనడం నిజమేమో!



# పెళ్ళి అవసరమా?

నిన్న మొన్నటి దాకా 'పెళ్ళి' అనేది కేవలం సాంఘిక పరమైన కట్టుబాటుగా మాత్రమే గాక, రెండు జీవితాలను శాశ్వతంగా ముడివేసే ఒక పవిత్రమైన బంధమనే అభిప్రాయం దాదాపు అన్ని నాగరిక సమాజాల్లోనూ ఉండేది. అయితే ఇటీవల 'పెళ్ళి' మీద ఆ నమ్మకం, గౌరవభావం సడలినట్టుగా అనిపిస్తోంది. ముఖ్యంగా పాశ్చాత్యులకు 'పెళ్ళి' అనే వ్యవస్థ మీద నమ్మకం పూర్తిగా తగ్గిపోయింది. ఆదేశాల్లో పెళ్ళి చేసుకోకుండానే కలిసి కాపురం చేస్తున్న స్త్రీ పురుషుల సంఖ్య రోజు రోజుకీ పెరిగిపోతోంది. ఈ మధ్య ఫ్రాన్స్ దేశంలో జరిపిన ఒక సర్వేలో, ఆదేశంలో దాదాపు పది లక్షల జంటలు పెళ్ళిచేసుకోకుండానే కాపురాలు చేస్తున్నట్లు వెల్లడయింది. ఆస్తిపాస్తులను వంశపారంపర్యంగా తమ పిల్లలకు అందజేసే పద్ధతులున్న పల్లెటూళ్లలో కూడా ఈ మార్పు కనబడుతోంది. పారిస్ నగరంలో ఇటువంటి జంటలు అత్యధిక సంఖ్యలో ఉన్నాయి. 'ట్రయిల్ మారేజెస్' అంటే ఒక జంట కొంతకాలం భార్యాభర్తలుగా కాపురం చేసిన తరువాత ఇద్దరికీ ఇష్టమయితే పెళ్లి చేసుకోవడం లేదా విడిపోవడం పాశ్చాత్య దేశాల్లో సర్వసాధారణమై పోయింది.

ఇలా పెళ్ళి చేసుకోకుండానే కాపురం చేయడానికి ఎందుకు మోజు చూపుతున్నారంటె ఇప్పుడు ఎవరయినా సరే వద్దను కొంటే పిల్లల్ని కనే అవసరం లేదు. అంతేగాకుండా వైజ్ఞానికంగా అభివృద్ధి చెందిన దేశాల్లో దేవుడు, మతంపై నమ్మకం తగ్గిపోవడంతో పెళ్లికాకుండానే స్త్రీ, పురుషులు భార్యాభర్తలుగా జీవించడం 'పాపం' అనే భావం కూడా పోయింది. ఈవిధమైన మార్పుకి నిలకడలేని ఉద్యోగాలు, మానసిక పరిస్థితి కూడా కొంత దోహదం చేస్తున్నాయి. శాశ్వతంగా ఒక వ్యక్తికి కట్టుబడి ఉండాలంటే విముఖత్వం చూపుతున్నారు. ముఖ్యంగా ఉద్యోగస్థులయి ఉండి, ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్న ఆడవాళ్లు తమ స్వేచ్ఛను వదులుకొని 'పెళ్లి' అనే బందిఖానాలో చిక్కుకోవడానికి ఇష్టపడటం లేదు. స్త్రీ, పురుషులు ఇద్దరూ ఉద్యోగస్థులే అయి ఉండి పెళ్లికాకుండానే కాపురం చేస్తూ ఉంటే, ఆదాయపుపన్ను విడివిడిగా చెల్లించవచ్చు. ఇదికూడా లాభదాయకంగా ఉంటుంది.

'ట్రయల్‌మారేజెస్' అంటే చాలా మంది ఇష్టపడటానికి మరో ముఖ్యకారణం సాధారణంగా వైవాహిక జీవితంలో ఉండే నిరుత్సాహం, స్తబ్దత, 'మొనాటనీ' ఇందులో ఉండవు. ఒకరి మీద ఒకరు అధికారం చెలాయించే అవకాశం కూడా ఉండదు. అయితే చట్టసమ్మతంగా పెళ్లిచేసుకోని జంటలకు భద్రత విషయంలో, పిల్లలపోషణ, ఆస్తిపాస్తుల వంటి వ్యవహారాలలో చికాకులు తప్పవు.



ఒవరు పేజీ ఫొటోగ్రాఫర్: దేవవ్రత బెనర్జీ

మనలో చాలామందికి,

* పెళ్ళి, ఒక జీవన గమ్యం!
* కొంత మందికి అది ఒక మజిలీ!
* కొంతమందికి అది ఒక ఆశ్రయం!
* కొంతమందికి అది ఒక ముసుగు!
* మరి కొంత మందికి అది ఒక ఆసరా!
* ఇంకా కొంతమందికి అది ఒక యాక్సిడెంట్!
* కాని, బహుకొద్దిమందికి మాత్రం అది ఒక ప్రేమ పూరితమైన సంపూర్ణ జీవితం!
* దీన్ని కోరుకున్న ఒక సుకుమారికి ఎదురైన అనుభవ మాలికకి అక్షర చిత్రీకరణ !!

# యద్దనపూడి సులోచనారాణి

క్వాజీ (QUASI) డైరెక్షనల

# సుకుమారి

వెల: 25 రూ.






ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
3237, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-500 003.

# 'బతుకు' నవలపై చతుర సమీక్షలు

## వాస్తవంలోంచి పుట్టిన బతుకు

(ప్రథమ బహుమతి రు. 100 పొందిన సమీక్ష)

ఓ హీరో, హీరోయిన్‌తో కథంతానడిపి చివరాకరుకు ఏదో కొసమెరుపులాగా గిమ్మిక్కులుచేసి ముగించడం సాహిత్యమన్పించుకోదు. అలాంటి గిమ్మిక్కులకు అతీతంగా కళ్ళ ముందు కన్పించే బడుగువర్గ ప్రజల జీవనాన్ని ప్రయోజనాత్మక నవలగా రూపుదిద్ది అందించిన యం.వి. తిరుపతయ్యను అభినందించాలి.

'బతుకు' నవల వాస్తవానికి దగ్గరగావుంది అనడంకంటె వాస్తవంలోంచి పుట్టింది అనడం సరైనది. ధనవంతుల దౌర్జన్యాలకు, బలవంతుల పన్నాగాలకు బలైపోయిన ఓ సగటు పేదవాని జీవిత కథ 'బతుకు' సామాజిక ప్రయోజనాన్ని ఆశించి రాసిన నవల.

ఈ బతుకు పోరాటంలో కేవలం రిక్షా కార్మికుల జీవితాలేకాక సమస్త శ్రామికజన ఘోష వినపడ్తుంది. ఏ బాధలనుండైతే తప్పించుకొని బతకాలని పల్లెను విడిచివచ్చారో మళ్ళీ అవే బాధలు తప్పని శ్రామిక కుటుంబాలు మన దేశంలో అనేకంగా కన్పిస్తాయి. ఎండనక, వాననక వీధుల వెంబడి తిరుగుతూ కూరగాయలు అమ్మి బతికే రాయలింగు కుటుంబాలు స్వతంత్రంగా జీవించాలనే లక్ష్యంతో రిక్షా కార్మికునిగామారిన భిక్షపతి, ఇలాంటివాళ్ళ శ్రమను దోచుకుని ఆస్తుల్ని పెంచుకునే గిరిగిరి బ్యాంకుల సర్దార్ దాదాలు, వాళ్ళ అండతో గుండాయిజాన్ని సాగించే సత్తిదాదాలు, వీళ్ళ అండతో తమ వునికిని కాపాడుకునే ఎమ్మెల్యేలు, ఛైర్మన్లు, రిక్షా యూనియన్ లీడర్లు అనే కులీ వ్యవస్థలో.

"బస్తేంది పల్లెటూరేంది నీ పిచ్చిగాని ప్యాదోనికి ఎక్కడున్నా చిక్కులుతప్పయి, ఆడో తీరుచిక్కులుంటే ఈడో తీరు చిక్కులుంటయ్ గని... చిక్కుల్లేకుండా పోవు అన్ని చిక్కులకు కారణంమాత్రం గదే పేదోడవు" అనే దేవయ్య మాటల్లో కన్పిస్తుంది అసలు బతుకు. నిజం చెప్పినవాడు నేడు పోలీసుల దృష్టిలో నేరస్థుడు. ఆ నిజాన్ని విన్నవాడు అంతకంటే నేరస్థుడు. ఆవులు ఆవులు కొట్లాడుకుంటె లే గల కాళ్ళు విరిగినట్లుగా మనదేశంలోని రకరకాల గ్రూపు కొట్లాటలకు అమాయకులు వాళ్ళ ప్రాణాల్ని సైతం పోగొట్టుకుంటున్నారు. పేదవాడి కోపం పెదవికి చేటులా "తనో- రిక్షా కార్మికుడు... పైసాలేని బాడుకావుగాడు పగలు రాత్రి పశువులా కష్టపడాలి. తినాలి. కష్టపడాలి అంతే అనుకునే భిక్షపతి ఆవేదన చదువుతున్న పాఠకుడి హృదయమంతా వేదనగాకమానదు. "బతుక్కోసం మాగ పోరాడిండు... కనోడి పోయిండు" అనే మాటలకి "ఓడిపోయాడంటె నేనొప్పుకోను పెద్దపులోలే బతికిండు.





'చతుర' నవలల పోటీలో తృతీయ బహుమతిపొంది మే సంచికలో ప్రచురితమైన 'బతుకు' పై మాకు అందిన 'చతుర సమీక్ష'లలో ఉత్తమంగావున్న అరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు. బహుమతులు పొందినవారికి మా అభినందనలు.



వులోల్నె సచ్చిండు.. గింతమంది నొక్కటిజేసి పోయిండు" అనే సమాధానం గుండెల్లో కలుక్కుమన్పిస్తుంది.

సాహిత్యపు స్థాయి దిగజారిపోతోంది. అనే మాటలువిని- విని హెూరెత్తి పోతున్న కాలంలో నవలాపోటీ నిర్వహించి అమూల్యమైన నవలలను అందిస్తున్న 'చతుర' సంపాదక వర్గానికి మా హృదయపూర్వక అభినందనలు.

– యం. ప్రదీప్
గోదావరిఖని

## చేదు బతుకులు

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

బతుకు లాంటి నవల్లలు ముందు ఆసక్తి కలిగించవు, దీంట్లోవుండే చేదును మింగలేం కనుక. కాని చదవడం ఆరంభిస్తేమాత్రం ఆపలేము, కారణం అవి జీవిత సత్యాలు కనుక. 'బతుకు' చదువుతుంటె ముల్కరాజ్ ఆనంద్ 'కూలీ' వంటి నవల గుర్తురాకమానదు. అట్టడుగు వర్గంయొక్క వేదనామయ జీవిత చిత్రణే ప్రధానంగా గల మరిచిపోలేని నవల అది. ఇన్నేళ్ళు గడిచినా వారి జీవితాలు అలాగే వున్నాయని గుర్తు చేస్తోందీ "బతుకు".

నిత్యజీవితంలో మనం ఎందరినో దీనుల్ని హీనుల్నీ దురదృష్టవంతుల్ని చూస్తూ అడ్డంవస్తే తప్పించుకుంటూవుంటాం. కష్టించి పనిచేసేవారిని గౌరవిస్తూనూ వుంటాం. కాని వారిపట్ల సానుభూతి తప్ప వారి జీవితం గురించి యోచించే తీరిక వుండదు. సాహిత్యం మనకా అవకాశాన్ని కలిగిస్తుంది. నవలలోని పాత్రల గురించి ఎంతో సానుభూతితో యోచిస్తాం. వేదన చెందుతూ ఆ పాత్రల నిస్సహాయ పరిస్థితులను అలాగే ఆయా పాత్రలు దుర్భరమైన కష్టాలు తొలగి వారు సుఖపడాలని కోరుకుంటాం. జీవితానికి సాహిత్యానికి తేడా ఇదే. సాహిత్యం నిత్యజీవితంలో మొద్దుబారి మనలోని మానవత్వానికి పదును పెడుతుంది. మనని తిరిగి మనుషులను చేస్తుంది.

ఈ నవలలో రిక్షా అతను అడిగిన బాడుగ, కూరలమ్మి చెప్పిన ధర, కూలివారు కోరిన రొట్టెతునక, పనిమనిషి అడిగిన పాతచీర, పేపరు కుర్రాడు అడిగే అదనపు రూపాయి మనని దోచుకోడంలేదని అదివాళ్ళ అవసరమనీ, ఆమాత్రం సానుభూతి తోటి మనిషియందు చూపడం మన కర్తవ్యమని గుర్తు చేస్తుంది. మన మనస్సులోని కల్మషాన్ని కడిగివేసి ఆరోగ్యవంతమైన ఆలోచనలకి తావు కల్పిస్తుంది. ఇతరులను విమర్శించేముందు మనవంతు బాధ్యతలను విస్మరించరాదని ప్రబోధిస్తుంది. అర్థంలేని బంద్ లు అమాయక జీవులకు ఎంత హానికరమో చక్కగా వివరిస్తుంది. రాయదలచిన దానిని శక్తివంతంగా

రా యగలిగినందుకు రచయిత తిరుపతయ్యా గారికి అభినందనలు.

— గొల్లపూడి సీతాదేవి
హైదరాబాదు

## బతుకు మంచిగనిపించలె

(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)

గీ చతురోల్లకు పనీపాటేంలేదను కుంట–లేక పోతే ఏందవ్వ! గిసోంటి నవుల్లు ఎందుకు చెపాయిస్తుర్రో నాకు సమజుకాలే–గా రాయ లింగు, అదనా పెదపాలేరు రాయలింగు బతుకు కతే మంచిగనిపించిందా చతురోల్ల కు–సంగపోల్లు కాలుపెట్టిన ఊల్లెకు పోలీసు లు బరాబరస్తరు. బిచ్చపతిలాంటి కోడెవైను పోరగాళ్ళను మోటార్ల ఎక్కిచ్చుక పోతరు. మల్లమారు మాట్లాడితె సంపేత్తరు కూడా–అదేందో పెద్ద ఇసిత్రమయినట్లుగా తిరపత య్యా రాసుడేంది! గీల్లు దానికి ఇనామిచ్చి, చెపాయించి చదువుకోని మీరంత అను డేంది-నాకేం మంచిగనిపించలె. సర్కారు బల్లల్ల పంతుల్లు సరిగ చెప్పక ఏడో, పదో చదివితప్పి, నాలుగచ్చరం ముక్కలచ్చినయి సాలని సంతోసపడి పనిపాటల్చేసుకుని బతికే పోరగాళ్ళు గిసోంటి 'బతుకు'ల్జదివి సాచా యించి, సాచాయించి దిమాకు కరాబు చేసుకో రా?-గందుకే నాకు మంచిగనిపించలె మీ చతురోల్ల పని.

— సి. హెచ్. కిషన్
గుడివాడ

## బతుకు సమరం

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

సామాన్యుని జీవితంలో అడుగడుగున ఎదు రయ్యే సమస్యలకు, బతుకు సమరంలోని బాధామయ గాధలకు సజీవ చిత్రణ ఈనవల. దారిద్ర్యరేఖకు దిగువనున్న ప్రజల జీవిత సంఘర్షణను రచయిత చక్కగా మలిచాడు. ఎన్నుకున్న ఇతివృత్తం, తీసుకున్న వాతావ రణం, వాడిన భాష శక్తివంతంగా వున్నాయి.

బతుకులోని వెలుగు నీడలను, ఎత్తుపల్లాల ను, వాళ్ళచేదు అనుభవాలను కన్నీళ్ళను, ప్రతిక్షణం భయంభయంగాసాగే వారి జీవితా లను, క్రొత్తకోణంలోంచి చూసి స్పందించి నవ లగా మలిచాడు రచయిత. ముఖ్యంగా ఒక జీవిత సత్యాన్ని ఆవిష్కరించటంలో కృతకృ త్యులయ్యారు.

మురికివాడలలోంచి- మట్టిమనుషుల లోంచి పుట్టుకొచ్చిన పాత్రలే అన్నీ. గుర్తించగ లిగే మనసే వుంటే ఆదరించగలిగే హృ దయం వుంటే వీరంతా మనకు ఎక్కడైనా ఎప్పుడైనా తారసిల్లుతారు. చౌరస్తాలో రిక్షాలా గుతూ, శిధిలావస్థలోవున్న నాలుగుచక్రాల బండి తోస్తూ, అల్లంమురబ్బా అమ్ముతూ, మిఠాయిలు, సెనక్కాయలు, మిర్చి బజ్జీలు అమ్ముతూ... ఎక్కడైనా కనబడతారు వారినే హీరోలుగాచేసి నవలలో చూపటం సాహసమే.

వాళ్ళబతుకులో నిత్యం రగులుతూన్న రావ ణకాష్టం... అనుక్షణం భయంతో సాగించే బతుకు సమరం మనకళ్ళముందు సినిమారీ లులా కనిపిస్తూంది. ఒక్కరోజు పనిలోనికి వెళ్ళ కపోతే వాళ్ళఆర్థికవిధానపు పునాదులు ఎలా కదలిపోతాయో అర్థమవుతూంది. ఉద్యమకా రులతో సంబంధం లేకపోయినా అమాయకు లను పోలీసులు ఎలా వేధిస్తారో... పేరుమోసిన 'దాదా'లు ప్రజానాయకుల అండతో ప్రజల్ని ఎలా దోస్తారో... గిరిగిరి బ్యాంకుల్లో వాళ్ళరక్తం డబ్బుగా ఎలా చేరిపోతాయో తెలుస్తూంది.

బిక్షపతి స్వతంత్ర ఆలోచనాసరళి... అన్యా యాన్ని ఎదురించాలనే తెగువ... అతనికి అండగా శివయ్యలాంటి కుర్రాళ్లు కలసిక ట్టుగా ముందుకుసాగడం... గుడిసెవాసులను ఏకంచేసి తమ యిళ్ళను లేపకుండా చే యడం, సమిష్టి ఉద్యమ విజయాన్ని సూచిస్తు న్నాయి.

"బతుక్కోసం బతకాలె బతికునోళ్ళకోసం బతకాలె- బతుకుతో పోరాడుకుంట బతకాలె" వంటివి చెదిరిన గుండెలకు ఊపిరిపోసి ఆత్మ స్థయిర్యాన్నిస్తాయి.

ఎన్ని ఎదురుదెబ్బలు తగిలితే అంత ధై ర్యం పెరగాలి అన్నట్టు ఇన్ని చేదు అనుభవా లు చవిచూసినా దేవయ్య మల్లికాంబ జీవితా




న్ని నిలబెట్టడానికి ప్రయత్నిస్తాడు. ఆమెకు పరిపూర్ణమైన బతుకిచ్చేందుకు తన జీవన భాగస్వామిగా స్వీకరిస్తాడు. ఇక్కడే రచయిత ప్రతిభ మనకు స్పష్టంగా తెలుస్తూంది.

నవలా రచన వ్యాపారాత్మకంగా మారిన ఈరోజుల్లో ఇటువంటి నవల రాయడం చాల అరుదు. రాసినా ఏ 'చతుర' వంటి పత్రికలో తప్ప ప్రచురించే సాహసం ఎవరు చేస్తారు?

– కె. ఐజక్
శ్రీశైలం

## దినదినగండం 'బతుకు'

**(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)**

**ఇం**దులోని పాత్రలు రోజూకళ్ళముందు కనిపించేవే అయినా వారిగుండెలోతుల్లోకి ప్రవేశించని పాఠకుడికి అట్టడుగువర్గాల వారిబతుకు అంతదుర్భరమా? అనిపించి వారిపై సానుభూతిని కలుగజేస్తుందీ నవల. సామాన్యుడి బతికేహక్కును కూడా కాపాడలేని ఈ ప్రభుత్వాలపై విరక్తిని కలుగజేస్తుంది.

సర్దార్, సత్తిదాదాలాంటి వాళ్లు పేదలకడుపులు కొట్టి అధికారం చలాయిస్తుంటే, నిజాయితీగా తమ రెక్కలకష్టాన్ని నమ్ముకుని బతుకుపోరాటం సాగించే రాయలింగు, భిక్షపతి లాంటివాళ్లు, దోపిడీవర్గాల కబంధహస్తాల్లో ఎలా నలిగిపోతున్నారో చెప్పిందీనవల. సామాన్యులను పీల్చిపిప్పిజేసే వడ్డీవ్యాపారుల గురించి వివరంగా చెప్పిన తొలినవల ఇదేనేమో!

పరిస్థితులకు తలవంచి సర్దుకుపోయే మనస్తత్వంగల వృద్ధతరానికి ప్రతినిధులుగా రాయలింగు, గౌరమ్మలు, ఉడుకురక్తంతో ఆత్మాభిమానాన్ని చంపుకుని అన్యాయాన్ని సహిస్తూ బతకలేని భిక్షపతి, మల్లమ్మపాత్రలు-బతుకుతో పోరాడుతున్న వారికి సాయంచేయడమే తనబతుకుగా ఎంచుకున్న దేవయ్యపాత్ర నవలకు నిండుదనాన్నిచ్చాయి.

ఎన్నిఎదురుదెబ్బలు తగిలినా, ఎన్నిబంధాలు తెగిపోయినా మళ్ళీ కొత్తబంధాలు పుడ్తూనే వుంటాయి. మనిషి జీవనసమరంసాగిస్తూనే వుంటాడన్న సందేశం బాగుంది.

'చతుర'లో ఇలాంటి నవలలే మళ్ళీ మళ్ళీ రావాలని కోరుకుంటున్నాను. చతుర కథల్లో "ఎందుకోసం?" నవ్విస్తే 'రాజకీయం" నేటిరాజకీయాలను చెంపదెబ్బకొట్టింది.

– వరికూటి కేశవరెడ్డి
రాయదుర్గం

## మాబతుక్కి అద్దం

**(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)**

"**తి**రుపతయ్యగోరు కష్టపడి రాసిన కథ మా బతుక్కి శానశాన దగ్గరగావుంది. మా బతుక్కి ఆయన అద్దంపట్టి సూపినట్టు సూపిండు. తమరో దాన్ని కాయితాలమీద అచ్చేసింర్రు. ఈ పుత్తాకాన్ని సదువుకొన్న మారాజులు సూత్తె ఇగనన్న మా గుడిసోళ్ళ మీద కొంతదయగలుగుతది. మాలాంటి గుడిసెలోళ్ళం ఈవిధంగా ఉండగలుగుతున్నామంటే దేవయ్యమామలాంటి వాళ్ళు మా ఎనక ఉండమట్టే" అన్నాడు ఒక రిక్షావాలా ఈ "బతుకు" చదివి వినిపిస్తె.

తిరుపతయ్యగారు రాసిన నవల వీళ్ళ బతుకును చూపెడుతుంది. రచయిత వాళ్ళబతుకు గురించి అందులో నేడు జరుగుచున్న రాజకీయాన్ని సూక్ష్మంలో మోక్షంగా చూపెట్టినాడు. గుడిసెవాసుల ద్వారా సర్ధారయ్య లాభంపడితే, సర్ధారయ్య మరియు దాదాల ద్వారా ఛైర్మన్లు, రాజకీయ నాయకులు, లాభం పడుతున్నారు. గిరిగిరిబ్యాంకుల గురించి కొద్దిగనే రాసినావాళ్ళు చేసే మోసం ఇట్టే తెలిసిపోతోంది.

భిక్షపతి ధైర్యం, సర్ధారయ్య జులుం, రాయలింగు భయం, గౌరి ఏడుపు, దేవన్నమామ అభయం, మల్లిగాని భార్య సాహసం, మధునయ్యస్నేహభక్తి, రిక్షావాళ్ళ ఐకమత్యం, మల్లి కాంబపై అఘాయిత్యం ఇవన్ని చదువుతుంటే ఒకమంచి నవల చదివిన అనుభూతి కలిగింది.

-కందిమళ్ల మల్లయ్య
ఇప్పగూడ, వరంగల్‌జిల్లా.

# చతుర

సంపుటి : 10 జూలై 1987 సంచిక : 6


## ఈ నెల సమగ్ర నవల

"అంత అభిమానం, పౌరుషం వున్నదానివి పాపం కాళ్లబేరానికెందుకొచ్చావు? వెళ్లు... వెళ్లు... ఆత్మాభిమానం కాపాడుకుంటూ పుట్టింట్లో కూర్చో. ఏదయినా మాట్లాడవలసివుంటే కోర్టులో మాట్లాడుకుందాం" వ్యంగ్యంగా అన్నాడతడు.

"కోర్టు, కోర్టు అంటూ నన్నేం బెదిరించక్కరలేదు. విడాకులు అనగానే బెదిరి మీ కాళ్లమీదపడి 'నాథా రక్షించు' అనడానికి నేనేం చదువుసంధ్యలు లేని దాన్నికాను. మీకు పెళ్లాం అక్కరలేదంటే నాకూ మొగుడు అక్కరలేదని అనగలను" విసురుగా అందామె.

పరస్పర అవగాహనతో, అనురాగంలో మైమరచిపోవాల్సిన ఆ యువజంట ఎందుకలా కయ్యానికి కాలుదువ్వుకున్నారు?

విడాకుల ప్రస్తావనదాకా ఎలా వచ్చిందా కయ్యం?

'ధర్మేచా, అర్థేచా... నాతిచరామి' అంటూ పెళ్లినాడు వారు మనస్ఫూర్తిగా చేసిన ప్రమాణాలు కొద్దికాలంలోనే ఏమయిపోయాయి?

చదువు ఇచ్చిన సంస్కారంతో స్త్రీపురుషులిద్దరూ సమానమనే సత్యం తెలుసుకున్నాననుకుందామె. పురుషాహంకారానికి తలఒగ్గి బానిసలా బతకలేక ఎదిరించింది. పర్యవసానానికి తట్టుకోనూలేక, వ్యక్తిత్వాన్ని వదులుకోనూలేక పోయింది. అలాంటి ఈనాటి అనేకమంది స్త్రీల వ్యథను చిత్రీకరించిన డి.కామేశ్వరి నవల **'జీవితం చేజారనీయకు'** ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

ఆదర్శాల ఆకాశం నుండి చేదువాస్తవాల భువికి రమ్మంటున్న ఈ 'జీవితం చేజారనీయకు' 'చతుర' నవలల పోటీలో ప్రత్యేక బహుమతి పొందిన నవల.



సాంఘిక సమస్యలనే తీసుకుని రాసే రచయిత్రిగా సుపరిచితురాలైన శ్రీమతి డి. కామేశ్వరిగారు గత పాతికేళ్లలోనూ 22 నవలలు, 250 కథలు రాశారు. నవలల్లో కొన్ని సినిమాలుగా రూపొంది విజయవంతమైనాయి.

కొత్త, పాత తరాల రచనలన్నీకూడా ఆసక్తిగా చదివే కామేశ్వరిగారు పత్రికలు, పాఠకుల సంఖ్యపెరిగిన ఈకాలంలో అందుకు తగినస్థాయిలో రచనలు రావటం లేదని బాధపడుతుంటారు. ఇన్నాళ్లూ భువనేశ్వర్‌లో గడిపి ప్రస్తుతం హైదరాబాదులో స్థిరపడ్డారు.

"వాళ్ళ విద్య పుట్టింటికి వచ్చేసిందంటే"

కాలేజినుంచి వచ్చి నిర్మల కాఫీతాగుతుండగా తల్లి చెప్పిన వార్త అది.

'వచ్చిందా? వచ్చేసిందా?' ఒక్కఅక్షరంతో ఆమాటలో అర్థాలు మారిపోతాయి.

'వచ్చింది' అంటే మళ్ళీ వెళ్తుంది! 'వచ్చేసింది' అంటే ఏదో జరిగి వచ్చేసిందా!

అడక్కపోయినా తల్లిచెప్తుంది అని తెలుసు కనుక మౌనంగా కాఫీ తాగుతూ ఉండిపోయింది నిర్మల.

"పెళ్ళయిందగ్గరనించి ఆ అమ్మాయికి మొగుడికి అసలు పడలేదట! ఆ అత్తవారు మహామూర్ఖులట! ఈరోజుల్లోనూ కోడలంటే అత్తింట అణిగిమణిగి పడుండాలనుకునే రకాలుట. 'కనీసం అల్లుడయినా మంచివాడయితే చూసీచూడనట్లు వూరుకునే వాళ్లం. చూస్తూ చూస్తూపిల్లని చంపుకుంటామా, కాపురం లేకపోతే పీడాపోయింది, మా పిల్ల మాకు బరువా? అంది వాళ్లమ్మ' తల్లిచెప్పుకుపోతూంది.

మొగుడు, కాపురం లేకపోతే పోయింది. మా పిల్ల మాకు బరువా అనేస్థితికి ఆడపిల్లల తల్లితండ్రులు ఎదిగారంటే స్త్రీజాతి పురోగమనానికి నాంది పలుకుతుందనుకోవాలా! ఒకసారి పెళ్లిచేసి పంపాక కష్టమో నష్టమో, చావో బతుకోఅత్తింట్లోనేఅని పెళ్లవగానే ఆడపిల్లలని చచ్చినదానితో జమచేసి పట్టించుకోకుండా వదిలేసే తల్లితండ్రులు, తమ పరువు ప్రతిష్ఠలని పక్కనపెట్టి ఆడపిల్లని ఆదుకోడానికి, పర్యవసానం ఎలావున్నా ఎదుర్కోడానికి సిద్ధపడ్డారంటే నిజంగా సంతోషించదగిన విషయమే! కాని...

"ఏమిటో... ఈ కాలం పెళ్ళిళ్లు కాపురాలు! పెళ్లయ్యేవరకు కాలేదన్నచింత, అయ్యేక కాపురాలు ఎలావుంటాయోనన్న దిగులు. చూస్తూ వూరుకో లేరుగదా తల్లితండ్రులు. ఇదివరకటి రోజులే నయమేమో. దాని అదృష్టం ఇంతేనని ఓ ఏడ్పుఏడ్చి వూరుకునేవారు..." తల్లి చాదస్తంగా గొణుగుతూ లోపలికి వెళ్లింది.

నిర్మల వాలుకుర్చీలో వెనక్కి వాలి నిట్టూర్చింది.

విద్య తన స్టూడెంటు! కిందటేడు బి.ఎ. అయి ఈ ఏడాదే ఎమ్మే ఎకనామిక్సులో చేరింది యూనివర్సిటీలో. తన స్టూడెంటేకాకుండా తమకు రెండిళ్ల అవతల ఇల్లే అవడంతో 'మేడమ్' అంటూ చనువుగా ఇంటికి వస్తూపోతూ కబుర్లు చెప్పేది. తనతల్లికీ, వాళ్ల అమ్మగారికి పరిచయాలు పెరిగి కుటుంబ స్నేహితులయ్యారు.

విద్య చలాకీ అయిన పిల్ల. ఈ కాలం పిల్లలకి ప్రతీక. ఆమె పెద్దకళ్ళల్లో విజ్ఞానం, చురుకుదనంతోపాటు పంతం, పౌరుషం కనపడేవి. ఆ పెదవి వంపులో పట్టుదల కనిపించేది. విద్య పెద్ద అందగత్తె ఏంకాదు! కాని స్మార్ట్‌గా, చలాకీగా గలగలమాట్లాడుతూ, నవ్వుతూ, నవ్విస్తూ తన ఉనికి అందరూ గుర్తించేట్టు చేసుకునేది. గోధుమ రంగుతో, ఐదురెండు పొడుగుతో, సన్నగా, కత్తిరించిన జుత్తుకి రబ్బర్ బ్యాండ్ పెట్టుకుని, కనుబొమ్మలు ట్రిమ్‌గాషేప్ చేసుకుని, క్రీములు, లిప్‌స్టిక్‌లతో అందాన్ని మెరుగులు దిద్దుకుని, సల్వార్ కమీజులు, రకరకాల చీరలు, జీన్‌పేంట్స్‌తో ఈకాలం కాస్త కలవారి అమ్మాయిలెలా వుంటారో అలా వుండేది. ఇద్దరు మగపిల్లల తరువాత ఆడపిల్లగా చిన్నప్పటినించి ముద్దుగా పెరిగింది. తండ్రి ఇంజినీరు. ఆస్థిపాస్తులున్నవారు, అంతస్థు హోదావున్న వారు గనక ఆడింది ఆటగా, పాడింది పాటగా పెరిగింది. 'ఇవాళ సినిమాకి వెళ్లాలి డాడీ' అంటే, ఆయన పనులన్నీ మానుకుని వేళకి ఇంటికి రావల్సిందే. 'ఈ సెలవులికి వూటీవెళ్దాం డాడీ' అంటే ఇంటిల్లిపాది ప్రయాణం అయ్యేవారు. ఎవరినన్నా డిన్నరుకి పిలవాలంటే కూతురికి చెప్పాలి! కూతురు చెప్పిన మెనూ వుండాలి. ఫర్నీచర్ పాతబడిపోయింది మార్చాలి డాడీ అని కొనేవరకూ ప్రాణాలు తీసి కొనిపించేది. సరే... చీరలు, చెప్పుల్లు, బ్యాగులు, గాజులు అలాంటి కోరికలకి అంతేలేదు. అవి తీర్చడం పెద్దకష్టం అని వాళ్లెప్పుడూ అనుకోలేదు. తల్లితండ్రులు కూతురిని ఎంత గారాబంగా చూడనీ, మరీ విచ్చలవిడిగా వదిలేయనందుకు మెచ్చుకోవాలి! బాయ్‌ఫ్రెండ్సు, వాళ్లతో సిని




మాలు, పార్టీలు అంటూ తిరగటంమాత్రం లేదు. ముందునించి కాన్వెంట్, తరువాత ఉమెన్స్‌కాలేజిలో చదవడంవల్ల మగపిల్లలతో పరిచయాలకి అంత ఆస్కారంలేదు. ఎక్కడికి వెళ్లినా కూతురిని ఒక్కతినే పంపకుండా అంద రూ వెళ్లేవారు. లేదంటే అన్నలనయినా వెంట పంపేవారు. విద్య మంచి మాటకారి. దానికితో డు తెలివితేటలు వున్నయ్యేమో ఏసబ్జక్ట్ గు రించన్నా బాగా చర్చించేది, వాదించేది. వాళ్లీ వూరు వచ్చిన మూడేళ్లలో స్టూడెంటు, లెక్చర రు బంధంనించి స్నేహితుల్లా మారారు తా ము. కల్సిసినిమాలకి వెళ్లడం, షాపింగులకి వెళ్లడం రకరకాల పుస్తకాలు చదివి వాదించు కోడం మంచి కాలక్షేపంగా మారింది తన వంటరి జీవితంలో విద్య.

విద్య బి.ఏ.ఫైనల్లో వున్నప్పటినుంచి విద్య అమ్మగారు పెళ్లిసంబంధాలు చూడమని పోరడం మొదలుపెట్టింది. ఇంకా ఇరవై ఏళ్లేగా, ఎమ్మేకూడాకానీ చూద్దాం తొంద రెందుకు అనేవారాయన.

'ఆ... ఇప్పుడు ఆరంభిస్తే ఆవేళకి కుదురు తుంది. మంచిసంబంధం దొరకద్దూ, అని వేధించేది ఆవిడ.

ఇరుగుపొరుగు, బంధువులు ఎవరే సంబంధం చెపితే అది చూసొచ్చేది ఆవిడ. ఉత్తరాలు రాయించేది. జాతకాలు, ఫొటోలు తెప్పించేది. అన్నింటికీ ఏదోవంక పెట్టేది. అబ్బాయి పొట్టని, రంగు తక్కువని, చదువు తక్కువని, ఆస్తిలేదని, ఇలా అవిడే మూ డొంతులు నచ్చక తిరగ్గొట్టేది. ఆ మిగిలిన ఒకటిరెండు ఫొటోలకు విద్య ఈవంకా ఆ వంకా పెట్టి రిజెక్ట్‌చేసిపారేసేది.

"జాగ్రత్త... ఇలా ప్రతి సంబంధానికి ఏదో వంకలు పెడితేవీళ్లకి ఎవరూ నచ్చరు అన్నపే రువస్తే తరువాత కుమారిగానే మిగిలిపోగ లవు" నవ్వుతూ అంది ఓసారి తను.

"మరీమంచిది ఆంటీ. హాయిగా ఉద్యోగం చేసుకుంటూ, నచ్చింది కట్టుకుంటూ, ఇష్టమై నది తింటూ, కేర్‌ఫ్రీ జీవితం గడిపేస్తాను మీలాగ" అంది విద్య నిర్లక్ష్యంగా.

"హు... నా హాయిని ఆదర్శంగా పెట్టుకోకు తల్లీ" అనుకుంది తను నిట్టూర్చి. ఆమాట ఎందుకో పైకిచెప్పలేకపోయింది.

"నా ఎమ్మే అయితేగాని చేసుకోను ఆంటీ. ఆమాటఅంటే అమ్మవినదు. ఇలా నచ్చలేదని చెప్పేస్తూవుంటే ఏగోలా వుండదు" అంది నవ్వుతూ.

విద్య ఎమ్మేఫైనల్‌ఇయర్‌లో వుండగా ఓ సంబంధం అందరికీ అన్నివిధాలా నచ్చింది వచ్చింది. అబ్బాయి ఇంజినీరు. ఒకంపెనీలో పెద్దజీతంతో పనిచేస్తున్నాడు. తండ్రికి బోలెడు ఆస్తి, రెండుమూడు ఇళ్లువున్నాయి. ఇద్దరు కొడుకులలో ఇతడు రెండోవాడు. ఒక్కకూతురి కీ పెళ్లిఅయిపోయింది. బాదరబందీలు లేవు.

పరీక్షలయితేగాని చేసుకోను అని విద్యగోల పెడ్తున్నా 'చూసివెళ్లనీ నచ్చిందంటే పరీక్షల య్యేవరకు ఆగమనవచ్చు. పెళ్లయితే మాత్రం చదవకూడదా! ఇంక ఆరునెలలేగావుంది. మంచిసంబంధం' అంటూ నచ్చచెప్పి పెళ్లి చూపులు అరేంజ్ చేశారు. పెళ్లిచూపులనాడు విద్య బలవంతపెడితే తనూ వెళ్లింది.

అబ్బాయి పెద్దఅందగాడు కాకపోయినా చామనఛాయ రంగులో కనుముక్కు తీరు బాగానేవుంది. పెద్దపొడగరి కాకపోయినా విద్య హైట్‌కి సరిపోతాడు. అతన్ని చూస్తే అంత మాటకారి కాదనిపించింది. అడిగిన వాటికి ముక్తసరిగా సమాధానాలు చెప్పాడు తప్ప ఈ కాలం వాళ్లలా మాటలు కలపలేదు. తండ్రి మాత్రం వంటొచ్చా, పాటొచ్చా అంటూ పాతకా లంవాడిలా ప్రశ్నలు వేశాడు. తల్లి చాదస్తంగా పాటపాడు, ఏదో ఒకటిపాడు అంటూ పదిసార్లు అడిగింది. నాకు పాటరాదు అని తెగేసి విద్య చెప్పాక ఊరుకుందావిడ. అన్నీ బాగానే వున్నా యికాని అతని మొహంలో దరహాసం అసలు కనపడలేదు. మూడీఫెలో కాదుకదా అని పించింది తనకి. విద్యని అతను ఏంపలక రించలేదు. ఈకాలం వాళ్లలా మాటలు కలిపి ఏదో అడగాలన్న తాపత్రయం కనపడలేదు. విద్యకి అది నచ్చినట్టులేదు. కాస్త డిసపా యింట్ అయిందేమో ననిపించింది. ఉత్తరం రాస్తామంటూ వెళ్లారు వాళ్లు.

"ఏంవిద్యా... అబ్బాయి నచ్చలేదేమిటి, అలావున్నావు" హాస్యం ఆడింది తను.

"నిక్షేపంలా వున్నాడు, నచ్చకపోవడానికి ఏముంది. మూడువేలు జీతం, బోలెడు ఆస్తి, ఇళ్లు, నగలు. ఈ అబ్బాయికి తండ్రి హైదరాబాద్‌లో ఓ ఫ్లాట్‌కొనిచ్చాడుట." తల్లి మురిసిపోతూ అంది--

"మొహం ముంగిలా పెట్టుకు కూర్చున్నాడేమిటి? నవ్వితే నవరత్నాలు రాలతాయేమోనన్నట్టు నోరు బిగించుకుని కూర్చున్నాడు" విద్య అంది. నచ్చిందీనచ్చందీ ఏంచెప్పలేదు.

"అంత జాలీఫెలోలా లేడు. ముభావంగా మాట్లాడాడు" విద్య పెద్దన్నయ్య అన్నాడు.

"అతని తీరే అంత అనుకుంటాను. అంతా మనవిద్యలా వాగుతారా!" తండ్రినవ్వుతూ అన్నాడు.

మొత్తానికి పెద్దగా అడ్డుచెప్పడానికి ఎవరికీ ఏవంకా కనపడలేదు. ఉత్తరంకోసం ఆరాటంగా చూశారు అందరూ. వారంరోజుల తరువాత 'పిల్లనచ్చింది. మాదే బోలెడు వుంది కట్నం అక్కరలేదు. మా హోదాకి తగ్గట్టు పెళ్లి బాగాచెయ్యాలి' అంటూ రాశారు. అంత మంచి సంబంధం కట్నం కూడా వద్దనకుండ చేసుకుంటున్నారని అంతా సంబరపడ్డారు.

"ఆంటీ... మీరేమంటారు? అతన్నిచూసారుగా, ఫ్రాంక్‌గా మీ అభిప్రాయం చెప్పండి" అంటూ వచ్చింది ఓసాయంకాలం. తను తడబడింది ఏంచెప్పాలో తెలియక. నిజం చెప్పాలంటే అతని మొహం చూడగానే ఎందుకో డిసపాయింట్ అయింది తను. ఫలానాకారణం అని చెప్పలేదుకాని, చూడగానే ఎందుకో ఇంప్రెస్‌కాలేదు. అందంగురించి కాదు. అతనిలో ఫ్రెండ్‌లీనెస్, సౌమ్యత, అందరితో సరదాగా కలిసిపోయే మనస్తత్వం లేదనిపించింది. కేవలం తన ఊహ అపోహేమో. పెళ్లికొడుకని కాస్తబిగించుకొని కూర్చున్నాడేమో. పెళ్లయితే విద్య కంపెనీలో ఇలా వుండకపోవచ్చు. "బాగుంది... చేసుకునేదానివి నీవా నేనా? నాకు నచ్చడంఏమిటి" అంది నవ్వేసి తను.

"అదికాదు ఆంటీ! అతన్నిచూస్తే ఎందుకో సీరియస్ టైపు అన్పించింది. బాబోయ్! అందంలేకపోతే లేదు, డబ్బులేకపోతేలేదు గాని, లైఫ్‌సీరియస్ అయితే మాత్రం నేను భరించలేను. బతికిన నాలుగు రోజులూ నవ్వుతూ బతకాలి"

"మీ వాళ్లతో చెప్పావా నీ సందేహం"

"నిమొహం పెళ్లిచూపుల్లో చూసిన అరగంటలో ఏంతెల్సిపోయింది? బొత్తిగా పరిచయం లేనివాళ్లతో, అందులో పెళ్లిచూపుల్లో మొదటిసారే ఏంమాట్లాడేస్తారు - పిచ్చిఅనుమానాలూ నీవూ" అంటూ అంతా కేకలేశారు ఆంటీ" అంది విద్య.

ఏంచెప్పాలో, చెబితే విద్య డిసపాయింట్ అవుతుందేమో, తనేదన్నా అంటే తనమీద నమ్మకంతో ఈ సంబంధం వద్దంటుందేమో, చిన్నవిషయాన్ని తమిద్దరూ కొండంత చేస్తున్నారేమో, అనుమానంతో తనిలా అంటోందని తెలిస్తే వాళ్లవాళ్లు ఏమనుకుంటారో! అని సందిగ్ధంలోపడి ఏమీ చెప్పలేకపోయింది తను.

"నేనేం చెప్పను విద్యా. నాకూ అతను సీరియస్ టైపు అన్పించాడు. కాని మీవాళ్లు అన్నట్టు కొందరు అంత తొందరగా కొత్తవాళ్లతో కలవరు. రేపు నీ కంపెనీలో మామూలుగా వుంటాడేమో. మంచి సంబంధం, ఈ మాత్రం దానికోసం వదులుకోడం అవివేకమేమో" అన్నాను ఎటూ తేల్చకుండా.

"ఆంటీ... చక్కగా ఫారిన్‌లోలాగ మనదేశంలోనూ కోర్టింగ్ పీరియడ్‌వుంటే ఇలాంటి విషయాలు ముందే తెల్సుకోవచ్చు-- అలాంటి సదుపాయాలు మనకిలేవు. అంతా దైవాధీనం సర్వీస్. 'లక్' మీద డిపెండ్ అవుతాయి మనపెళ్లిళ్లు. నాకేం చెప్పాలో తెలియడం లేదు. మీరేదన్నా సలహాయిస్తారేమోనని ఇలా వచ్చాను..." అంది.

ఆమెలో సంఘర్షణ అర్థంఅయింది తనకి. కాని తనుమాత్రం ఏంచెప్పగలదు?

మొత్తానికి అందరూ కలిసి విద్యని ఒప్పించారు. చదువు, పరీక్షలు అనిగోలపెట్టింది విద్య. 'ఆ అబ్బాయి పెళ్లి అయ్యాక నెలరోజులలో ఏదో ట్రైనింగ్‌కి జర్మనీ వెడతాడట ఆరునెలలు. అతను తిరిగి వచ్చేవేళకి పరీక్షలు ఎలాగో అవుతాయి. అతనున్న ఒక నెల రెండు నెలలు ఎలాగో మేనేజ్ చెయ్యా

చ్చు. తరువాత మంచి ముహూర్తాలు లేవు. పెళ్లిచేసి పంపాలని వాళ్ల ఉద్దేశం' అంటూ బలవంతంగానే వప్పించారు విద్యని.

అక్టోబరులో విద్య పెళ్లి జరిగిపోయింది. కట్నం పుచ్చుకోలేదని పెళ్లిఏర్పాటు ఘనంగానే చేశారు ఆడపెళ్లివారు. మంచి కేటరింగ్ కంపెనీకి భోజనాలకి కాంట్రాక్టు ఇచ్చారు. మగపెళ్లివారికి మంచిహోటలు రూములు బుక్‌చేశారు. వేడినీళ్లు, చన్నీళ్లు, టేబుల్‌మీల్స్ పూటపూట రకరకాల పిండి వంటలతో భోజనాలు- అంతా ఆర్భాటంగానే ఖర్చుపెట్టారు. మగపెళ్లివారికి ఖరీదయిన చీరెలు, బట్టలు పెట్టారు. ఆనవాయితీగా అబ్బాయికి పెట్టాల్సిన వెండి కంచం, చెంబు, వాచీ ఉంగరం లాంటివన్నీ ఇచ్చారు. విద్య చీరలు, నగలకికాక అరవైఐదువేలు ఖర్చుపెట్టారు.

కాని... పెళ్లిలో మగపెళ్లివారి మొహాలు విడలేదు. మూతులు ముడుచుకున్నారు. చేసిన ఏర్పాట్లు వాళ్లకి చాలలేదని ఆడపెళ్లివారు అనుకున్నారు. 'మా తాహతంతే, ఇంకేం చెయ్యాలని వాళ్ల ఉద్దేశం--' విద్య అమ్మగారు గొణుక్కుంది.

కాఫీకిరండి, టిఫినుకి రండి, భోజనానికి రండి అంటూ ప్రతిమాట బొట్టుపెట్టి పిలవలేదని, మాకు పెట్టు పోతలకంటే మర్యాదలు ముఖ్యం అని మగపెళ్లివారు గొణగడంతో అది ఆడపెళ్లివారికి చేరింది. 'ఈ కాలంలోనూ ప్రతిదానికీ బొట్లుపెట్టి పిలవడాలూ అదీ- ఏమిటీ చాదస్తాలు' అని ఆడపెళ్లివారు విసుక్కున్నారు. 'కట్నం వద్దన్నాంగదా, అత్త ఆడబడుచు లాంఛనాలు కనీసం వెయ్యినూటపదహార్లన్నా ఇస్తారనుకున్నాం, ముష్టి నూటపదహార్లు ఇస్తారా? ...ఈ పట్టుచీరలు మేంపండుగలకే కొనుక్కొంటాం, పెళ్లికి కాస్తఖరీదువి పెట్టరా? కట్నంవద్దన్నాంగా! అసలువీళ్లకి అచ్చటాముచ్చటా తెలీదా? వియ్యపురాలికి మొహం కడిగించి వెండి బొట్టుపెట్టన్నా ఇవ్వద్దూ!?' అని మధ్యవర్తుల దగ్గిర అన్నారు.

'ముందు మాకేం వద్దనడం ఎందుకు, తరువాత మేంయిచ్చినవి సరిపోవు అని గొణగడం ఏమిటి. ఏంకావాలో ముందే అడగాల్సింది... మీమొహాలు కడగడం ఈ పాత చింతకాయ అలవాట్లు ఏమిటింకా' అని ఆడపెళ్లివారు ఈసడించుకున్నారు. 'వేడుకలు పెళ్లిలోకాకపోతే రోజూ చేస్తారా? మావి చింతకాయ బుద్ధులా? మళ్లీమళ్లీ వీళ్లింటికి రమ్మంటేమాత్రం వస్తామా? అచ్చటాముచ్చటా ఈ రెండురోజులేగా!' అని మగపెళ్లివారు ఎగిరిపడ్డారు. వీళ్లమధ్య, వాళ్లమధ్య మాటల విసుర్లు, దెప్పుకోడాలు, మూతిముడుచుకోవడాలు జరిగాయని తల్లిచెప్తుంటే నిరాసక్తంగా వింది తను.

పెళ్లిపీటలమీద మాత్రం విద్యపక్కన అతన్ని చూస్తే ఎందుకో సంతృప్తిగా మాత్రం లేదుతనకి.

పెళ్లయింది. విద్యతండ్రి 'హనీమూన్‌కి వెళ్లండి' అన్నాడు. తనకి సెలవులేదని విద్యను తీసుకొని వాళ్లింటికి వెళ్లి గృహప్రవేశం, పార్టీ అదికాగానే హైదరాబాదు వెళ్లిపోతాం అని చెప్పాడు అల్లుడు. గృహప్రవేశానికి ఆడపెళ్లివాళ్లని రమ్మని వాళ్లు పిలవలేదు. పిలవకుండా మేంఎలా వెడతాం అని వీళ్లు గింజుకున్నారు. ఎవరూ రాకపోతే నేను వెళ్లను అని విద్య మొండికేస్తే ఆఖరికి అన్నవెంట వెళ్లాడు.

పెళ్లిఅయ్యాక దీపావళి పండగకి వచ్చింది విద్యభర్తతో. అతని ఫారెన్ ప్రయాణానికి వీసా ఇంకారాలేదుట. మొదటిపండుగ రమ్మని చాలా సార్లు ఫోన్ చేస్తేగాని అతను రాలేదుట. ఆఖరికి ఎలాగో వచ్చారని అంతా సంతోషించారు.

"పెద్దచదువే అని గోలపెట్టావు. పెళ్లికాంగానే ఆమాటే మర్చిపోయావే. డిస్‌కంటిన్యూ చేస్తున్నావేమిటి" తనునవ్వుతూ అంది విద్యతో.

"లేదు ఆంటీ... ఈయనింకా వెళ్ళలేదు. నాకు క్లాసులు పోతున్నాయంటే మరేంపర్వాలేదు. ప్రయివేట్‌గా చదవచ్చు అంటున్నారు" అంది కాస్త బాధగా. కొత్తమోజులో భార్యని వదలలేక వద్దన్నాడేమోననుకుంది. కాని కొత్తపెళ్లికూతురు మొహంలో వుండాల్సిన వెలుగు, కళ, సంతోషంలాంటివి ఏమీ కనబడలేదు విద్య మొహంలో. అదోలా డల్‌గా ఉందని

పించింది. విద్య ఏమన్నా చెప్తుందేమోనని చూసింది. కాని ఆమె ఉన్నదే రెండురోజులు. మళ్ళీకల్సుకొని తీరిగ్గా మాట్లాడుకునే టైమే లేకపోయిందసలు.

పెళ్ళయిన మూడునెలలకే విద్యపుట్టింటికి వచ్చేసింది అన్నమాట వినగానే ఏదో ముందే తెల్సిన నిజంలా అన్పించింది నిర్మలకి. ఎందుకో ముందునించి అపశృతే పలికింది తన మనసు అనుకొంది. విద్య అడిగినప్పుడు ఫ్రాంక్‌గా తన అభిప్రాయం చెప్పిఉంటే తన మీద నమ్మకంతో, గౌరవంతో ఈపెళ్ళి చేసుకునేది కాదేమో! కాని ఇప్పుడు... పెళ్ళయ్యాక వట్టుమని మూడునెలలు కాపురం చెయ్యకుండా ఇలా జరిగిందంటే, ఇంక విద్య జీవితం ఏమవుతుంది? విద్య తల్లిదండ్రులు ఆవేశంతో ఈవిషయం లోతుగా ఆలోచించటంలేదు అనుకుంది నిర్మల. హు... ఆఫ్తల్‌ది పీపుల్... తను ఇలా ఆలోచించటం తమాషాగా అన్పించింది ఆమెకే! కాలం ఎన్ని మార్పులు తెస్తుంది? మనుషుల్లోనేకాదు... ఆలోచనల్లో... ఆచరణల్లో కూడా!...

★ ★ ★

"విద్యా.. ఏంచేస్తున్నావు?" విద్య వచ్చినాల్గురోజులయినా ఇంటికి రాలేదని, ఆమె వచ్చే మూడ్‌లోలేదని గ్రహించిన నిర్మలే వాళ్ళింటికి వెళ్ళింది. "నాల్గురోజులయి వచ్చావు, మాఇంటివైపు రానేలేదే నీవు" ఏం తెలియనట్లే అడిగింది.

"రండి ఆంటీ... రండి" విద్యపడుకున్న మంచంమీదలేచి కూర్చుంది. ఆమె గుండెల మీద ఇంగ్లీషు నవల వుంది. ఆమె పుస్తకం చదవటంలేదని, ఏదో ఆలోచిస్తోందని నిర్మల గ్రహించింది.

"రావాలనే అనుకున్నాను ఆంటీ! ఏమిటో మూడ్‌బాగోలేదు" శుష్కహాసం చేసి అంది విద్య.

"ఎలా బాగుంటుందమ్మా నిర్మలా! మాయదారి పెళ్ళిచేసి దానిగొంతుకోశాం. మీఅమ్మగారు అంతా చెప్పేవుంటారు నీకు. కళకళలాడుతూ వెళ్ళిన పిల్ల మూడునెలలకే పీనుగులా తయారయివచ్చింది... చూస్తున్నావుగా" అంది విద్యతల్లి కళ్ళు వత్తుకుంటూ.

విద్య కళ్ళు వాల్చుకుంది.

నిజమే. విద్యచాలా చిక్కింది. బుగ్గల్లో నునుపు మాయమయింది. కళ్ళకింద నల్లచారలు. ఆమె మొహంలో దరహాసమేలేదు.

"అమ్మ ఏదో చెప్పింది లెండి! అసలేం జరిగింది" అంది నిర్మల.

"ఏం జరగలేదని అడుగుతల్లీ! పిల్లవాడు చదువుకున్నవాడు, మంచి ఉద్యోగం, ఆస్థిపాస్థులున్నాయని మురిసిపోయాం. వీళ్ళలాంటి పదిహేనోశతాబ్దపు బుద్ధులున్నవాళ్ళని గ్రహించలేకపోయాం. పోనీ అత్తమామలంటే పాతకాలంవాళ్ళు అని సరిపెట్టుకోవచ్చు. కాని ఇతగాడికేం! చూస్తే పెద్దఇంగ్లీషు కంపెనీలో పని, బుద్ధులు చూస్తే పిలకపెట్టుకొని పారాయణ చేసుకునేరకం. ఓ అచ్చటాముచ్చటా సరదాపాడు లేదు. మాఅమ్మ, మానాన్న అంటూ వాళ్ళు గీచినగీటు దాటడు. తనుసరే... ఇదివాళ్ళ అడుగులు మడుగులు వత్తుతూ అత్తమామల సేవచేసుకుంటూ అక్కడే వుండమంటాడట. చదివినచదువు చాల్లే ఇంక చదివి ఉద్యోగాలు ఏంచెయ్యక్కరలేదు నీవు చదువుమానేయి అంటాడుట. మీవాళ్ళకి మంచిమర్యాదలు లేవు. మావాళ్ళని పెళ్ళిలో అవమానించారు- అంటూ అస్తమానూదెప్పుతాడట. ఓ సినిమా అంటే రానంటాడుట. ఫ్రెండ్స్, పార్టీలు అలాంటి సరదాలేలేవు. ఇంటికి కావల్సినవి నాలుగు ముచ్చటపడి కొనుక్కుందాం అంటే అక్కరలేదు- అవన్నీ మాఇంట్లో వున్నాయి. మళ్ళీవేరే కొనటం దండుగ అంటాడట. అదేం పిల్లాడమ్మా... వాళ్ళింట్లో ఉంటే చచ్చాక ఇస్తారుగాని ఇప్పుడే ఇస్తారా? వాళ్ళిచ్చేవరకు ఇంట్లో ఏంలేకుండా వుండాలా? కొత్తకాపురం. నాలుగూ అమర్చుకోవాలని వుండదూ దీనికి? అయ్యోరాత... కొత్తపెళ్ళాం,ఆమోజుఉంటే ఈ కాపురం ఇలా ఎందుకేడ్చేది? మారాత... దానిఖర్మ. ఒక్కగానొక్కపిల్లని, భూప్రపంచాలు గాలించినట్టు వెతికివెతికి వీళ్ళమొహాన కొట్టాం బంగారంలాంటి పిల్లను. పిల్ల సుఖపడుతుందని లక్షరూపాయలు ఖర్చు పెట్టి పెళ్ళిచేశాం. కాళ్ళపారాణి ఆరకుండానే పిల్లతిరిగి వచ్చింది. పోతేపోనీ! మాపిల్ల మాకు బరువా! చూస్తూచూస్తూ దాన్ని

అక్కడవదిలి చేతులారా చంపలేం. దాని ప్రాణానికి సుఖం లేకపోయాక ఎందుకా పెళ్ళి... ఎందుకా మొగుడు! ఎవరేం అనుకుంటారోనని మాకేం భయంలేదు. వెధవ లోకం కోసం పిల్లని బలిపెట్టం. పోనీఇంతటితో బయటపడ్డాం. ఇంకో నాలుగురోజులుంటే ఏ కడుపో వచ్చి దాని గొంతుక్కి ఉరిబిగిసేది. ఏదో చదువుకుంటుంది. ఉద్యోగం చేసుకుని దాని బతుకు అది బతుకుతుంది. అంతేగాని అలాంటి కాపురం దానికక్కరలేదు''

ఆవిడ ఏకధాటిగా గుండెల్లో కసి, దుఃఖం అంతా వెళ్ళగక్కింది. విద్యఅలా కళ్ళువాల్చుకు కూర్చుంది. తల్లిమాటలు ఆపాక, 'అమ్మా... ఆంటీకి కాఫీఇవ్వమ్మా' అంది- తల్లిధోరణి ఆపాలన్ని కాబోలు.

ఆవిడలోపలికి వెళ్ళాక నిర్మల విద్య భుజంమీద చెయ్యివేసి "విద్యా... నీవు తొందరపడలేదుగదా, బాగా ఆలోచించుకునే ఈనిర్ణయానికి వచ్చావా?'' అంది.

విద్య వినుగ్గా చెవులు మూసుకుని "ఆంటీ... ప్లీజ్! ఐహేట్‌టు టాక్‌దిస్ సబ్జక్ట్ ఎనీమోర్, ఇట్స్ ఎ బాడ్ డ్రీమ్. అది తల్చుకోవాలని లేదు'' అంది బాధగా.

"ఓకే- ఓకే... నీకు చెప్పాలని లేకపోతే వద్దు" హర్ట్ అయింది నిర్మల.

"ఛా... అదికాదు ఆంటీ. చెప్పుకోడానికి మీకంటే ఆప్తులు నాకెవరున్నారు? ఈ నెలరోజులుగా ఈ విషయం ఆలోచించి, మాట్లాడి, వాదించి విసిగిపోయాను. ఈ టాపిక్‌వస్తే నాకు ఆవేశం వస్తుంది. నన్ను నేను కంట్రోలుచేసుకోలేను. నిజంగా నాజీవితంలో ఈపెళ్ళి ఓ పీడకల ఆంటీ.'' అంది బేలగా విద్య.

ఏమని ఓదార్చాలో అర్థంకాక నిర్మల మెల్లిగా ఆమె చెయ్యినొక్కింది. "ఓకే- ఫర్‌గెట్ యిట్... తరువాత మాట్లాడుకుందాంలే'' అంది. విద్య మొహంలో భావావేశం తీవ్రత తగ్గి మామూలు అయింది.

"అదేంలేదు ఆంటీ! నేనే వచ్చి మీకు అంతా చెప్పాలనుకున్నాను- ఇంట్లో ఏడ్పులు రాగాలమధ్య ఎవరికీ మనశ్శాంతిలేదు. పరిస్థితి చల్లబడ్డాక రావచ్చని వూరుకున్నాను?"

"అసలు గొడవలు ఎందుకొచ్చాయి విద్యా... ఏవిషయంలో?'' సానునయంగా అడిగింది నిర్మల.

"ఏవిషయంలో రాలేదు అని అడగండి ఆంటీ... ఆయన ఓ చదువుకున్న మూర్ఖుడు. పద్ధెనిమిదో శతాబ్దంలో పుట్టాల్సిన ఛాందసుడు! ఇంతచదివి, అంతపెద్దఉద్యోగం చేస్తున్నా సంస్కారం లేని క్రూక్! నెత్తిమీదికి ముప్పైఏళ్ళు వస్తున్నా స్వంతఆలోచన లేకుండా అమ్మకొంగుపట్టుకు వేలాడే అర్భకుడు. తను సుఖపడి, ఇంకొకరిని సుఖపెట్టలేని, సుఖపడితే చూడలేని మీన్‌ఫెలో- క్రుకెడ్‌ఫెలో! ఏకోశానా సున్నితత్వం, లాలిత్యంకాని, ఆ పదాలకి అర్థంతెలియని మూఢుడు. ప్రేమ,అనురాగం అనేవి ఇస్తే దొరుకుతాయని గ్రహించలేని స్టుపిడ్... ఇంతకంటే అతన్ని వర్ణించాలంటే ఐ హేవ్‌నో వర్డ్స్'' అంది ఆవేశంగా.

"నీవు ప్రతిదాన్నీ భూతద్దంలో చూడలేదుగదా. చిన్న విషయాన్ని గోరంతలు చేసి ఆలోచించటంలేదుగదా?'' నెమ్మదిగా అంది నిర్మల.

"చిన్న విషయాలే ఆంటీ... కాని ఆ చిన్నవిషయాలని పట్టుకుని సాగదీసి, తెగేవరకు లాగి ఇవతలివాళ్ళని హర్ట్‌చేసే సాడిస్ట్ టెంపరమెంటుని చిన్నవిషయం అని ఎలావదిలేయటం ఆంటీ? ఇలాంటివి వినేవాళ్ళకి చిన్నవిషయాలుగానే కనబడతాయి, కాని అనుభవించిన వారికే అర్థం అవుతాయి'' ఆమె గొంతు పట్టుకుంది.

నిజమే... అనుభవించినవారికే అర్థంఅవుతాయి! ఆవిషయం తనకంటే ఎవరికి తెలుసు! తెలుసుగనకనే ఏదో చెయ్యాలని తాపత్రయపడింది నిర్మల.

"ఆంటీ... కొత్తగా పెళ్ళయిన జంట మొదటిరాత్రి మాట్లాడుకోవల్సిన విషయాలు- 'మీవాళ్ళు పెళ్ళిలో మావాళ్ళకి మర్యాదలు సరిగా చెయ్యలేదు, మా అమ్మకి, వదినకి, చెల్లెలుకి అలాంటి చీరలు పెడతారా, భోజనాలకీ వాటికీ పిలవకుండా వచ్చితింటారులే అన్నట్లు బుర్ర తిరుగుడుగా ప్రవర్తిస్తారా, టేబిల్‌మీల్స్, పిండివంటలు చేయిస్తే మర్యాదఅవుతుందా, మేం వున్న రెండురోజులు పెళ్ళివారికి మర్యాదలు





నరిగా చెయ్యాలని తెలదా, ఎం అంట ఏమిటో తెలుసా! మా ఆస్థిపాస్తులు ఎంతోతెలుసా? మీనాన్నలాంటివారిని పదిమందిని కొనగలంమేం. మా ఇంట్లోవున్న నగలుచూస్తే కళ్లు తిరిగి పడతారుమీరు. కట్నంవద్దన్నాం అంటే డబ్బువద్దన్నాం. అల్లుడి హోదాకు తగ్గట్టు ఓకారు అయినా ఇవ్వాలని తెలీదా...' మొదటి రాత్రి నవవధువుతో మాట్లాడవలసిన మాటలా ఇవి ఆంటీ! ఆమె మనసు ఆనాడే విరిగిపోకుండా ఎలావుంటుంది ఈ మాటలువిని. హనీమూన్‌కి వెడదాం అంటే శెలవులేదన్న మనిషి వాళ్ళింటికి వెళ్ళి గృహప్రవేశం, సత్యనారాయణవ్రతం, కామేశ్వరి పెట్టడం అంటూ పదిహేను రోజులుండిపోయారు రోజుకి ఒక పూజచేస్తూ. వాళ్ళ వేడుక మనం కాదనం. కాని కొత్తభార్యని సరదాగా నాల్గురోజులు తిప్పితీసుకురావచ్చుగదా. ఆమాత్రం సరదా, సున్నితత్వం తెల్సిన మనిషయితే మొదటిరాత్రే భార్య ఫీలింగ్స్‌ని హర్ట్ చేస్తాడా! 'మావాళ్ళు మర్యాదలు సరిగా చెయ్యకపోతే ఆ తప్పునాదా! అసలు వాళ్ళుమాత్రం మర్యాదలకి ఏం లోపంచేశారు. హొటలు రూమ్స్, కార్లు, కాఫీలు, టిఫిన్లు, గ్రాండ్‌గా రిసెప్షన్, బట్టలు అవీ అన్నీచేశారు. పాతకాలం పద్ధతులు- ఆ మొహాలు కడగడాలు అవి మాకు తెలియవు. అంతగా అవన్నీ జరగాలనుకున్నప్పుడు ముందే చెప్పిచేయించుకోవచ్చుగదా! కట్నం వద్దన్నారంటే ఎనభైవేల కారు ఇవ్వాలనా అర్థం... ఆ ఎనభైవేలిచ్చి కట్నం ఇచ్చాం అని మేంగొప్పగా చెప్పుకుంటే సరిపోతుందిగా. కారు ఎనభై, పెళ్ళిఖర్చు యాభై, నా నగలు చీరలు యాభై... మా నాన్న మరీ లక్షాధికారా? ఏదో ఒక్కర్తే కూతురినని తలకుమించిఖర్చుపెట్టారు. వాళ్లకి అవన్నీ కావాలనుకున్నప్పుడు ముందే చెబితే మాకు తాహతువుంటే చేసుకునేవాళ్ళం, లేదంటే ఇంకో సంబంధం చూసుకునేవాళ్ళం. ముందుగొప్పగా ఏమీవద్దని తర్వాత ఈసాధింపులు ఏమిటి? చదువు సంస్కారం వున్న వాళ్ళయితే ఇలాంటి చిన్నవాటికి కొత్తకోడలిని ఇలా ట్రీట్ చేస్తారా' అని నేను ఆవేశంగా దులిపేశాను. ఆయనగారి మొహంచూడాలి... 'మొదటిరోజే ఇలా మాట్లాడినదానివి నీవేంకాపురం చేస్తావు? ఆడదానికి అణుకువ నేర్ప

లేదా మీవాళ్ళు? నీఆర్గుమెంట్స్ నాదగ్గరకాదు. మావాళ్ళు ఎంత బాధపడుతున్నారు. మా అన్నయ్య పెళ్ళిలో కారిచ్చారు. అడుగడుగునా ఎంత మర్యాదలు చేశారు. మీరిలా అని తెల్సుంటే అసలు చేసుకునేవారంకాదు' రుస రుసలాడుతూ అన్నారు."

'మీరిలా అని తెల్సుంటే మావాళ్ళు చచ్చినా ఇచ్చేవారుకాదు' అన్నాను వళ్ళు మండి.

"ఆంటీ... అడుగడుగునా మీవాళ్ళిలా, మీ అమ్మలా, నాన్నలా అని దెప్పుతూంటే ఎలా భరించటం. అందరినీ వదులుకుని ఆశలు, కలలు అన్నీ భర్తమీద నిలుపుకొని వెళ్ళిన నవవధువు మనసు ఈ మాటలకి ఏమవ్వుతుందో ఆలోచించండి. అందులో చిన్నప్పటి నించీ ఆడింది ఆటగా, పాడింది పాటగా పెరిగానేమో వాళ్ళందరి తిరస్కారం సహించటం నావల్లగాలేదు. కొత్తకోడలు అత్తింటికి వచ్చిందన్న సంబరంలేకపోగా అందరూ నన్నుచూసి నేనేదో ఘోరాపరాధం చేసినట్లు మూతులు ముడుచుకునేవారు. నాతో ఎవరూ మాట్లాడేవారుకాదు. అందరూ గదిలోచేరి గుసగుసలాడుకుంటూ నేవెళ్ళగానే ఆపేసేవారు. మాటకిముందు 'మాపెద్దపి య్యాలవారు ఇంతఘనంగా చేశారు. అంత గొప్పగాచేశారు. ఈ కారు మా పెద్దాడికి వాళ్ళి చ్చారు. చిన్నవాడికీ పెళ్ళయితే కారు వస్తుందని కొనలేదు. మాకేంలేదా పోదా! ఏదో అత్తవారిచ్చారంటే అదో సరదా. ఇదుగో ఇప్పుడు కట్టుకున్న ఈ చీర పెద్దబ్బాయిపెళ్ళికి మొహాలు కడిగించినప్పుడు పెట్టారు. అప్పు గింతలకి రెండువేల ఖరీదయిన చీరపెట్టారు' అంటూ నందు దొరికినప్పుడల్లా దెప్పిపొడిచేవారు. ఆయన ఆ మాటలన్నీ వింటూ మొహం మాడ్చుకుని కూర్చునేవారు. గదిలోకి రాగానే మళ్ళీ అవన్నీ అంటూ సాధించేవారు. అసలు నేను కొత్త భార్యనన్నదే ఆయనకి గుర్తులేనట్టు, ఎన్నాళ్ళబట్టో కాపురం చేస్తున్నదాన్ని సాధించినట్టు సాధించేవారు. తొలిదినాల్లో వుండాల్సిన ఆ మోజన్నా వుండేదికాదు. ఆయనకి ప్రేమానురాగాలు లేకపోయినా, ఉదయం లేవగానే భార్యకాఫీతెచ్చివ్వాలి, ఇద్దరూ గదిలో కూర్చుని సరదాగా తాగాలి, సాయంత్రం అలాషికారు వెళ్ళాలి, ఓమల్లెపూలు కొనాలి, సాయంకాలం ఏడాబామీదో ఏకాంతంగా కూచోవాలి లాంటి చిన్నకోరికలు, సరదాలుకూడా లేవా మనిషికి. పొద్దున్నే అమ్మదగ్గర వంటింట్లో స్టౌదగ్గరకూర్చుని కాఫీతాగేవారు. నేననే మనిషినే ఇంట్లో ఉన్నట్లు పట్టించుకునేవారు కాదు ఎవరూ. ఆ ఇంట్లో కాస్తోకూస్తో నాతో మాట్లాడిన మనిషి తోటికోడలు మాత్రమే! ఆవిడ మాటల్లోనూ మ కంటేవాళ్ళుగొప్పవాళ్ళని, మాకంటే వాళ్ళు పెళ్ళి బాగాచేశారు అన్న గర్వం కనబడేది. మా అన్నయ్య రిసెప్షన్ అయినవెంటనే వెళ్ళిపోయాడు. వాడున్నంతసేపు వాడితో ఎవరూ మాట్లాడలేదు. ఆవున్నఒక్కరోజులోనే వాడు పరిస్థితి గ్రహించాడు. వెళ్ళేటప్పుడు పాపం చాలా ఫీలయ్యాడు.

'విద్యా... ఏమిటోనే వీళ్ళవరస నాకర్థంకావటంలేదు. బావయినా మాట్లాడడు. ఏమిటో ఎలాగెటాన్ అవుతావో ఇక్కడ' అన్నాడు దిగులుగా.

అసలే విరిగిన నామనసు వాడలా అనగానే పట్టలేని దుఃఖంవచ్చింది. మావాళ్ళు ఎంచి ఎంచి పప్పులో కాలేశారు. వెతికివెతికి ఈకొంపలో పడేశారునన్ను అని దుఃఖం వచ్చింది. వాడు వెళ్ళాక ఏడుస్తుంటే అనునయించకపోగా 'ఎందుకా ఏడుపు? ఏదో ఈనాటికి నీవొక్కర్తివే కాపురానికి వచ్చినట్లు ఏడుస్తున్నావే, అడవిలో ఉన్నట్లు దిగులుపడ్తున్నావెందుకు పాపం' అని హేళనచేశారు.

పెళ్ళయిన పదిహేనురోజులకే నాలోసగం ఉత్సాహం, ఉత్తేజం తగ్గిపోయాయి. పెళ్ళయిన పదిహేనురోజులకే జీవితం ఇంతనిస్సారం అనిపిస్తే ఆ కాపురం ఎంతమధురంగా సాగుతుందో ఎవరూ చెప్పక్కరలేకుండానే అర్థంఅయింది. ఆయన మనస్తత్వం చాలావరకు అర్థం అయింది. ఈకాలం మగవారిలా ఏవిషయంలోనూ ఆయనకి నవీనత అంతయిష్టంలేదు. భార్య అంటే ఇంట్లో అణిగిమణిగి వుండాలనుకునే తత్వం- చిన్నతప్పులనిసైతం క్షమించే ఔదార్యంఆయనలో లేదు. చెప్పిందేచెప్పి, అనిందే అని ఇవతలివారిని ఎలా హర్ట్ చేద్దామా అనే సాడిస్ట్‌మెంటాలిటీ.





తల్లితండ్రి అంటే గుడ్డినమ్మకం. వారు చెప్పిందేవేదమని, వారు తప్పుచెప్పరు, చెయ్యరు అనే మూఢనమ్మకం. మనకీ వయసు వచ్చింది. మన ఆలోచనలతీరు వేరుగా వుండచ్చు, అన్నింట్లోనూ తల్లిదండ్రుల అడుగుజాడల్లో నడవనవసరంలేదు. తల్లిదండ్రులని గౌరవించడం అంటే భార్యతో పడుకోవాలో వద్దో కూడ వాళ్ళు చెప్పక్కరలేదు అన్న ఇంగిత జ్ఞానం కూడాలేని మనిషి. ఆయనలో సరసం, శృంగారం, సున్నితత్వం, లాలిత్యం అనేపదాలకి తావులేదు. భార్యఅనేది లాలిస్తే కరిగిపోయి పాదాలమీదవాలుతుంది అన్న నిజం తెలియని చదువుకున్న అజ్ఞాని. స్త్రీని గౌరవిస్తే ఆ స్త్రీ ఆ పురుషుడిని దేముడిలా కొలుస్తుందన్న నిజం గుర్తించలేని అవివేకి. ఇవన్నీ ఆ పదిహేనురోజులలో ఏర్పడ్డఅభిప్రాయాలు నాకు... కాని ఏమూలో, ఇక్కడ నించి వెళ్ళి మా స్వంతకాపురం పెట్టాక ఇలా ఉండదేమోనన్న చిన్నఆశతో, ఆయన వెంట హైదరాబాదువెళ్లాను. లేకపోతే అట్నించిఅటే ఇంటికి పారిపోయి వచ్చేదాన్నేమో'' విద్య ఆవేశంగా ఎగిసిపడుతున్న గుండెలతో అంది.

''విద్యా... అతనలా మాట్లాడుతున్నప్పుడు నీవుకాస్త సౌమ్యంగా నచ్చచెప్పడానికి ఎప్పుడూ ప్రయత్నించలేదా? నీవు అతనితో సరిగ్గా ఆర్గ్యూచేస్తే అతనికి మరింత తిక్కరేగేదేమో! నీవు అతను వంటరిగావుండగా సౌమ్యంగా నచ్చచెప్పకపోయావా?'' నిర్మల అంది.

''ఎందుకు చెప్పలేదు? మాకు ఈ పాతఆచారాలు అవి తెలియక కొన్ని మర్యాదలు చెయ్యలేదు. మీవాళ్లని అవమానించాలని ఏం చెయ్యలేదు. మా శక్తికిమించే పెళ్లిచేశారు. కారు అదీ ఇంక ఇవ్వలేరు అనిచెప్పాను. కాని ఆయన వింటేనా! 'తెలియకపోతే ఎవరినన్న అడిగిచెయ్యాలి, కారు ఇచ్చే తాహతులేనప్పుడు పెద్ద సంబంధాలకు ఎందుకు ఎగబడటం! నీకెంతసేపూ మీ వాళ్లని సమర్థించుకోవడమే సరిపోతుంది' అని మొండిగా వాదిస్తే ఏం చెయ్యమంటారు. మీరు తెలియదు ఆంటీ... ఆయన తత్వం అలాంటిది'' విద్య విరక్తిగా అంది.

''పోనీ హైదరాబాదు వెళ్లాకన్నా మారలేదా?''

''ఆ ఆశా నెలరోజులలో తేలిపోయింది ఆంటీ...అసలు కాపురానికి వెళ్లి ఇంట్లోకి వెళ్లగానే డల్ అయిపోయాను. అది వాళ్ల నాన్నగారిచ్చిన రెండు బెడ్‌రూమ్‌ల ఫ్లాట్. ఇల్లు బాగానే వుంది. కాని మాకింతవుంది అంత వుంది అని గొప్పలు చెప్పుకొనే మనిషి, మూడు వేలు ఉద్యోగంచేస్తున్న పెద్దమనిషి ఇల్లు- ఓ గుమస్తాదికూడా అంత బీదగా వుండదు. కింద పరుపు వేసుకుని పడుకునే వారుకాబోలు, ఓ మూల ఓ పక్కచుట్ట-తాడుకట్టి దానిమీద హాంగర్సుకి బట్టలు, ఓ గాడ్రెజ్‌టేబుల్, రెండు ఫోల్డింగ్ కుర్చీలు, వంటింట్లో ఓ కిరసనాయిలు స్టవ్, రెండు మూడు డబ్బాలు- ఇదీ ఆయన సంసారం. అలాంటి కొంప ఎప్పుడూ చూడక ఆఇల్లు చూడగానే షాక్ అయ్యాను. బాగావున్న వాళ్లు, మంచి ఉద్యోగంలో వున్నవారు, ఇల్లు చాలా మోడర్న్‌గా, టిప్‌టాప్‌గా వుంటుందనుకున్న నేను నీరు కారిపోయాను. ''ఇదేమిటి? ఇంట్లో ఫర్నిచర్ అది ఏం కొనలేదా? అప్పుడే ఆర్నెల్లబట్టి ఈ వూళ్లోవున్నారు... ఎలా మేనేజ్ చేస్తున్నారు?'' అన్నాను.

''పెళ్లయ్యాక మా అత్తవారు ఇస్తారుగా, వాళ్లేం ఇస్తారోచూసి మిగతావి కొనొచ్చు అన్నారు మావాళ్లు. అయినా మా ఇంట్లో బోలెడున్నాయి. రెండు ఫ్రిజ్‌లు, నాలుగు గాడ్రెజ్‌లు, రెండు మూడు రకాల సోఫాసెట్లు, రెండు డైనింగ్ టేబుల్స్ అన్నీ వున్నాయి. అవన్నీ నాకు, అన్నయ్యకేగా. మళ్లీ కొనడం ఎందుకు దండగ-'' అన్నారు గర్వంగా. ఆ మనిషి మాటలువిని నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు - వాళ్లింట్లోవుంటే ఇప్పుడే ఇచ్చేస్తారా - అయినా తన కాపురానికి ఏంకావాలో ముచ్చటగా అన్నీ అమర్చుకోకుండా ఎవరో ఇస్తారని ఎదురుచూడటం ఏమిటి?

''మీ ఇంట్లోవుంటే ఇక్కడున్నట్టేనా - అవున్నవన్నీ ఇప్పుడే ఇచ్చేయబోతున్నారా మీవాళ్లు'' అన్నాను వళ్లుమండి.

''మా అమ్మ మీవాళ్లేంయిస్తారోచూసి మిగతావి ఇస్తానంది'' చిన్నపిల్లవాడు తల్లి ఐస్‌క్రీం కొనిపెడతానంటే పడేసంబరం గుర్తువచ్చింది



''మీవాళ్ళేం సామానుకొనలేదా! వెనక నుంచి పంపిస్తారా...అత్తవారింటికి పంపినపుడే ఇవ్వాలటగదా'' ఆ మాటల్లో వెకిలితనంచూస్తే అసహ్యం అన్పించింది. అమ్మ 'పదివేలిస్తాను సామానుకి, మీకేంకావాలో కొనుక్కోండి మీరు హైదరాబాదు వచ్చాక నేనువచ్చి నాలుగు కొని సర్దివస్తాను' అంది. ఆ మాట అపుడు ఆయనతో చెప్పాలనిపించకపోయినా అమ్మ ఎలాగోవస్తుంది అప్పుడేనా చెప్పాలిగా అని చెప్పాను.

''డబ్బిస్తే మనం కొనుక్కోలేమా ఏమిటి... ఆవిడెందుకు మధ్యన'' అన్నారు మొహం చిట్లించి.

''కూతురి కొత్తకాపురం ముచ్చటచూడాలని వస్తుందిలెండి'' అన్నాను వళ్ళుమండి.

''ఇదిగో ఇప్పుడే చెపుతున్నాను, మీ అమ్మదగ్గర డబ్బుపుచ్చుకోగాని ఏం కొనకు. మావాళ్ళనడిగి ఏం కొనమంటే అది కొంటాను'' అన్నారు. తెల్లపోయాను.

''అదేమిటి... మావాళ్ళు ఇచ్చినడబ్బుతో నా సంసారానికి ఏంకావాలో కొనుక్కుంటాను. మధ్య మీవాళ్ళని అడగడం ఎందుకు?'' అన్నాను తీవ్రంగా.

''అంటే ఏమిటి? పెద్దవాళ్ళని అడగడం తప్పా! నీకు మీ అమ్మ ఎంతో మా వాళ్ళూ నాకు అంతే!'' అని ఎగిరారు.

''పెద్దవాళ్ళంటే-ఇలా అత్తవారిచ్చిన డబ్బుతో ఏం కొనుక్కోవాలోకూడా వాళ్ళ పర్మిషన్ అడగాలా? నేను పెళ్ళాడింది మిమ్మల్ని, మీవాళ్ళతో కాపురం చేయడంలేదు. ఇది నా ఇల్లు, నా సంసారం. నాకు నచ్చినవి, నా టేస్ట్ ప్రకారం కొంటాను'' గట్టిగా అన్నాను. కొత్త కాపురానికి ఇంట్లో అడుగుపెట్టగానే మా మధ్యజరిగిన సంభాషణఇది. ఆంటీ... మీరు చెప్పండి. ఆ పరిస్థితిలో ఏభార్య అంతకంటె శాంతంగా వుండగలదు. నేను చదువుకొన్నాను... నాకూ వ్యక్తిత్వం వుంది... అభిరుచులు ఉన్నాయి. భర్త అంటే గౌరవం, అత్తమామలంటే భక్తి వుండాలి... ఒప్పుకుంటాను. కాని చదువు సంధ్యలేని పాతకాలం ఆడపిల్లలా భర్తవెంట తలవంచుకునివెళ్ళి మాటకి ఎదురాడకుండా పెట్టింది తిని, వళ్ళు ఇమ్మన్నప్పుడుఇచ్చి చాకిరిచేసుకుంటూ భర్తే దైవం అని నమ్మే ఆనాటి ఆడపిల్లనిగాను. నా స్థితిలో మీరుంటే ఇలాకాక ఇంకెలా మాట్లాడతారు.'' నిలేసినట్లు అంది.

నిర్మల నిట్టూర్చింది. ఆ స్థితి తనకంటే ఎవరికి బాగా అర్థంఅవుతుంది.

''ఆయన మొహం మాడ్చుకున్నారు. ఆరోజంతా నాతో మాట్లాడలేదు. హోటల్నుంచి క్యారియర్ పట్టుకొచ్చాడు ఎవరో కుర్రాడు. ఉన్నది ఒకటే పరుపు. అది మామూలుగా నవదంపతులకి ఎక్కువే. కాని మనసు విరిగిన నేను ఆయన రమ్మంటేగాని వెళ్ళకూడదని నా పెట్టెలో దుప్పటి కిందపరుచుకుని ఎయిర్ పిల్లో పెట్టుకుని పడుకున్నాను. కింద అలవాటులేక నిద్రపట్టక దొర్లాను. ఆ మగమహారాజుకి రాత్రి పెళ్ళాం అవసరంవచ్చి పక్కమీదికి లాగారు. మొగుడు కనక చచ్చినట్టు వళ్ళప్పగించానుకాని నాకే అనుభూతి ముందురోజునుంచీ కలగలేదు. కలిగించాలని ఆయనెప్పుడూ ప్రయత్నించలేదు. అంత సరసంతెలిస్తే మా కాపురం ఇలా ఎందుకుంటుంది. మర్నాడు ఉదయంలేస్తూనే 'ఈ హోటల్‌తిండితిని తిని మొహంమొత్తింది. సామానుతెస్తాను... వంటమొదలుపెట్టు' అన్నారు.

''వంట! నిజానికి వంట నాకురాదు! అయినా పెళ్ళికిముందు అమ్మ, బొత్తిగా అన్నంవండటం అన్నారాకపోతే ఎలాగే అంటూ బలవంతంగా అన్నం, చారు, కొన్ని తేలిగ్గా అయ్యేకూరలు చెయ్యడం చెప్పింది. కాని ఇలావచ్చినరోజే పొయ్యిముందు కూర్చోవాలి అనుకోలేదు. నా ఊహలప్రకారం నామొగుడు పెద్ద ఉద్యోగస్తుడు. ఆ ఇంట్లో అన్నీ వుంటాయి. గ్యాస్‌స్టవ్, కుక్కర్, గ్రైండర్ అన్నీ వున్న మోడర్న్‌కిచెన్ నేను వచ్చేసరికి రెడీచేసుంటారు. వంటమనిషికాకపోయినా ఏ కుర్రోడో అయినా తప్పకుండావుంటాడు. నేను వంట చేస్తానన్నా ఆయన ఒప్పుకోరు. రోజూ ఆఫీసునుంచి రాగానే సరదాగా ఎటోఅటువెళ్ళి వచ్చేటప్పుడు హోటల్లో భోజనంచేసి రావచ్చు! ''డార్లింగ్... ఇప్పటినుంచి వంట అవిపెట్టుకోకు. కొన్నాళ్ళు ఎంజాయ్‌చేద్దాం. నీవిప్పటినుంచి ఆ వంటింట్లో పడివుంటే నే చూడలేను-'' అంటా

# లైఫ్‌బాయ్ ఎక్కడో ఆరోగ్యం అక్కడ




## లైఫ్‌బాయ్

**మురికిలోని క్రిములను వదలగొడుతుంది**

హిందూస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS L 98 1611 TL

రు అని ఊహించుకున్న నాఊహలు తలకిందులయ్యాయి. నిజానికి భర్త అలా అంటే ఆ భార్య కరిగిపోయి వంట రాకపోయినా ఎలాగో తంటాలుపడి తన చేత్తో భర్తకి వండిపెట్టాలని తాపత్రయపడుతుంది. 'మీరిన్నాళ్లూ హొటలు భోజనం తిన్నారు, నే వచ్చాకనూ డానా' అని ఆమే వండుతుంది.

''వంట నాకేం అంతరాదు...ఏదో అన్నం చారు, వేపుడు కొద్దిగావచ్చు. అయినా బాబూ ఈ కిరోసిన్ స్టవ్‌మీద వండలేను నేను. గ్యాస్ స్టవ్, ప్రెషర్‌కుక్కర్ అవి లేకుండా ఎలా బాబూ? అమ్మని రానీండి అన్నీకొన్నాక వంట మొదలు పెట్టొచ్చు. మధ్యాహ్నం లంచ్‌కి మీరె లాగోరారు. నేను ఏదో తినేస్తాను. సాయంత్రం ఏదో హొటల్‌కివెళ్లి తినివద్దాం. బ్రేక్‌ఫాస్ట్‌కి బ్రెడ్, ఎగ్స్ అవి తీసుకురండి' అన్నాను.

''అబ్బ... ఇన్నాళ్లూ హొటల్‌కూడు తప్పలేదు. ఇప్పుడూ బ్రెడ్ ఆమ్లెట్లు తినడం నావల్ల గాదు. వంటనేర్పకుండా మీ అమ్మ ఏంచేసింది ఇన్నాళ్లు- మొగుడికి వండిపెట్టాలని తెలీదా' విసురుగా ఎత్తిపొడిచారు.

''ఆ మొగుడు పెద్ద ఉద్యోగస్తుడు, ఏవంట వాళ్లనోపెట్టి వండిస్తారనుకున్నాను''

''మాటలు వచ్చు బాగానే. ఆ నేర్పు పనిపాటల్లో వుంటే బాగుండేది. ఆడది వంటకూడా చెయ్యకపోతే మరి ఆ పెళ్లాం వుండి ఏంలాభం?'' రుసరుసలాడుతూ బాత్‌రూంలో దూరారు. కట్టుకున్న ఆశాసౌధం ఒక్కో అంతస్థు కళ్లముందే కూలిపోతున్నట్లనిపించింది. ఆయన అలా అన్నారన్న పంతంకొద్దీ ఆ కిరసనాయిల్ స్టవ్‌మీదనే, ఆ వున్న గిన్నెలతోనే ఎలాగో వంటవండాను. కిర్సనాయిల్ పొగకి కళ్ళుమండాయి. చేయి కాల్చుకున్నాను. కూర తరుగుతూ వేలు కోసుకున్నాను. ఫిజికల్ బాధలన్నింటినీమించి మనసుకి కలిగిన గాయంతో వంటచేస్తూ బొటబొట కన్నీరు కార్చాను.

కొత్త భార్య, కొత్త కాపురం, తెల్లచీర, మల్లెపూలు, పండువెన్నెల, పరిమళాలు, అగరువత్తులు, తాంబూలాలు, సెంట్లు...ఈపదాలకి అర్థాలు తెలియనేలేదు నా మూడునెలల సంసార జీవితంలో. అమ్మ ప్రత్యేకంగా కొనిచ్చిన తెల్లవాయిల్ చీరలు పెట్టె అడుగునే వుండిపోయాయి. రకరకాల ఫారెన్‌సెంట్లమూత తెరవలేదు. ఖరీదయిన కొత్తచీరలతో షికార్లు తిరగలేదు. మ్యాచింగ్ బ్యాగులు, చెప్పులు ఇళ్లు కదలనేలేదు.

నేను వచ్చేనని తెలిసి ఎవరో ఇద్దరు ముగ్గురు ఆయన కొలీగ్స్‌మాత్రం భార్యలతో వచ్చారు. ఎవరన్నావస్తే కూర్చోపెట్టడానికి కుర్చీఅన్నాలేదని సిగ్గుపడ్డాను. గతిలేకపోతే వేరే సంగతి. అన్నీవుండి ఈ దరిద్రం ఏమిటని బాధపడేదాన్ని.

నా ఉత్తరంచూసి అమ్మ డబ్బుపట్టుకువచ్చింది - మాఇల్లు నావాలకంచూసి బెంబేలుపడిపోయింది. 'అయ్యయ్యో... పదిహేసురోజులకే ఇలా తయారయ్యావేమిటే? ఈ స్టవ్ ఏమిటి? ఆ మసిగిన్నెలేమిటి? అంట్లు నీవు తోమడం ఏమిటి? పనిమనిషన్నా లేకుండా వంటెందుకు మొదలుపెట్టావసలు? ఈ ఇల్లేమిటి గుమస్తా కొంపకంటె కూడా అధ్వాన్నంగా వుంది. ఏం మనిషేఇతను' అంటూ గోలపెట్టింది. అమ్మ వచ్చాక ఆయన పలకరించనన్నాలేదు. గదిలో మూతిబిగించుకుని కూర్చున్నారు. ఆయన ఆఫీసుకి వెళ్లాక జరిగిందంతా చెప్పుకుని ఏడ్చాను - వాళ్లన్న మాటలు, వాళ్ల ట్రీట్‌మెంట్ అంతా చెప్పాను. అమ్మగుండెలు జారిపోయాయి. ''ఇదేంఖర్మ, ఎత్తి ఎత్తి ఎంగిలాకులమీద అడుగువేసినట్టు, ఈ సంబంధం మనపాలపడింది. వాళ్లకంటే పోనీ బుద్ధిలేదు, ఇతను చిన్నవాడూ ఈ కాలంవాడు. ఇతని బుద్ధి ఏమయింది? వెధవ లాంఛనాలు, మర్యాదలు అంటూ దానికోసం నిన్ను బాధపెడ్తారా... వుండు రానీ అతని పనిచెబుతాను. పిల్లనిచ్చాం అంటే వాళ్లడుగులకి మడుగులు వత్తి నోరుమూసుకుని మేము పడివుండాలా? అంత కావల్సినవారు 'మాకేం అక్కరలేదని' గొప్ప కబుర్లు చెప్పకుండా ఇలాకావాలి అని ముందే ఏడవచ్చుగా' అంటూ అమ్మ ఆవేశపడింది. ఇద్దరం ఏంచెయ్యాలో తోచక తలలువట్టుకున్నాం. 'ఉండు మీనాన్నగారిని రమ్మని ఫోనుచేద్దాం. పెళ్లయిన నెలకే కాపురంఇలా వుంటే ముందెలావుంటుందో, నాన్నని నాలుగూ అడగమందాం' అంది.




ఆయన సాయంత్రం ఆఫీసునుంచి రాగానే అమ్మ ఆవేశం అణుచుకుని శాంతంగానే "పిల్ల సంసారానికి కావల్సినవి నాలుగు కొన మని ఆయన పదివేలిచ్చి నన్నుపంపారు. మీ సంసారానికేం కావాలో తెచ్చుకోవచ్చు బజారుకె డదాం పదండి" అంది.

ఆయన మొహంగంటుపెట్టుకుని "ఇప్పు డేంవద్దు. నేనెలాగో ఆరునెలలు ట్రైనింగ్‌కి వెళ్లాలి. అయినా ముందు మావాళ్లని అడ గాలి. మా ఇంట్లో అన్నీవున్నాయి. ఏం కొన మంటారో అడగాలి" అన్నాడు. అమ్మ వళ్లు మండింది. అయినా శాంతంగానే, అల్లుడుగ నక ఆవేశం దిగమింగుకుని- "అక్కడుంటే మీకేంవస్తుంది? ట్రైనింగ్‌కి వెడితేమాత్రం బొత్తిగా మంచాలు, పరుపులు అయినా లేకుండా కిందపడుకోడానికి ఏంఖర్మ! దానికస లు ఈకిరసనాయిల్ స్టవ్‌లు అవి అలవాటులే దు. నాలుగు కుర్చీలన్నా కొనుక్కోకుండా ఏం దరిద్రంఇది. మీకు వీలుకాకపోతే మేం ఇద్ద రంవెళ్లి తెస్తాం' అంది. "పద విద్యా... తయా రవు మనిద్దరం వెడదాం' అంది అమ్మ. అమ్మ గదిలోంచి వెళ్లగానే- "ఇదిగో నాకేం అక్కరలే దు. కొన్నావంటే ఆ మంచాలమీద నేను పడుకో ను. నీవు కొనుక్కుని నీవే పడుకో' అన్నారు మొండిగా.

"అసలు మీరేం మాట్లాడుతున్నారో అర్థం అవుతుందా... మీకెందుకింత పంతం" అన్నా ను కోపంగా.

"మా నాన్నగారికి రాయకుండా, వాళ్లకి చె ప్పకుండా నేనేంచెయ్యను. మీవాళ్ళిచ్చే కుర్చీల కి, మంచాలకి మొహంవాచిలేను. మహా ఏకారో తెచ్చియిచ్చినట్టు పదిసార్లు పదివేలు తెచ్చా నని మీ అమ్మ గొప్పగా చెపుతూంది"

"అదన్నమాట అసలు సంగతి, కారు కావా లన్నమాట- ఆ కారుకోసం ఇన్ని డొంకతిరుగు ళ్లు ఎందుకు... సూటిగా అడగవచ్చుగా" నిలేశా ను.

మా గొడవకి అమ్మ గదిలోకి వచ్చింది- "అమ్మా... మీ అల్లుడుగారికి కారు కావాలట మ్మా, అందుకు ఈ అలకంతా"

"కారా...బాగుంది నాయనా. మాదగ్గర లక్ష లకి లక్షలు మూలుగుతున్నాయా? పోనీ మీరా మాట ముందుచెపితే తక్కిన ఖర్చులుమాని కారు కొనేవాళ్లం. దానికోసం పిల్లని నానామాట లు అనడం ఎందుకు? అంతా అయ్యాక ఇప్పుడు కారుఅంటే ఎక్కడినుంచితెస్తాం? మేం మామూలు సంసారులంబాబూ - పెళ్ళి అయ్యాక ఇలాంటిచిన్న విషయాలకి దాని మనసు మామనసు బాధపెట్టడం బాగులేదు బాబూ"

"ఏమిటి... మీఅమ్మాయి మేం అష్టకష్టాలు పెడ్తున్నట్టుచెప్పిందా?" పెడసరంగా అన్నా రు.

"కన్నతల్లితోకాక ఇంకెవరితో చెప్పు కుంటుంది! అష్టకష్టాలుఅంటే తిండి పెట్ట కుండా మాడ్చిచంపడం, తిట్టడం, కొట్టడం మాత్రమేగాదుబాబూ... కొత్త పెళ్లికూతురు మనసు సన్నజాజిలా అతి నాజూగ్గా వుంటుంది. ఆ పూవుని సున్నితంగా వాసన చూడాలి. జడలోతురమాలి- అంతేకాని మోటుగా పట్టుకుంటే నిమిషంలో వడిలిపో తుంది. కొత్తకోడలిని, కొత్తభార్యని అపురూ పంగా కాకపోయినా ఆదరంగాఅయినా చూశ రా-పెళ్లిళ్లలో ఏవేవో చిన్నచిన్న లోపాలు, పొరపా ట్లు జరుగుతాయి. ఆ కారణంతో అభంశుభం తెలియని పిల్లని, అందరిని వదులుకుని మీ ఇంటికి వచ్చిన పిల్లని చూసేవిధానం ఇదేనా?" అమ్మ బాధగా అంది.

"ఏం... ఏంచేశాం మేము...! ఏదో నేరం చేసినట్టు నిలేస్తున్నారే"

అమ్మ ఏదో జవాబీయబోతుంటే నేనే బల వంతంగా బయటికి లాక్కెళ్ళాను - ఆయన అమ్మతో అమర్యాదగా ఎక్కడ మాట్లాడతారో నని. ఆ పూటకి ఇంక బజారులేదు ఏంలేదు --

ఆమర్నాడు "నేను వెళ్ళి మీ నాన్నగారిని పంపిస్తానే. ఇతని మూర్ఖపు మాటలు చూ స్తుంటే నాకేమిటో భయంగావుంది. మనం సామానుకొంటే మాత్రం ఇతను పంతంకొద్దీ వాడకపోతే కొని ప్రయోజనం ఏమిటి --" అంది దిగులుగా. ఆ వున్న ఒక్కపూటలో కూతురి కాపురం తీరు అర్థమైపోయింది అమ్మ కి. ఎడమొహాలతో కూర్చున్న మమ్మల్ని చూడ లేక అమ్మ మర్నాడే వెళ్ళిపోయింది.

పెళ్లయి నెలరోజులు అయింది. నా కాలేజి పోతుంది. అటెండెన్సు పోతుంది. ఈయన ఫారెన్‌వెళ్ళే సంగతి ఇంకా ఏమీతేలలేదు – చదువువంకనన్నా ఇక్కడినుంచి పోతే చాలని పించింది. ఓరోజు నా చదువుమాట ఎత్తాను 'క్లాసులు పోతున్నాయి త్వరగా వెళ్లాలి' అన్నాను.

"నీవా ఎమ్మే పూర్తిచెయ్యకపోతే కొంప ఏం మునగదులే" నిర్లక్ష్యంగా అన్నాడు.

"ఒక ఏడాది చదివి, ఇంకో ఆరునెల లుండగా మానేస్తానా-- ఏమయినాసరే కంప్లీట్‌చెయ్యాలి నేను. పెళ్ళికి ముందే చెప్పాను ఆమాట"

"అంతగా చదవాలనివుంటే ప్రైవేటుగా వెళ్ళు పరీక్షకి"

"ఏడాది అయ్యాక ఇప్పుడు మానుకుంటే ఒక ఏడాది వేస్ట్ అవుతుంది నాకు. ఆరునెలల కోసం మళ్ళీ ప్రైవేటుగా అప్పియర్ అవాలా" కోపం అణుచుకుంటూ అన్నాను. ఆయన తనని కాదన్నట్టు జవాబివ్వలేదు. "పెళ్ళికి ముందు మీవాళ్ళు మీరు ఎలాగూ ఆరునెలలు ట్రైనింగ్‌కి వెడతారు. అప్పుడు కంప్లీట్ చెయ్యొచ్చు అన్నారనిగాని లేకపోతే అసలు పరీక్షలయ్యేవరకు పెళ్ళికి వప్పుకోలేదు నేను" రెట్టించి అన్నాను.

"చూద్దాంలే... నా వీసా ఇంకా రాలేదు. నేనిక్కడుండగా నీవు వెళ్ళి అక్కడ చదవకపోతే మరేం కొంపమునగదు. అయినా పెళ్లయ్యాక వుంటే మొగుడిదగ్గర వుండాలి, లేదంటే అత్తింట వుండాలిగాని పుట్టింట్లో ఎందుకు? నేవెళ్ళాక నీకంతగా చదవాలని వుంటే మాఇంట్లో వుండి చదువు" అన్నాడు. నన్నెలాగోలాగ రెచ్చగొట్టి, నాచేత వాగించి, ఏడిపించాలనే ఆయన తత్వం అర్థంఅయి ఉక్రోషం వచ్చింది.

"ఒక ఏడాది అయ్యాక మళ్ళీ అక్కడ చదవాలా! యూనివర్సిటీలు వేరు. అయినా మీరు లేనపుడు మీ ఇంట్లో ఎందుకుండాలి, మా ఇంట్లోవుండే చదువుతాను" నేను మొండిగా తెగేసి చెప్పాను.

"అయితే అసలు చదవక్కరలేదు. మాట్లాడకుండా ఇంట్లో కూర్చో. ఉత్త డిగ్రీకే ఇంత మిడిసిపడ్తున్నావు పోస్టుగ్రాడ్యుయేట్ అయితే నీ పొగరింకా ఎక్కువ అవుతుంది" ఆయన నన్ను రెచ్చగొట్టేవిధం చూస్తే, కల్పించుకుని కావాలని నాతో దెబ్బలాటకి కారణం వెతుక్కుంటున్న ఆయన సాడిస్టిక్ మెంటాలిటీకి కసి, ఉక్రోషం వచ్చాయి.

"నేను చచ్చినా చదువాపను నన్నాపగలరేమో చూడండి చూద్దాం" కసిగా సవాల్‌చేశాను.

"మీ వరస ముందురోజునుంచీ చూస్తున్నాను. మీరింత సాడిస్ట్ అని తెలిస్తే చచ్చినా చేసుకొనేదాన్నికాదు. మీరసలు ఏమనుకుంటున్నారు నాగురించి? మీరేంచేసినా, ఏం అన్నా నీవేగతి నాధా అంటూ మీ కాళ్లదగ్గిర పడుంటాననుకుంటున్నారా... పెళ్ళయిందగ్గిరనుంచి చూస్తున్నాను... ఏమిటసలు మీ ఉద్దేశం. మీరసలు ఏ పదోశతాబ్దంలోనో పుట్టాల్సిన మనుషులు. మీ థింకింగ్, మాటలు, చేతలు... ఐ హేట్‌యూ... ఐ హేట్‌యూ..." అంటూ అరిచాను. "మీ చదువు, ఉద్యోగంచూసి మోసపోయాం. చదువుకి, సంస్కారానికి సంబంధంలేదని రుజువుచేశారు మీరు. మీలో ఒక్కటంటే ఒక్క ప్లస్‌పాయింట్ లేదు. ఏ ఆడదీ మీతో కాపురంచెయ్యలేదు" ఏం అంటున్నదీ తెలియనంత ఆవేశంగా అలిసిపోయేవరకూ అరిచి గదిలోకి వెళ్ళి తలుపు భళ్ళున మూసుకుని ఆరోజంతా తిండి తినకుండా తనివిదీరా ఏడ్చాను.




అయిదురోజుల తరువాత నాన్నగారు వచ్చారు. నన్నూ, నా అవతారాన్ని, నా ఇంటిని చూసి నేనెంత సుఖంగావున్నదీ ఎవరూ చెప్ప

నక్కరలేకుండానే గ్రహించారు. అంత గంభీరంగావుండే ఆయన కళ్ళల్లో నీరు చిమ్మింది. 'ఏమిటమ్మా ఇదంతా?' అన్నారు బేలగా.

"నా ఖర్మడాడీ" అన్నాను పట్టుకొన్న గొంతుతో. నాలాంటి కేర్‌ఫ్రీ గర్ల్, నాలాంటి మోడర్న్‌గర్ల్ నోటినుంచి ఖర్మ, పాపంలాంటి మాటలు ఎన్నడూ వినని నాన్నగారు నిజంగా తల్లడిల్లిపోయారు.

"నన్ను ఇక్కడినించి తీసుకెళ్ళిపో డాడీ! నేనిక్కడ వుండను. ఐయామ్ ఫీలింగ్ మిజరబుల్ హియర్. ఓ సరదాలేదు పాడులేదు – ఇలాంటివాళ్ళమధ్య నేనుండలేను డాడీ నేనింక చదవనక్కరలేదుట. చదివినా వాళ్ల ఇంట్లోవుండి చదవాలిట. ప్రతిరోజూ ఏదో వంకతో నన్ను దెప్పి సాధించి ఏడ్పిస్తారు. ఐ కెనాట్ టోలరేట్ ఎనీమోర్... నాకీ మొగుడు వద్దు, కాపురం వద్దు. ముప్పైరోజులకే ముప్పైఏళ్ల అనుభవం పూర్తయినట్టుంది డాడీ! నెలరోజులకే ఇలావుంటే ఈ మనిషితో ఇంకో నలభైఏళ్ళు కల్సి ఎలా బతకడం. ఇంపాసిబుల్... నావల్లకాదు... పెళ్లి అంటే లైఫ్‌లో ముఖ్యమైన టర్న్. జీవితానికి పెళ్లి ముఖ్యం. వప్పుకుంటాను... కాని ఇలాంటి పెళ్ళికాదు డాడీ పెళ్ళి జీవితంలో ఆనందాన్ని సమాధిచేసేట్లయితే ఇంక పెళ్ళికి అర్థంఏమిటి డాడీ?"

జవాబు చెప్పలేనివారిలా నాన్నగారు నిస్సహాయంగా నిట్టూర్చారు.

"పోనీ ఎలాగో అలాగ ఆ కారు కొనిస్తాను, అప్పుడన్నా తిన్నగా వుంటారేమో" ఆశగా అన్నారు.

"నో... వీల్లేదు డాడీ! కారుకోసం కొత్త పెళ్ళికూతుర్ని ఇలా ట్రీట్‌చేసే మనుషులు ఆకారిచ్చాక ఇంకేదో కావాలంటే! అలా ఇస్తూండగలరా – ఒక ప్రాణంలేని వస్తువుకోసం ప్రాణమున్న మనిషి మనసుని చిత్రవధచేసే ఈ కుసంస్కారులమధ్య నేనుండలేను డాడీ... నాకీ కాపురం వద్దు, నన్ను మీతో తీసుకువెళ్లండి. జరిగిన నష్టం చాలు, కారిచ్చి ఇంకో ఎనభైవేలు నష్టపోవడం ఎందుకు. ఆ డబ్బుతో కొద్దిగానైనా నేను సుఖం అనుభవించవచ్చు... ఈ మనుషులమధ్య ఇలా బతికేకంటే" ఆవేశంగా అన్నాను.



"అమ్మా... పెళ్ళంటే అంత సుళువుగా ఒక్కరోజుతో తెంపుకొనిపోయే బంధం కాదు. నీవన్నంత, అనుకున్నంత సుళువు కాదు వెళ్ళి పోవడం. అయినా మనం అంత తొందరపడటం మంచిదికాదు"

"తొందరపడకపోతే నిండా మునిగేవరకు వుండమన్నారా! రేపు నాకు ఏ ప్రెగ్నెన్సీనో వస్తే ముడి బిగిసి ఈ ఇల్లు నాకు బందిఖానా అవుతుంది డాడీ! నేను గత పదిరోజులబట్టీ చాలా ఆలోచించాను డాడీ. ఈ మనిషి తత్వం మారేదికాదు... ఇలాంటి మొగుడితో కాపురం నావల్లగాదు. నిండా మునిగేవరకు నన్నిక్కడ వుంచితే మీ కూతురు మీకు దక్కదు... ఆలోచించుకోండి" తీవ్రంగా అన్నాను.

నాన్నగారు విస్తుపోతూ చూశారు. బహుశా ఈకాలం పిల్లల తెగువకి ఆశ్చర్యమేమో!

"అపుడే అంతదూరం ఆలోచించావా విద్యా... చూడమ్మా...! కొన్నిరకాల వస్తువులు కొన్నిరకాల ద్రవాలలోనే కరుగుతాయి. ఆ సరి అయిన ద్రావకమేమిటో చూడాలిగాని కరగదు అని వదిలేసిపోతే పని సానుకూలపడేది ఎలా తల్లీ! ఇతను బహుశా తల్లిదండ్రులమాట విని ఏదో అపోహతో ఇలా ప్రవర్తిస్తున్నాడేమో, నేవెళ్ళి మీ మామగారితో మాట్లాడతాను. నలుగురు పెద్దమనుషులతో చెప్పిస్తాను. మన ప్రయత్నం మనం చెయ్యకపోతే ఎలా తల్లీ"

"డాడీ... తల్లి, తండ్రి అందరికీ వుంటారు. పెద్దవాళ్లమాట వినేది వుంటుంది... విననిది వుంటుంది. అసలా తల్లీతండ్రి కూడా నా కాపురంలో నా డబ్బుతో ఏంకొనుక్కోవాలో కూడా చెప్పేటంత జోక్యం ఎందుకు కల్గించుకోవాలి. అసలుఆవిషయాలు ఈయనెందుకు చెప్పాలి వాళ్ళకి. డాడీ... ఎవరో ఏదో చెపితే ఈయన బుద్ధి ఏమయింది? చదువుకున్నవాడు, పెద్ద ఉద్యోగం చేస్తున్నాడు. మిగతా మగవాళ్లంతా పెళ్ళాలని ఇలా ట్రీట్‌చేస్తున్నారా... డాడీ? మీరేంచెప్పినా అతని బేసిక్ నేచర్ మార్చలేరు. మీరేదో ద్రావకంతెచ్చి కరగిస్తానంటున్నారు. కరిగిస్తే ఆకారం కోల్పోవచ్చుకాని బేసిక్ ప్రాడక్ట్ ఆ ద్రావకంలోంచి ఎక్కడికి పోతుంది. ఈయనా అంతేడాడీ... ఐ థింక్ సమ్‌థింగ్ రాంగ్ విత్‌హిమ్! మీది వృథాప్రయాస డాడీ" అంటూ వాదించాను. చిన్నప్పటినుంచీ డాడీతో ఏదో విషయంలో ఆర్గ్యూచేయడం అలవాటు. ఆరోజు నా ఆర్గ్యుమెంటుకి డాడీ జవాబు చెప్పలేకపోయారు.

'చూద్దాం అమ్మా! ఒక ఛాన్సు ఇచ్చిచూడటం మనధర్మం. నీవేదో నాకు బరువని, నీకు పెళ్ళిచేసి పంపేసి నా బాధ్యత తీరిపోయిందని అనుకోవడంలేదు. నీ జీవితంలో నిజంగా సుఖసంతోషాలు కరువయ్యేస్థితి వస్తే చూస్తూమాత్రం వూరుకోను. లోకంకోసం, సంఘంకోసం నిన్ను పిరికిగా బలిపెట్టను... ఐ ప్రామిస్... నేను మీ ఆయనతో, మీ అత్తవారితో మాట్లాడతాను' అన్నారు.

తర్వాత నాన్నగారు, సాయంత్రం ఆయన ఆఫీసునుంచి వచ్చాక బయటికి తీసుకెళ్లి దగ్గిరున్న పార్కులోఒగంట కూర్చోపెట్టి మాట్లాడారు. 'నాకు చాలాపొగరని అత్తమామ లన్నగౌరవం లేదని, పెద్దచిన్నలేకుండా వాదిస్తానని, పెళ్లిలో వాళ్లవాళ్లకి చాలా అమర్యాదలు జరిగాయని, తనవాళ్లు చాలా అవమానంగా ఫీలయ్యారని, తనవాళ్ల అవమానం తనదని, ఈరోజు పెళ్లవగానే, తల్లితండ్రులని పట్టించుకోకుండా వాళ్లమాట లెక్కచెయ్యకుండా వదిలేయడం తనవల్లకాదని, మీ అమ్మాయికి మొగుడుకావాలిగాని ఆమొగుడి తల్లితండ్రి పనికిరారా? ఆడపిల్లకి అణకువ వుండాలి, ఇలా పెడసరం జవాబులు చెప్పేపిల్ల కాపురం ఏంచేస్తుంది. మొగుడిమాటవింటే పరువుతక్కువ, స్త్రీజాతికి అవమానం అన్నట్లు ప్రవర్తిస్తుంది. మీ అమ్మాయికి బుద్ధిచెప్పుకోండి. కాపురం కావలిస్తే ముందు అత్తమామల్ని తరువాత భర్తని గౌరవించి వాళ్లమాటలకి విలువ ఇవ్వాలని చెప్పండి. నాకు నీతులు చెప్పే ముందు మీ కూతురిని అదుపులో పెట్టుకోండి" అని మామగారు అనయినాలేకుండా ఆవేశంగా పట్టుకుదులిపారట. 'పెళ్లిలో మీ ప్రవర్తనకి మీరు మావాళ్లదగ్గిరకి వెళ్లి క్షమాపణ చెప్పాలి. మావాళ్లకి మర్యాదయిస్తే నాకు ఇచ్చినంత. మా ఇంట్లో మా నాన్నగారికి చెప్పకుండా, ఆయన అంగీకారంలేనిదే ఏంజరగదు - ఈరోజు మీ అమ్మాయి లెక్కలేదంటే కుదరదు' అని తెగేసిచెప్పారట.





అది విని ''డాడీ... ఇంకా మీరు వాళ్లింటికి కూడా వెళ్లి ఇన్సల్ట్అవుతారా! నేను వప్పుకోను డాడీ. వాళ్లచేత మాటలుపడాల్సిన ఖర్మ మీకేమిటి? నాకోసం వాళ్లముందు తలవంచడం నేను సహించను'' అన్నాను. అల్లుడి మాటలకి ఆయన ఎంత అవమానపడ్డారో చిన్నపోయిన ఆయన మొహంచూస్తేనే తెలుస్తుంది.

''తప్పదుకదమ్మా, ఆడపిల్లనికన్నాక'' శుష్కహాసం చేశారు.

''ఆడపిల్ల! ఏం... ఆడపిల్లనికంటె వాళ్ల పాదాలు వత్తాలా. మీరు అన్నింట్లోనూ అంత మాడర్న్అయివుండి ఈ విషయానికి వచ్చేసరికి పాతచింతకాయభావాలు మాట్లాడుతున్నారేమిటి? ఆడపిల్లని కన్నంతమాత్రాన మీ తప్పు లేకపోయినా క్షమాపణ చెప్పాలా? ఈ ఆడపిల్లే లేకపోతే ఒకడికి పెళ్లాం, మరొకడికి తల్లి, చెల్లి, పిల్ల ఎలా వుండేది? ఆడపిల్ల...ఆడపిల్ల. ఆరోజులు పోయాయి డాడీ. ఆడపిల్ల అయినంతమాత్రాన ఆత్మాభిమానం చంపుకుని పడుండాలనే ట్రాష్ నేనునమ్మను. ఐడోంట్‌కేర్ దిస్ బ్లడీమేరేజ్. ఈ పెళ్లి, మొగుడు లేకపోయినంతమాత్రాన నేను చచ్చిపోను అని నిరూపిస్తాను-'' నారక్తం వుడికిపోయింది. డాడీ ఎటూ చెప్పలేక నిస్సహాయంగా వుండిపోయారు. ఆయన మొహంచూస్తే నాకోసం ఆత్మాభిమానం చంపుకుని ఓసారి మా అత్తవారింటికి వెళ్లి మాట్లాడుతారనిపించింది.

''వెళ్లారా మీ డాడీ? వాళ్లేం అన్నారు''? ఆరాటంగా అడిగింది నిర్మల.

''ఆ... వెళ్లారు. అమర్యాదా అయింది. వాళ్లూ ఇవేమాటలు అన్నారట. మర్యాదలేని మనుష్యులని ముందేతెలిస్తే ఈ సంబంధం చేసుకునేవారంకాదు - అని మొహంమీదే దులిపారట. మా ఇంటికి వచ్చిన పిల్ల మా అదుపాజ్ఞలలోవుండాలి, నా ఇష్టం అంటే వూరుకోం. మీ అమ్మాయికి కాపురం కావలిస్తే పెద్దలపట్ల గౌరవం, అణకువగా ఎలా మెలగాలో ముందు నేర్పిపంపండి'' అని నానామాటలూ అన్నారుట.

వినివిని నాన్న వళ్లుమండి ''ఈకాలంలోనూ మీలాంటి అత్తమామలు వుంటారని తెలిస్తే పురాణగ్రంథాలు అన్నీ వల్లెవేయించి, పతివ్రతలకథలు బట్టీపెట్టించి అత్తమామల పాదాలు ఎలా వత్తాలో నేర్పేవాళ్ళం. రోజులుమారాయి, మనుషులు మారివుంటారనుకున్నాం. పెద్దలంటే గౌరవం కల్గాలంటే పెద్దరికం నిల్పుకుంటే పిల్లలు గౌరవిస్తారు. ఈరోజుల్లో ఎవరికాపురాలు వాళ్లు చూసుకోగలరు. ఆడపిల్లలంటే వంటింటికుందేళ్లు అనుకునే రోజులుపోయాయి. ఇదివరకులా ట్రీట్‌చేస్తే నాకూ తురేగాదు ఏ ఆడపిల్లా సహించదు. వాళ్లూ చదువుకుంటున్నారు. వాళ్లకీ ఓ వ్యక్తిత్వంవుందని గుర్తించారు. మీరెలా పడివుండమంటే అలాపడివుండే రోజులుపోయాయి. ఆడదానికి మొగుడెంత అవసరమో, మగాడికి పెళ్లామూ అంతే అవసరం అని వాళ్లకీ తెలుసు. నా కూతురైనంతమాత్రాన నీభర్తే దైవం, కొట్టినా తిట్టినా ఇక్కడే పడుండు అంటే వినరు ఈ కాలం పిల్లలు. మీవాడికి పెళ్లాం అక్కరలేదంటే, మా అమ్మాయి మొగుడు అక్కరలేదనుకోడానికి సిద్ధంగావుంది. మీరు ఆలోచించుకుని మా అమ్మాయితో మీ అబ్బాయి కాపురం చెయ్యలేడనుకుంటే కోర్టులున్నాయి విడిపోవడానికి. మాకూ మానంమర్యాద వుందన్న సంగతి మరిచిమాట్లాడకండి. మీరు, మీ అబ్బాయి ఏసంగతీ తేల్చుకుని మాపిల్ల అక్కరలేదనుకుంటే నెలరోజుల్లోగా తెలియచెయ్యండి. అంతేగాని మీ ఇష్టం వచ్చినట్లు ట్రీట్‌చేస్తే సహించం'' అని గట్టిగా చెప్పి వచ్చేశారట. కాళ్లబేరానికి వచ్చి ప్రాధేయపడ్తారని, తప్పయింది క్షమించండి అంటారని ఆశించిన వాళ్లు నాన్నమాటలకి తెల్లపోయి మొహాలు మాడ్చుకున్నారు''

''మీ ఆయనకి తెలుసా ఇలా అన్నారని. తరువాత ఏంజరిగింది?''

''ఎందుకు తెలియదు. తండ్రికొడుకులు ఉత్తరాలు రాసుకున్నారు. తండ్రి ఉత్తరంచూసి మాఆయన రెండురోజులు మొహం మాడ్చుకున్నారు. నాతో మాటలు ఇంకా తగ్గించారు''

''అంటే... కాస్త తగ్గారన్నమాట!''

''ఏమో ఏంజరిగేదోకాని ఈలోగా అన్నయ్యకి సడన్‌గా పెళ్లికుదిరింది. మళ్లీ మూఢం

వస్తుందని పదిహేనురోజులలో ముహూర్తాలు పెట్టుకున్నారు. నాన్న నాకు ఫోనుచేసి పెళ్లికి పదిరోజులముందుగా రావాలని, బట్టలు అవి కొనాలని, పనులున్నాయని రమ్మన్నారు. నాకు చాలాసంతోషం కల్గింది. అన్నయ్య పెళ్లి సంతోషంకంటె ఈ నరకంనించి వెళ్లి నావాళ్లతో కొన్నాళ్లయినా సరదాగా గడపవచ్చని సంబరపడ్డాను. ఆసంబరంమీద వెంటనే ఈయన నీళ్లు చిలకరించారు. "ఇంకా పదిరోజులుంది, ఇప్పటినుంచి ఏం వెళ్లక్కరలేదు. తరువాత చూడచ్చు" అన్నారు అడిగితే.

"మాడాడీ ఫోనుచేశారు, చీరలు అవి కొనాలని ముందుగా రమ్మన్నారు"

"అయితే వెళ్లు, నా పర్మిషన్ అక్కరలేనపుడు, నామాట విననపుడు నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి. నీకు మొగుడు అక్కరలేదు, మీనాన్నకి అల్లుడు లెక్కలేదు. అలాంటప్పుడు ఇంకా వుండటం ఎందుకు, ఏకంగావెళ్లు" అన్నారు రెచ్చిపోతూ.

"ఇష్టంవచ్చినట్టు మాట్లాడకండి - అన్నయ్యపెళ్లికి వెడతాననడం మొగుడిలెక్కలేనట్టా? ఏదోవంకన కయ్యానికి కాలుదువ్వకండి" కోపంగా అన్నాను.

"మా ఇంట్లో పెద్దవాళ్లున్నారు. మీవాళ్లు మర్యాదస్థులు అయితే ముందు మానాన్నగారిని అడగాలి పంపమని. ఏం నేనింట్లో లేకపోతే తరువాత ఫోనుచేసి చెప్పారా నాకు-మానాన్నని అడగందే నేను పంపను" అన్నారు మూర్ఖంగా.

"ఏమిటీ... నేను నాఅన్న పెళ్లికి వెళ్లడానికి మీనాన్నగారి పర్మిషన్ తీసుకోవాలి. నేను అత్తవారింట్లోవుంటే మీనాన్నగారి పర్మిషన్ కావాలన్నా బాగుంది. నేనిక్కడ వుంటే, నామొగుడు మీరువుండగా ఎక్కడోవున్న మామగారి పర్మిషన్ తీసుకోవాలా - మానాన్న మీకోసం రెండుసార్లు ఫోన్‌చేశారు - మీరులేరు. మనింట్లో ఫోనులేదు, పక్కింటికి ఎప్పుడుబడితే అపుడు ఎన్నిసార్లు చేస్తారు. నన్ను చెప్పమన్నారు. మీకు ఉత్తరం రాస్తాన్నారు - అందరికీ ఉత్తరాలు, శుభలేఖలు వెళ్లినపుడు మీవాళ్లకీ వెడ్తుంది. నేనంటే కూతురినిగనక నాకు ముందుచెప్పారు. అందరికీ ముందు ఫోనులుచేస్తారా ఎవరన్నా. కావాలని వంకలు ఎన్నుతే ఎన్నయినా దొరుకుతాయి. అనవసరంగా నాతో గొడవపెట్టుకోకండి. నేను రెండురోజుల్లో బయలుదేరి వెడ్తున్నాను" ఖచ్చితంగా చెప్పాను. చేతిలో పుస్తకం విసిరికొట్టి లేచివెళ్లిపోయారు.

నేనే స్టేషన్‌కివెళ్లి టిక్కెట్టు కొనుక్కున్నాను. వెళ్లేరోజున సామాను సర్దుకుంటుంటే- "అయితే వెడ్తున్నావన్నమాట, వెళ్లు. మరిరాకు" ఉక్రోషంగా అన్నారు. నేనులేచి నిలబడి సూటిగా ఆయనవంక చూశాను. "సరేరాను, ఇలా అన్నపెళ్లికి వెడితేనే కాపురం వదులుకోమని చెప్పేమొగుడు నాకు అక్కరలేదు. ఇంత సుళువుగా తుమ్మితే ఊడేముక్కులాంటి కాపురం కావాలన్నమోజు నాకూలేదు. నన్నురాకు అంటూ బెదిరించకండి" అని చెప్పేశాను. నేను బయలుదేరేసమయానికి ఇంట్లోలేకుండా ఎక్కడికో వెళ్లిపోయారు. నేను తెచ్చుకున్న సామానంతా తీసుకుని తాళం పక్కవాళ్లింట్లో ఇచ్చేసి వచ్చేశాను" విద్య చెప్పడం ముగించింది.

"నా గొడవలతో ఇంట్లో పెళ్ళి జరుగుతోందన్న సంతోషం కూడా లేకుండాపోయింది. అన్నయ్యలయితే, "నీవింక అసలు అక్కడికి వెళ్లడానికి వీలులేదు. డర్టీరోగ్... పెళ్లాంతో ఎలా బిహేవ్ చెయ్యాలో తెలియని వెధవకి కాపురం ఎందుకు? మరేం ఫరవాలేదు. లోకం నాలుగు రోజులు అంటుంది. తరువాత నోరు మూసుకుంటారంతే. ఈ అన్నవాళ్లందరూ వచ్చి నీ కాపురం చక్కదిద్దుతారా? ఎంతమాత్రం వెళ్లద్దు. ఏంచేస్తారో చూద్దాం" అన్నారు కోపంగా.

నాన్నగారు నా భవిష్యత్తు గురించిన చింతతో ఏంచెయ్యాలో తోచక, ఎటూచెప్పలేక నలిగిపోయారు. అమ్మ ఓసారి కూతురు కాపురం ఇలా అయిందని ఏడుస్తుంది. మరోపక్క ఎవరేం అంటారోనన్న ద్వంద్వభావాలతో సతమతమవుతుంది. ఏదియేమైనా అందరూ ముందు ఈ ఏడాది చదువు పూర్తిచెయ్యమని, ఈలోగా వాళ్లు దారికి వచ్చేదీ లేనిదీ తేలిపోతుందని అప్పుడే ఏంచెయ్యాల్సిందీ ఆలోచిద్దాం అన్న నిర్ణయానికి వచ్చారు."

నిర్మల నిట్టూర్చింది. "నీ మారీడ్ లైఫ్ ఇలా




అయినందుకు సారీ విద్యా. నిజం చెప్పా లంటే... నీ పెళ్లిరోజున పెళ్ళిపీటలమీద నీ పక్కన అతన్ని చూస్తుంటే ఎందుకో, ఏదో అపశృతి అన్పించింది... నీలాంటి లైవ్లీ, కేర్‌ఫ్రీ గర్ల్‌కి అతను మరీ సీరియస్‌టైపు అన్పించింది... కాని విద్యా, నీకంటే పదిహేనే ళ్లు పెద్దగా ఓమాట చెపుతున్నాను. నీవు ఈ ఏడాది చదువు ఆపకు. ఎమ్మే పూర్తిచెయ్యి. కానీ వాళ్లతో ఇప్పుడు మీరేం చెప్పొద్దు... మరీ తొందరపడి తెగతెంపులు చేసుకోవాలని ఆరా టపడవద్దు. అతనెలాగూ ఓ ఆరునెలలు జర్మనీ వెడతాడు. నీవెలాగో ఈలోగా చదువు పూర్తిచెయ్యాలికనక ఇప్పుడు రాను అని చెప్ప చ్చు అడిగితే-- అతను తిరిగి వచ్చాక ఈ ఏడాదిలో మనుషులెలా మారతారో చూద్దాం. మీరూ పట్టుదలగా వున్నారని వాళ్ళు తగ్గవ చ్చు. వాళ్ళకీ కోడలు కాపురం వదిలిపో యిందంటే అవమానమేగా? కొడుకు కాపురం చెడటం వాళ్ళకీ ఇష్టంవుండదుగా-- ఈలోగా వాళ్ళూ సర్దుకుని దారికి రావచ్చు. వాళ్లలో అప్పటికీ ఏమార్పూ రాలేదంటే అపుడే నీవో నిర్ణయానికి రావచ్చు. అంచేత వాళ్ళిప్పుడు ఏంఅన్నా ఏం రాసినా, నువ్వు ఎమ్మే కంప్లీట్ చెయ్యాలి అన్నమాట తప్ప ఇంకేం జవాబు చెప్పకండి'' నిర్మల సలహాఇచ్చింది.

''అంటే ఇలాంటి మనుషులు మారతారని మీకింకా నమ్మకం వుందా. మారినా అది నిజ మైన మార్పు అవుతుందా! మనుషుల బేసిక్ నేచర్ ఎలా మారుతుంది. నన్ను రప్పించేందుకు మారినట్టు నటించి, తీరా మళ్ళీ నేవెళ్ళాక బాధపెడితే ఎలా ఆంటీ? నాకెందుకో ఈ కాపురం సాగేదికాదు అన్పి స్తోంది. ముందురోజునించే ఇద్దరిమధ్య విము ఖత చోటుచేసుకున్నాక ఆ సంసారంలో సామర స్యం ఏంవుంటుంది? అలా సర్దుకు బతకా ల్సిన లైఫ్ నాకక్కరలేదు ఆంటీ-- నా భర్త మనసావాచా నన్నే కోరుకుని, నాకోసం ఏదన్నా చేయగల్గినవాడయి వుండాలిగాని ప్రతిదానికీ సాధించి ఏడ్పించేవాడు నాకక్కరలేదు. ఐకె నాట్ ఎడ్జస్ట్ టు దట్ సార్ట్ ఆఫ్ లైఫ్''

''విద్యా... ఈనాడు వున్న నీ అభిప్రాయాలు ఇంకో పదేళ్ళుపోయేసరికి మారిపోతాయి. అప్పుడు... అప్పుడు... నీవు పశ్చాత్తాపపడినా ప్రయోజనం వుండదు. ఏ భర్తా పూర్తిగా పర్ ఫెక్ట్‌గా వుండడు. కన్నెగా మనం కన్నకలలకి నిజజీవితానికి పోలిక వుండదు. నూటికో కోటికో ఏ అదృష్టవంతురాలికో సరసుడు, సహృద యుడు అయిన భర్త దొరుకుతాడు. కొందరు కొత్తమోజులో కాస్త లాలన, అనురాగం చూప చ్చు. ఓ రెండేళ్లు గడిచేసరికి, ఇద్దరు పిల్లలు పుట్టుకొచ్చేసరికి జీవితం రొటీన్ అయిపో తుంది. ఎవరో అన్నట్టు 'మేరేజ్ ఈజ్ నథింగ్ బట్ జస్ట్ ఏన్ ఎడ్జస్ట్‌మెంట్'. ఇద్దరూ కల్సి సర్దుకొని బతకాల్సిన జీవితం పెళ్ళి అంతే! ఒకరి ఆశలు, ఆశయాలు, కోరికలు ఒకరివి ఒకరికి నచ్చకపోయినా సర్దుకుంటూ వచ్చే అండర్‌స్టాండింగ్ వున్న వివాహం చిన్నచిన్న ఒడిదుడుకులున్నా సాగిపోతుంది. ఆ ఎడ్జస్ట్ మెంట్‌లేని దంపతులు కొట్టుకుంటూ తిట్టు కుంటూ బతుకీడుస్తారు. అంతేతప్ప ప్రేమలు, అనురాగాలు సినిమాల్లోమాదిరి ఒకరిని చూసి ఒకరు మైమర్చిపోవడం, కళ్ళల్లోకి అనురా గంతో చూసుకోడం, ఒకరికోసం ఒకరు త్యాగా లు చేసేసుకోడం అంతా అందమైన కల్పన. నిజజీవితంలో అదంతా సత్యదూరం! పరస్పర అవగాహన, పరస్పర గౌరవం ఇచ్చిపుచ్చుకునే దంపతులు నూటికి ఒకరున్నా సంతోషమే! కొంతమంది మనసులో ఏంవున్నా పైకి నటిస్తా రు. అది చాతకానివాళ్ళు బ్లంట్‌గా మాట్లాడి ఇతరులని నొప్పిస్తారు. ఏ పురుషుడయినా తనది కానంతవరకే ఆ స్త్రీపట్ల మక్కువ, ప్రేమ చూపిస్తాడు. విలువ ఇస్తాడు. భార్య కాగానే కొత్తమోజు నాల్గురోజులుంటుందే తప్ప పాతప డగానే అసలు రంగులు బయటికి వస్తాయి. అంచేత నేను చెప్పేది ఏమిటంటే... నీవూ హించిన జీవితానికి, నిజజీవితానికి వున్న తేడా చూసి బెంబేలుపడిపోయి తొందరపడి ఏవో నిర్ణయాలు తీసుకోవద్దనే''

''అంటే నేను పట్టు పాన్పులు, పూలపాన్పు లు కావాలనలేదు. సినిమాలలో మాదిరి డ్యూ యట్లు పాడాలనలేదు. ఒక చిరునవ్వు, ప్రే మగా పలకరింపు, కాసింత క్షమ, ఔదార్యం... ఏ భార్య అయినా ఆశించే కనీసపు కోరికలు ఇవి. ఆమాత్రం సానుభూతి చూపలేని భర్తతో




కాపురం చెయ్యమని చదువుకున్న మీరు అనడం ఆశ్చర్యంగా వుంది ఆంటీ--''

''హుఁ... ఈ చదువు జీవిత పాఠాలు చెప్ప దు విద్యా. ఈ చదువు విజ్ఞానాన్ని ఇస్తుంది గాని జీవితంలో అనుభూతులని ఇవ్వలేదు. అనుభూతి లోపించిన జీవితం గమ్యంలేని ప్రయాణంలాంటిది. విద్యా... నీకిప్పుడు పట్టు మని ఇరవైఏళ్ళు లేవు. ఇంకో పదేళ్ళుపోతే ఈ వేడి, ఆవేశం తగ్గి వెనుదిరిగి చూసుకుంటే నీవు నష్టపోయింది భూతద్దంలోమాదిరి పదిరె ట్లు కనబడి నీ మనశ్శాంతిని హరిస్తుంది. వేజారిపోయిన కాలాన్ని వెనుదిప్పలేక, ముందురుసాగే కాలంతో నిస్పృహతో కదలాలి అప్పుడు. ఆ నిస్పృహనించి నిర్లిప్తత, నిరాస క్తత, నిస్తబ్దత బయలుదేరి బతుకు భారం అనిపిస్తుంది. బతుకులో సారం లోపించాక బతుక్కి అర్థం కనబడదు...'' నిర్మల చెప్పుకు పోతోంది.

విద్య నిర్మలని ఆశ్చర్యంగా చూసింది. ''ఆంటీ... మీరేమిటి ఇవాళ ఇలా మాట్లాడుతు న్నారు? మీగురించిన నా అంచనాలన్నీ తారు మారు చేస్తున్నారు ఈనాడు. మీ భావాలకి, చేతలకి, ఈనాటి మీ మాటలకి పోలికలేదు ఆంటీ!''

''ఇందాక చెప్పానుగా విద్యా, జీవితంలో అనుభవం నేర్పే పాఠాలముందు మనం తల ఒగ్గాల్సి వస్తుంది ఏదో ఒకనాడు. చూడు, ఇందాకటినుంచి నీవు చెప్పిన నీ కథ భవిష్య త్తులో ఎలా వుంటుందో చెప్పమంటావా! నీగతం మనకు తెలుసు! నీ భవిష్యత్తు నాకు తెలుసు! నీవు రేపు ఎదుర్కొవలసిన సమస్య లు, సంఘటనల గురించి నేనీరోజు నీకు చెపుతాను. అక్షరాలా అలా జరగకపోవచ్చు కాని తొంభైశాతం జరుగుతుందని నేనీరోజు నీకు కాగితంమీద రాసిస్తాను. ఇంకో పదేళ్ళుపో యాక ఈరోజు నేను అన్నమాటలు గుర్తు తెచ్చుకుంటావు. కాని ఏంలాభం. ఇట్‌విల్ బి టూలేట్... అందుకే నీ హితైషిగా బాగా ఆలో చించమని, తొందరపడద్దని చెపుతున్నాను.''

''ఆంటీ! మీరునాకు పిరికిమందు పోస్తు న్నారు. మా అమ్మ మీకంటె ముందుతరంది అయినా ఆమె నాకిచ్చినపాటి ధైర్యం మీరు నాకీయడంలేదు. అలాంటి భర్తతో ఇంకా కా పురం కూడానా అని నా తరపున మీరు అందరితో వాదిస్తారని ఆశించాను. మీ ఈ మాటలు నేను ఎదురుచూడనివి. మీలాంటి వ్యక్తిత్వం, ఆశయాలు, స్వతంత్రభావాలువున్న ఒక స్త్రీ ఇలా మాట్లాడటం నాకు ఆశ్చర్యంగా వుంది. ఆంటీ... నా భవిష్యత్తు ఏమయిపో తుంది? చదువుకుంటాను. ఏదన్నా ఉద్యోగం చేసుకుంటాను. నాగతంతెలిసి రెండో పెళ్ళికి అభ్యంతరం లేనివాడెవరన్నా వస్తే పెళ్ళిచేసు కుంటాను. లేదంటే హాయిగా, స్వేచ్ఛగా ఇష్టంవచ్చింది తింటూ, తిరుగుతూ లైఫ్ ఎంజాయ్ చేస్తాను. ఆ మొగుడు లేకపోతే నాకెవరు లేరా! అమ్మ, నాన్న ప్రాణం ఇస్తారు. అన్నయ్యలు నాకోసం ఏదన్నా చేస్తారు. ఏదో గతిలేనివాళ్ళు చదువు సంధ్యా లేనివాళ్ళ యితే మీరన్నట్టు భవిష్యత్తు గురించి బెంగప డాలి'' విద్య జవాబు చెప్పమన్నట్టు సవాల్ చేస్తూఅంది.

నిర్మల నిట్టూర్చింది.

''విద్యా... జీవితంలో డబ్బు ముఖ్యమైనదే... కాదనను. దీనినిమించి జీవితంలో చాలాకా వాలి. మీ అమ్మగారిది కన్నకడుపు కనుక నీవు బాధపడటం సహించలేక నీవు చేసింది మంచిపని అని అనకపోయినా నీవు తమకు బరువుకాదని అనుకుంటున్నారు. విద్యా... నీకింకా పట్టుమని ఇరవైయేళ్ళులేవు. ఇంకో ఏభై యేళ్ళ జీవితంవుంది. అన్నాళ్ళు నీ తల్లిదండ్రులు నీకుతోడుండరు. నీ అన్నలు వాళ్ళ సంసారాలు రాగానే నీకోసం ఏమన్నా చేస్తామన్నమాట మీద నిలవరు. విద్యా! నీకోసం నీవాళ్ళు, నీఇల్లు అన్నది వుండాలి విద్యా''

''ఏమో! ఏ రెండేళ్ళో గడిచాక ఎవరన్నా నచ్చినవాడు దొరికితే మళ్ళీ పెళ్ళిచేసుకుంటా ను. జీవితం అంతా ఇలాగేవుండి పోతాననలే దు గదా'' విద్య నిలేసింది.

నిర్మల అదోలా నవ్వింది.

''అలా జరిగితే మంచిదే. కాని మనిషి ఆలోచనలు తన చెప్పుచేతల్లో వున్నాయని గర్విస్తాడుకాని అతనిచేతిలో ఏమీలేదన్నది గు

ర్తించడానికి ఇష్టపడడు. నీవు చెప్పినంత సు ళువుకాదు నీ ఆలోచనలు నెరవేరడం. విద్యా... నాకు తెలిసిన నీలాంటి అమ్మాయి కథ ఒక్కటి చెప్పనా... ఆ అమ్మాయిదీ నీలాంటి కేసే. భార్యాభర్తలిద్దరూ పడక విడిపోయారు. అలా విడిపోయిన భార్యాభర్తల కథలన్నీ ఇంచుమించు ఒకలాగే వుంటాయి కొద్దితేడాతో. కనుక వాళ్ళెందుకు విడిపోయారన్నది వది లేసి, ఆమె భర్తనించి విడిపోయి పుట్టింటికి వచ్చాక ఒక పదేళ్ళ కథ చెపుతాను... ఆమె.. పేరు కూడా నిర్మల అనుకో...''

నిర్మల చెప్పడం మొదలుపెట్టింది.

★ ★ ★

నిర్మల మంచి కుటుంబంలో పుట్టింది. అందమైనది, చదువుకున్నది.

తండ్రి శివశంకరంగారు లాయరు. ముగ్గు రు మగపిల్లల తరువాత పుట్టిన కూతురిని అపురూపంగా ముద్దుగాపెంచారు. ఎమ్మే కా గానే చక్కటి సంబంధంచూసి పెళ్ళిచేశారు.

పిల్లని కన్నారుగాని దాని రాతను కనలేదు అన్నట్టు ఎంతో ఖర్చుపెట్టి చదువుకున్న మంచి ఉద్యోగంలోవున్న అల్లుడిని తేగలిగారు కాని కూతురి సుఖ సంతోషాలని కొనలేకపోయా రు తల్లిదండ్రులు.

ముందునుంచీ ఆపెళ్ళి వక్రించింది. భార్యాభర్తలమధ్య వాదనలు, మాటపట్టింపు లతో మొదలై పరస్పర ద్వేషాలతో చివరికి విడిపోయేవరకు దారితీసింది ఆ పెళ్ళి. ఆ భర్త తన కనీసపు కోరికలయినా తీర్చడని, కనీసపు వూహల స్థాయికి కూడా అందడని అలాంటి కాపురంలో తనకి ఏఆనందం, సౌఖ్యం, మనశ్శాంతి ఏమీలేదని పుట్టింటివాళ్ల తో చెప్పుకుని ఏడ్చేది నిర్మల. ఆ భర్త అసలు పుట్టింటికి కూడా పంపకుండా సాధించి, ఏడ్పించి, కాల్చుకుని తినడం ఆరంభించాడు. అన్నీవుండి కూతురు కాపురం ఎందుకిలా తయారయిందో అర్థంకాక తల్లడిల్లిపోయారు ఆ తల్లిదండ్రులు. నిర్మల ఆ కాపురం ఇంక చెయ్యనని మొరాయించింది. భర్త మరింత కసితో, ద్వేషంతో తిట్టడం, కొట్టడం తాగివచ్చి అసభ్యంగా ప్రవర్తించుతూ నానా హింసపెట్టే వాడు. నిర్మల జీవచ్ఛవంలా తయారైంది. ఓ రోజు భర్తకి చెప్పకుండా ఇల్లువదిలి పారిపోయి పుట్టిల్లుచేరింది.

కూతురి అవతారంచూసి, చేతిలో టిక్కెట్టు న్నా లేకుండా, దమ్మిడీ లేకుండా బికారి దానిలా తిరిగివచ్చిన నిర్మలనిచూసి వాళ్ళ గుండెలవిసిపోయాయి. శివశంకరంగారు అల్లుడిని నానాతిట్లు తిట్టారు. వాణ్ని మూడు చెరువుల నీళ్ళు తాగిస్తానని ఎగిరారు.

అల్లుడితో మాట్లాడాలని వెళ్ళిన ఆయన్ని గుమ్మంలో నిలబెట్టి నానా తిట్లుతిట్టి పంపించా డు అల్లుడు.

వియ్యంకుడికి రాస్తే 'మీ పిల్లకి ముందు నించి కాపురంచేసే లక్షణాలులేవు. భర్తఅన్న గౌరవం లేకుండా కయ్యానికి కాలుదువ్వి మా వాడిని రెచ్చగొట్టేది. ఆడదానికామాత్రం సహనం, అణుకువ లేకపోతే కాపురం ఏం చేస్తుంది. అలాంటి పిల్లమాకు అక్కరలేదు. మీ పిల్లని మీరేం చేసుకుంటారో చేసుకోండి' అని రాసిపడేశారు ఉత్తరం.

అవమానంతో శివశంకరంగారి మొహం ఎర్రబడింది.

''పోనీ వెధవలని, నా కూతురు నాకు బరు వయి వెళ్ళానా వెధవ దగ్గరికి? పిల్లనిచ్చిన పాపానికి ఒకసారి ప్రయత్నించడం నాధర్మం అని వెళ్ళాను. ఇంక వాళ్ళకి, మనకి ఏంసంబంధంలేదు. వాడిపేరు ఎవరూ ఎత్త డానికి వీలులేదుఇంట్లో. నా కూతురికి అసలు పెళ్ళే కాలేదనుకుంటాను. ఓ లక్ష రూపాయలు పోతేపోయాయి. కనీసం నాబిడ్డ నాకు దక్కింది. ఇంకా నాల్గురోజులు అక్కడవుంటే దాని పీకకి ఉరి బిగించేవారు. లేదంటే అదే ప్రాణంవిసిగి ఉరిపోసుకునేది. నీరూ... ఈ ఆరు నెలలు నీ జీవితంలో పీడకల అనుకో తల్లీ. అసలు ఈ ఆరునెలలు లేవనుకుని ఆ జ్ఞాపకాలు తుడిచేసుకో అమ్మా'' అన్నారు.

ఆయన అన్నంత తేలిగ్గా తల్లి శారదాంబ గారు ఆ విషయాన్ని తీసుకోలేక పోయింది. కాని కోపంతో చిందులు తొక్కుతున్న భర్త ఏం అంటాడోనని అప్పటికి వూరుకుంది ఆవిడ.

''ఏమండీ... ఆరు నెలలు కాపురంచేసిన





పిల్లని ఇంటికి తెచ్చారు. ఎన్నాళ్ళు అది పుట్టింట్లోపడి వుంటుంది. ఓ అచ్చటా ము చ్చటా ఏమీ లేకుండా కాపురం, పిల్లలు ఏమీలే కుండా జీవితాంతం ఇలా మోడులా వుంటుందా. మీదంతా ముందాలోచన లేనివ నులు. అదంటే చిన్నది. లోకానుభవంలేనిది. తొందరపడింది. అన్నీ తెల్సిన మీరూ తొందర పడితే ఎలా... పెళ్ళి అనే బంధం తెంచు కుంటే పోతుందా? అంత సుళువుగా పోయేది అయితే ఇన్ని లక్షలమంది ఎన్ని బాధలు పడుతున్నా కాపురాలు ఎందుకు చేసుకుంటు న్నారు. కాస్త ఏ పెద్ద మనుషులనో తీసుకెళ్ళి అతనికి నచ్చచెప్పాలిగాని..'' రాత్రి నెమ్మదిగా భర్త దగ్గర ఆ ప్రస్తావన తెచ్చింది.

''నువ్వు నోరు మూయిముందు. నచ్చచెప్పా లట.. ఎవడికి... నా మొహాన తలుపేసిన ఆ వెధవతో ఇంకా కాళ్ళబేరానికి దిగమంటావా. ఆనాడు కాళ్ళుకడిగానని ఇప్పుడు వాడి కాళ్ళు పట్టుకోమంటావా! వాడికి పెళ్ళాం అక్కరలేక పోతే నా కూతురికి మొగుడు అక్కరలేదు. దానికి మళ్ళీ పెళ్ళి చేసి వాడికి బుద్ధి చెపుతా ను చూస్తూండు'' తీవ్రంగా అన్నారు.

'' ఆ... చూద్దురుగాని! పెళ్ళయి ఆరు నెలలు కాపురంచేసిన పిల్లకి మళ్ళీ పెళ్ళి మీరన్నంత సుళువుగాదు'' శారదాంబ నిదా నంగాఅంది.

''శుభం పలకరా అంటే నీలాంటివాడే ఏదో అన్నాడట. పోనీ పెళ్ళికాకపోతే హాయిగా ఉద్యోగం చేసుకొని దర్జాగా దానిబతుకు అది బతుకుతుంది. నీవనవసరంగా గోలచె య్యారు.'' భార్యమీద ఎగిరారు శివశంకరంగా రు.

నిస్పృహయంగా నిట్టూర్చింది ఆవిడ.

''ఏమిటమ్మా ఇంకా ఆ షర్బరోగ్‌తో మాటలే మిటి మనకు. వాడుత్త రోగ్ అని నాకు ముందు రోజే అనుమానం వచ్చింది. అసలు అన్ని సంగతులూ తెల్సుకోకుండా పెళ్ళిచెయ్యడం మన తప్పు. ఇప్పుడు మనం బతిమిలాడితే ఇంకా నెత్తినెక్కి దాన్ని అణగదొక్కుతాడు. అలాంటివాడితో కాపురం ఎలాచేస్తుంది నీరు? పోనీ అమ్మా... హాయిగా ఏదో ఉద్యోగం చేసు కుంటుంది''— పెద్దకొడుకు దగ్గర ఆవిడ



ఆవేదన వెళ్లబోసుకుంటే రఘూ ఆమెని సమర్థించలేదు. ఈనాడు చెల్లెలిమీద ఒలకపోసే ప్రేమలు, సానుభూతులు రేపు పెళ్లాలు వస్తే వుండవన్న ఆవిడ ఇంగితజ్ఞానాన్ని ఎవరూ హర్షించలేదు ఆ ఇంట్లో. "అమ్మా... నేనుండటం ఇష్టంలేకపోతే ఏదో ఉద్యోగం చూసుకొని ఇంట్లోంచి పోతానుగాని, అక్కడికి మాత్రం వెళ్లను-" నిర్మల తల్లి అనునయంగా చెప్పిన మాట వినకుండానే ఎగిరిపడింది. ఆ తల్లి నిస్సహాయంగా వూరుకుంది.

"నీరూ తల్లీ... మీ అమ్మకి ఛాదస్తం- ఆవిడన్నమాటలు పట్టించుకొని బాధపడకు- నీకేం కావల్సినా నన్నడుగు, నేనుండగా నీకేం లోటు జరగదు తల్లీ! నేను లేకపోయినా నీకేలోటు లేకుండా చేసిపోతాను తల్లీ! నీవలా దిగులుగా మాత్రం కూర్చోకు. వీళ్ల మాటలు వాళ్ల మాటలు విని మనసుపాడు చేసుకోకుండా హాయిగా తిను. పుస్తకాలు చదువుకో, సినిమాలకి వెళ్లు, ఫ్రెండ్సు ఇళ్లకి వెళ్లు. నీకు కారు కావలసి వచ్చినప్పుడు అడుగు. ముందసలు నెలరోజులు శుభ్రంగా తిను. నీ ఆరోగ్యం చక్కదిద్దుకో. నా తల్లి మొహంలో కళేపోయింది. పాలు అవి తాగుతల్లీ రోజూ..." ప్రేమగా అన్నారు శివశంకరంగారు.

తండ్రి ప్రేమ, వాత్సల్యం వుండగా తనకేం కొదవ అనుకుంది నిర్మల. ఇంట్లో ఎవరూ నిర్మల గతం గురించి మాట్లాడకూడదని కట్టడి చేశారాయన. కొడుకులకి నిర్మలని సినిమాలకి తీసుకెళ్లాలని, లైబ్రరీ పుస్తకాలు తెచ్చివ్వాలని ఆయన ఆజ్ఞలు జారీచేశారు. అవి ఆజ్ఞలు అనుకోకుండా చెల్లెలిని సంతోషపెట్టడానికి నిజంగానే పాటుపడ్డారు ముగ్గురు అన్నదమ్ములూ. శలవులు వస్తే సినిమా కెళ్లేవారు. పెళ్లికి ముందులా నలుగురు కలిసి కారెమ్సు, చెస్ ఆడుకునేవారు. ఏ మంచి పుస్తకం చూసినా కొని తెచ్చేవారు. తల్లిపాలన, తండ్రి ఆలనా, అన్నల ఆదరణతో నెల రోజులలోనే పోయిన ఆరోగ్యం చక్కబడింది. మొహంలో పూర్వపు కళాకాంతులు తిరిగి వచ్చాయి. అందరూ కాస్త జరిగింది మరిచి రొటీన్‌లో పడేవేళకి అనుకోని అఘాతంలా... నిర్మల నెలతప్పింది అన్న నిజం అందరినీ దిగ్భ్రాంతిలో పడేసింది. నిర్మల ఆరోజు ఏంతిన్నా వాంతులు చేసుకొంది. శివశంకరంగారు గంభీరంగా 'ఏమిటమ్మా... ఏం తిన్నావు. బయటెక్కడన్నా ఏదన్నా తిన్నావా' అన్నారు ఆదుర్దాగా.

శారదాంబకి చటుక్కున ఏదో అనుమానం వచ్చింది. కూతుర్ని పక్కకి పిలిచి 'ఈనెల బయటున్నావా' అంది. నిర్మల గతుక్కుమంది. ఈ గొడవల్లో, ఈ హడావిడిలోపడి తన పీరియడ్ తేదీ దాటి ఇరవై రోజులయిపోయిందన్న సంగతే గుర్తురాలేదు ఆమెకి. కూతురి పాలిపోయిన మొహం చూసి ఇద్దరికీ జరిగింది అర్థం అయింది. శివశంకరంగారి మొహం కళతప్పింది. శారదాంబ కలవరపడింది. అన్నలు నిశ్శబ్దంగా అక్కడినించి వెళ్లిపోయారు.

"ఇప్పుడెలాగండీ? చూశారా, తొందరపడద్దండీ అంటే విన్నారా! ఇప్పుడేం చేస్తారు?"

"నీవు కాస్త నోరుమూసుకుంటావా" అన్నారు శివశంకరంగారు చిరగ్గా. ఇది ఆయన ఎదురుచూడని సమస్య... అనుకోని సంఘటన! ఒక్కక్షణం ఆయన మెదడు మొద్దుబారింది.

నిర్మల తలదించుకుంది. ఆమె గుండెలు దడదడలాడాయి భయంతో. ఈ కారణంగా తాను అక్కడికి వెళ్లాలా... లేదు లేదు... తను చచ్చినా అక్కడికి వెళ్ళదు... డాడీ... డాడీ... నన్నక్కడికి మాత్రం వెళ్లమనద్దు- తనెంత మూర్ఖురాలు- ఏమాత్రలో వేసుకోకుండా అంత నిర్లక్ష్యంగా ఎలా వూరుకుంది! అసలా కాపురంలో తనకి మతి వుండి ఏడిస్తేగా! ఇప్పుడెలా... ఓగాడ్... ఇదేమిటి ఇలా అయింది. ఏం కడుపుతోవుంటే అక్కడికి వెళ్లికాపురం చెయ్యాలని రూలువుందా- ఏపిల్లో పుడితే... పుడితే ఇక్కడ పెంచుకోకూడదా... అసలు పిల్ల వద్దు తనకి- అలాంటి మొగుడికి పుట్టిన పిల్ల తనకి అక్కరలేదు. అబార్షన్ చేయించుకుంటే సరి. ఒక్కక్షణంలో నిర్మలని చుట్టుముట్టిన ఆలోచనలు అవి. తండ్రితో ఏం చెప్పాలో తెలియక తటపటాయిస్తూవుండిపోయింది. శివశంకరంగారు అన్యమనస్కంగాలేచి గదిలోకి వెళ్లిపోయారు.

"హూ... మనకంటే గొప్పవాళ్లు లేరని విర్రవీగుతే మనల్నిఆడించేవాడొకడు పైనవున్నాడని మర్చిపోతే నేనున్నానని చూపిస్తాడు ఆ పైవాడు. దేనికన్నా అంతతొందరపనికిరాదు. ఇప్పుడేం చేస్తారీ తండ్రికూతుళ్లు." శారదాంబ అంది.

"ఏంచెయ్యడానికి ఏముంది. అబార్షన్ చేయించుకుంటాను. నాకీబిడ్డ వద్దు. ఆ మనిషి తాలూకు గుర్తులు నాదగ్గరవుండడానికి వీలు లేదు" ఖచ్చితంగా అంది నిర్మల.

"ఏమిటీ... అబార్షన్ చేయించుకుంటావా!" నమ్మలేనట్టుంది శారదాంబ.

"అవునమ్మా... అంత ఆశ్చర్యపోవడానికి ఏముంది. ఆమొగుడు,ఆ కాపురం వదులుకున్నప్పుడు ఈ బంధం ఎందుకు నాకు"

"ఛ... ఛ... మతివుండే మాట్లాడుతున్నావా. ఓ ఆడది. ఓ తల్లి అనవల్సిన మాటలేనాయివి. నీవు బొత్తిగా బరితెగించి మాట్లాడకు" కసిరింది శారదాంబ.

"నీవు చెప్పింది కరక్ట్. అదొక్కటేమార్గం" లోపల్నించి తల్లీకూతుళ్ల మాటలు విని వచ్చిన శివశంకరంగారన్నారు.

"నేనింకా ఈమాట దానితో ఎలా అనను అనుకుంటున్నాను. అదే అంది. ఈ బిడ్డ దాని భవిష్యత్తుకి బంధమవుతుంది. ఆ భర్తని వదులుకున్నప్పుడు ఆ బిడ్డ కోసం పాకులాడ్డంలో అర్థంలేదు. రేపు బిడ్డనికంటే నా బిడ్డని నాకప్పగించమనచ్చు అతను. కన్నాక ఇది కన్న తల్లిమమకారంతో ఆ బిడ్డని వదలలేక, ఆ పిల్లకోసం అతనితో రాజీకిదిగి అతనిషరతులు అన్నీ అంగీకరించి అతను ఏంబాధలు పెట్టినా పడుండాలి అక్కడ" లాయరు బుర్రతో ముందాలోచనతో అన్నారు ఆయన.

శారదాంబ భర్తవంక కోపంగా చూసింది. "అదంటేచిన్నది. ఆలోచనాపాడులేదు, మీరూ అలా మాట్లాడుతారేమిటి. పాపపుణ్యాల సంగతన్నా ఆలోచించండి-"

"పాపం... పుణ్యం అవన్నీ ఇదివరకటిరోజుల మాటలు. దేశంలో రోజూ కొన్ని వేలమంది ఈ పనిచేస్తున్నారు. సవ్యంగా కాపురాలు చేసుకొంటున్న భార్యాభర్తలే బిడ్డ అక్కరలేదనుకుని అబార్షన్స్ చేయించుకుంటున్నారు. మన అమ్మాయి విషయంలో అదసలు పాపమేగాదు. నీవనవసరంగా లేనిపోనివిపెట్టకు. ఈ విషయం ఈ ఇంటిగోడదాటి వెళ్లడానికి వీలులేదు. అతనికి తెలిస్తే నాకుచెప్పకుండా, నాపర్మిషన్‌లేకుండా అబార్షన్ చేయించారని గొడవపెట్టొచ్చు. మనం వీలయినంత తొందరలో డాక్టరుదగ్గిరకి వెళ్లాలి.- ఈ వూర్లో అయితే ఎవరికన్నా తెలిసే ప్రమాదంవుంది. మద్రాసులో నాకు తెల్సిన డాక్టరువుంది. మంచిగైనకాలజీస్ట్. ఆవిడకి చెప్తాను. ఈ రోజుల్లో ఇది అరనిమిషంపని"

"తండ్రి కూతుళ్లు ఎంతకి తెగించారు. నామాటకి ఈ ఇంట్లో విలువలేదని నాకుతెలుసు. సరే... ఏం చేస్తారోచెయ్యండి..." శారదాంబ కోపంగా అక్కడినుంచి లేచివెళ్లిపోయింది.

"మీ అమ్మదంతా ఛాదస్తంతల్లీ. ఆవిడకి అర్థంకావడంలేదు. రేపు ఈబిడ్డనీకు ఎంత బర్డెన్ అవుతోందో- మళ్లీ పెళ్లి చేసుకోవాలన్నాఇబ్బందే... పంతానికన్నా అతను బిడ్డకావాలని అల్లరిపెడతాడు. ఇదంతా ఆవిడకి అర్థంకాదు. నీవేం భయపడకమ్మా" అన్నారాయన.

తండ్రి అంతసులువుగా ఆ సమస్యని పరిష్కరించినందుకు నిర్మల ఆనందపడింది- ఈ కారణంగా మళ్లీ ఆనరకంలోకి వెళ్లక్కరలేదన్నది ఆమెకి ఎంతో తృప్తినిచ్చింది.




"డాడీ... ఇంట్లో కూర్చుని నాకు బోర్‌కొడ్తోంది. ఏదన్నా ఉద్యోగం చేస్తాను డాడీ" అంది ఓ రోజు నిర్మల.

నిర్మల పుట్టింటికి వచ్చి అప్పటికి ఏడాది దాటింది. ఆ సంవత్సరంలో నిర్మల పాతజి

వితం మరిచిపోయి పెళ్లికాకముందు కన్నె పిల్లగా ఎలాకేర్‌ఫ్రీగా తిరిగిందో హాయిగా అలాతిరిగింది. అబార్షన్ తంతుపూర్తయ్యాక పెద్ద ఆపదతొలిగిన సంతృప్తికల్గింది.

ఆ ఏడాదిలో నిర్మల భర్త రెండుత్తరాలు రాశాడు. ఒకటి నిర్మల ఇంట్లోంచి వచ్చేసిన నెలకి. రెండోది ఆరునెలలకి. ముందు ఉత్తరంలో నిర్మల ఇంట్లోంచి చెప్పకుండా వెళ్ళిందని, ఆమె నెలలోపల తిరిగి రాకపోతే ఆమెకి తనకి ఏ సంబంధం వుండదని రాశాడు. శివశంకరంగారు ఆ ఉత్తరం చదివి జవాబివ్వనక్కర లేదన్నట్టు పక్కనపడేశారు. ఆరునెలల తరువాత --మీఅమ్మాయి నేనిచ్చిన గడువులోపల రానందున ఇంక మీ అమ్మాయి ఈ ఇంటి గడప తొక్కరాదని, తమిద్దరి మధ్య భార్యభర్తల సంబంధం తెగిపోయిందని రాశాడు.

దానికి శివశంకరరంగారు జవాబిచ్చారు- 'నిర్మలకి ఇంక నీఇంటికి వచ్చే ఉద్దేశం లేదు. ఆ కాపురం ఆనాడే వదులుకుంది. త్వరలో డైవర్సు కాగితాలు పంపిస్తాను, ఆ కాగితం మీద సంతకం పెడితే నా కూతురు పూర్తి స్వేచ్ఛ పొందుతుంది. ఆ తరువాత నీ ఇష్టం వచ్చినట్టు నీవుచేసుకోవచ్చు' అని రాసేశారు.

ఆ ఉత్తరం చూసి నిర్మల మొగుడు నిప్పు తొక్కిన కోతిలా అయ్యాడు. బెదిరిస్తే దారికి వస్తారని, భయపెడితే కాళ్లబేరానికి దిగుతారని ఆశించిన అతను ఆ నిర్లక్ష్యం సహించలేకపోయాడు. స్వేచ్ఛ... వచ్చినా ఆ నిర్మలకి స్వేచ్ఛ దక్కనీయడు. తననించి పోయి మళ్లీ పెళ్లి చేసుకుందామని ఆమె ఉద్దేశం అయితే అది చచ్చినా జరగనీయడు అని కసిగా నిర్ణయించుకున్నాడు- ఆ ఉత్తరానికి జవాబుగా 'డైవోర్సుకు నేను సిద్ధంగా లేనని, డైవోర్సు ఇచ్చేవుద్దేశం నాకు లేదని, మీకు కావలిస్తే మీరు కోర్టు ఎక్కినా నాకేంఅభ్యంతరం లేదని; మీ అమ్మాయికి బుద్ధిచెప్పడానికి నేనెంతవరకైనా తెగిస్తాను. నేను మరో పెళ్లిచేసుకోపోయినా ఫరవాలేదు. మగవాడిని పెళ్లిలేకపోయినా లైఫ్ ఎంజాయ్‌చేయగలను. నన్ను కాదని వెళ్లిన మీ అమ్మాయి రెండోపెళ్లి ఎలా చేసుకుంటుందో చూస్తాను' అని ఉక్రోషంగా రాశాడు.

ఆ ఉత్తరం చూసి లాయరు అయిన శివశంకరంగారు కాస్త బెదిరారు. డైవోర్సు తీసుకోకుండా కూతురికి రెండోపెళ్లి చెయ్యలేరు. మూర్ఖంగా అతను నిర్మలని హింసించేందుకు డైవోర్సు ఇవ్వనంటున్నాడు అని ఆయనకి తెలుసు. అప్పుడు డైవోర్సు కోసం కోర్టుకెక్కాలి. ఎక్కినా నిర్మలని అతను బాధపెట్టాడని చూపడానికి సాక్ష్యాలు లేవు! ఏడాదిగా ఇద్దరూ కల్సి బతకడంలేదని ఇద్దరి మధ్య అవగాహనతో సెపరేషన్‌కి పెట్టుకుంటే కోర్టువారు విడాకులు ఇప్పించవచ్చు. కాని అతను పంతంగా తన తప్పులేదని, నిర్మలే ఇల్లు వదిలిపోయిందని, ఉత్తరాలు రాసినా రాలేదని, విడాకులకి తాను వప్పుకోనని అంటే కోర్టు నిర్మల వెళ్లి కాపురం చెయ్యాలని ఆదేశించవచ్చు. ఆ ఆదేశం పాటించనక్కరలేదు ఇష్టంలేకపోతే. కాని రెండో పెళ్లికి చట్టబద్ధమైన విడాకులు కావాలి గదా! ఆయన కాస్త మనసులో జంకాడు! అల్లుడిని తక్కువగా అంచనా వేసినందుకు విచారించాడు. నిర్మలని అధైర్యపరచడం ఇష్టంలేక ఆ విషయం ఆమెకి చెప్పలేదు. భార్యతో చెపుదామన్నా 'నే చెప్పలేదా' అని హేళన చేస్తుందేమోనన్న భయంతో చెప్పలేదు. భార్య అన్నట్టు కాస్త మంచిగా పని సానుకూలపడేట్లు చెయ్యాల్సింది. చూద్దాం.... అతను మాత్రం పెళ్లిచేసుకోకుండా ఎన్నాళ్లుంటాడు. పంతం కొద్ది రెండుమూడేళ్లుంటాడు. ఆ తరువాత చూద్దాం— ఏం జరిగేది అనుకున్నారాయన.

ఆ ఏడాది నిర్మల పెళ్లికాక ముందు స్నేహితులతో షికార్లు, సినిమాలు, పార్టీలు అంటూ ఎలా తిరిగేదో అలా తిరిగింది. రోజంతా పుస్తకాలు చదవటం, రికార్డులు వినడం, సాయంత్రం ఫ్రెండ్సు ఇంటికో, సినిమాకో వెళ్లడం. శలవువస్తే అన్నలతో కార్డ్స్, చెస్ ఆడేది. ఇదివరకు కాలేజి వుండేది కనక కాలేజికి వెళ్లి రావడం, వచ్చాక రాత్రి చదువుండేదేమో రోజంతా బిజీగావున్నట్లుండేది. ఇప్పుడు చదువులేదు, కాలేజిలేదు. ఎంతసేపని చదవటం పుస్తకాలు. సినిమాలు మాత్రం ఎన్నని చూడటం... ఇంటో వంటకి మనిషి, మగతావాటికి తల్లి వున్నారు. వంటింటి వైపు




# అందం – ఆరోగ్యం

## JEEVANTONE

బల హీనమైన కణాలకు మంచి రక్త ప్రసరణను అందజేస్తుంది. ఇదికాక ఆరోగ్యాన్ని, బలాన్ని, కండరాలకు దారుఢ్యాన్ని ప్రసాదిస్తుంది.

ఒక సీసా తాగింతర్వాత
ఇంకా ఎన్ని సీసాలు తాగాలో
మీరే నిర్ణయిం చేసుకోగల్రు

ఆరోగ్యంగా లేకపోతే
రోగాలపాలవుతారు

మంచి ఆరోగ్యం, బలం, శక్తి
పుష్టిగా కండరాలు పొందిన తర్వాత
ఈ మందును ఆపివేయడం మంచిది

'' MFG. LICENEENᵁ. AUS 59/75''

Contact our new sole Distributors

**M/S. New Shakti Pharma,**
No. XXV/475, Havanapet,
Adoni-518 301,
Kurnool Dist., A.P.
**Phone: 2866**




450 Grams Rs. 36/-



వి.పి.పి
కొరకు

జీవన్‌టోన్ ప్రాడక్ట్
పి.బి.నం. 880, 17/2
కేం[illegible] రోడ్
బెంగుళూర్-560 008

SINDU

వెళ్లాల్సిన పనిలేదు. తండ్రి రోజంతా కేసులు, కోర్టు, క్లైంట్స్‌తో బిజీగా వుంటాడు. అన్నయ్యలు చదువులు, ఉద్యోగాలతో బిజీ. ఆదివారాలే కాస్తతీరిక వాళ్లకి.

నాలుగయిదు నెలలు గడిచిందగ్గిరనించి ఏ వ్యాపకంలేక బోరుకొట్టసాగింది నిర్మలకి. వెధవ సినిమాలలావున్నాయి అనుకుంది విసుగ్గా. ఎమ్మే అయ్యాక ఆరునెలలు ఇంటిపట్టున ఖాళీగావున్నా ఇలా లేదు అప్పుడు. ఈ పెళ్లి అయ్యాక ఏమిటో ఈ ఇల్లు తనకి పరాయిదయినట్టు, ఈ ఇంట్లో ఇప్పుడు తనో గెస్టులా వున్నట్టు అన్పించసాగింది ఆరునెలలు గడిచేసరికి. తల్లి ఏం అనకపోయినా ఏదో తప్పు చేసినట్టు తల్లితో పూర్వంలా మాట్లాడలేకపోతూంది. చనువుగా ఇదివరకులా తల్లిని ఏం అడగాలన్నా మొహమాటంగా వుండేది. అడిగే అవసరం లేకుండా తండ్రి పాకెట్‌మనీ ఇస్తున్నారు. కాని పెళ్లవకముందు అయితే ఫ్రెండ్సు, సినిమాలు, పార్టీలు, పిక్నిక్‌లు అంటూ తండ్రి ఇచ్చినది చాలదని వాదించి గుంజుకునేది. ఇప్పుడు తండ్రి ఇస్తున్నా తీసుకోవాలంటే ఏదో బిడియంగా వుంది ఆమెకి. ఇదివరకులా యధేచ్ఛగా ఖర్చుపెట్టాలన్నా జంకు కలిగేది. ఇదివరకు కన్పించిన మంచి చీరల్లా కొనమని వేధించేది తల్లిని. ఇప్పుడు మంచిచీరలు కన్పించినా కొనాలన్న ఇంటరెస్ట్ పెద్దగా కలగడంలేదు. కల్గినా అడగాలంటే ఏమనుకుంటారోనని మొహమాటపడేది. తనలో మార్పు తనకే వింతగా అన్పించేది నిర్మలకి. 'పెళ్లి' అన్న రెండు అక్షరాలు జీవితంలో ఇంత మార్పు తెస్తాయా అని విస్తుపోయింది.

నిర్మల వచ్చి ఏడాది గడిచినా అక్కడే వుండిపోవడంతో ప్రతివాళ్లకీ చెప్పకుండానే నిర్మల కాపురం చెడిందన్నది అర్థం అయింది. మొహంమీద అడక్కపోయినా ఆరాలుతీయడానికి కొందరు ప్రయత్నిస్తే, మొహాలు చూసుకునేవారు కొందరు.

దగ్గిర బంధువులు శివశంకరంగారిని మందలించారు. ఆయన పినతండ్రి ముసలాయన "శివా... నీవుత్త తొందరమనిషివి- ఆడపిల్ల కాపురం గురించన్నా ఆలోచించకుండా ఇలా చేస్తావా- కాస్త నెమ్మదిగా నచ్చచెప్పుకుంటారుగాని ఆలోచనలేకుండా ఇలా చేస్తారా" అని కేకలు వేశారు.

"నన్నేళ్ళి మాట్లాడమంటారా బావగారూ" అని బావమరిది జోక్యంకల్గించుకున్నా ఆయన మాట్లాడలేదు.

"అదేమిటే శారదా... మీ ఆయన ఎలా అన్నా ఆడదానివి నీవు చెప్పద్దుటే. కాస్త మాటకే కాపురాలు వదులుకుంటారుటే! అలా అయితే మనందరం ఇన్నాళ్లు కాపురాలు చేసేవారమా? నీకు తెలీదేతల్లీ. పెళ్లికాని ఆడపిల్లనన్నా భరించగలం గుండెలమీద కుంపటిలా. కాని ఒకసారి పెళ్లయిన ఆడది పుట్టింట పడుంటే దానికి, మీకు ఇద్దరికీ నరకమేనే" ఆవిడ పెదతల్లి చివాట్లు పెట్టింది.

"నేనేంచెయ్యను దొడ్డమ్మా. ఈ ఇంట్లో నామాటచెల్లదు" అని చెప్పుకొని వాపోయింది ఆవిడ.

శివశంకరంగారు ఆ చెప్పేది పెద్దవాళ్లయితే ఏమనలేక మొహం మాడ్చుకునేవారు. చిన్నవాళ్లయితే 'నాకూతురి గురించి మీకంటే నాకు ఆదుర్దా ఎక్కువేగదా! నాకు తెలుసు నేనేం చేసింది. నాకెవరూ చెప్పక్కరలేదు" అని ఎగిరేవారు.

నాల్గురోజులు చెప్పి అలవాటయి అందరూ వూరుకున్నారు- మీ ఖర్మ మాకెందుకు అన్నట్టు.

"అందరూ అడగడమే 'ఏం అమ్మాయి ఇక్కడుంది' అని. జవాబు చెప్పలేక చస్తున్నాను" శారదాంబ విసుక్కునేది.

"ఏం... మనమ్మాయి బరువు వాళ్లుమోస్తున్నారా; నీకసలు జవాబు ఇవ్వడంతెలీదు. మాపిల్ల సంగతి చూసుకోడానికి మేంవున్నాం. మీకెందుకు అను ఒకసారి... మళ్లీ ఎవరూ అడగరు ఆ మాట."

"ఆ.. ఇప్పటికే ఇరుగుపొరుగు వింతగా చెప్పుకుంటున్నారు. ఇంక పొగరుగా జవాబిస్తే గుమ్మం తొక్కరు ఎవరూ"

"తొక్కకపోతే మరీ మంచిదిలే" శివశంకరం కోపంగా అనేవారు.

ఆ సంభాషణ వింటూ ఇదివరకు మాదిరి




తేలిగ్గా తీసుకోలేక ఏదో గిల్టీగా ఫీలయ్యేది నిర్మల- తనవల్ల తల్లిదండ్రులకి బాధలు, ప్రోబ్లమ్స్ అనుకునేది. ఓ ఏడాది గడిచేసరికి నిర్మల విషయం అందరికీ పాతబడి అడగడం, అనుకోడం మానేశారు.

నిర్మల స్నేహితులలో బెస్ట్‌ఫ్రెండ్స్ నలుగురూ నాలుగు దార్లయి వెళ్లిపోయారు. కుసుమ ఎమ్మే అయ్యాక లెక్చరర్‌గా కాకినాడలో ఉద్యోగం వస్తే వెళ్లిపోయింది. లత, రేణు పెళ్లిళ్లయి కాపురాలకి వెళ్లారు.. పద్మిని ఫారెన్‌లో డాక్టరేట్ కోసం వెళ్లింది. ఇతర కాలేజిమేట్స్‌లో కూడా చాలామంది పెళ్లిళ్లయ్యో, ఉద్యోగాలకోసమో ఇటుఅటు వెళ్లిపోయారు. శివశంకరంగారుండే లొకాలిటీ ఊరికి కాస్త దూరం. పోష్‌లొకాలిటీ ఏమో ఇళ్లు విసిరేసినట్టు ఇక్కడొకటి అక్కడొకటివుండేవి. ఇరుగుపొరుగు ఒకరేమో రిటైరయిన వయసుమళ్లిన దంపతులు. ఇంకొకరు ఏదో కంపెనీలో పనిచేస్తున్న బెంగాలీ కుటుంబం- ఆ వీధిలో నిర్మల ఈడు పిల్లలు అసలులేరు పరిచయం చేసుకోవాలన్నా- దాంతో నిర్మలకి బొత్తిగా కాలక్షేపంలేకుండా అయింది. ఇదివరకయితే లత, రేణు, పద్మిని అంతా వచ్చి సినిమాలకి వెళ్లేవారు. ఆదివారం వస్తే ఎవరింట్లోనో ఒకరింట్లో లంచ్ తిని గేమ్స్ ఆడుకునేవారు.

నిర్మల వెళ్లిన ఆరునెలలకి రేణు భర్తతో ఏదో పండక్కి పుట్టింటికి వచ్చింది. నిర్మల ఇంటికి వచ్చి- ''ఇదేమిటే... ఇలా అయింది నీ సంగతి'' అంది బాధగా- రేణు మొహం చూస్తుంటే-- ఆమె మోహంలో సంతోషం, ఆ కళ్లలో వెలుగుచూస్తుంటే ఆమె ఎంత ఆనందంగా, సుఖంగావుందో ఎవరూ చెప్పక్కరలేకుండానే గ్రహించవచ్చు. ఆమె భర్త విక్రమ్ కూడా చాలా సరదాగా ఎంతో పరిచయం వున్నట్టు మాట్లాడాడు. అతని మొహంలో నవ్వు, ఆ ఫ్రెండ్లీ నేచర్ చూస్తుంటే మూతి బిగించుకొని ధుమ ధుమలాడే భర్త గుర్తు వచ్చి రేణు అదృష్టవంతురాలు అనుకుంది.

''అసలేం జరిగిందే'' అంది గదిలోకి వెళ్లాక. నిర్మల టూకీగా జరిగింది చెప్పాక 'ఐయామ్ వెరీ సారీ! నీరూ. ఇప్పుడేం చేస్తావు అయితే' అంది రేణు.

''తింటున్నాను, తిరుగుతున్నాను. అంత కంటే ఏం చేస్తాను'' శుష్కహాసం చేస్తూ అంది నిర్మల.

''బాగుంది... ఎన్నాళ్లిలా ఇంట్లోవూరికే కూర్చుంటావు. పోనీ ఏదన్నా ఉద్యోగమన్నా చెయ్యి... కాలక్షేపం వుంటుంది. పోనీ నీరూ... ఏడాది అయింది, పెళ్లాంలేక అతనికీ కాస్తలోటు తెలిసి వచ్చి బుద్ధి వచ్చివుంటుంది. మరోసారి వెళ్లి ప్రయత్నం చెయ్యకూడదా, ఎన్నాళ్లిలా ఒంటరిగా వుంటావు'' అంది.

ఆమె సానుభూతి భరించలేనట్టు నిర్మల మనసు నొచ్చుకుంది. అదే ఇదివరకయితే వాదించేది. ఎవరేమన్నా దులిపేసుకునేది. ఇప్పుడు ఎవరే చిన్నమాట అన్నా మనసుకి బాధగావుంటోంది. చిన్నపోయిన ఆమె మొహం చూసి ''సారీ... హర్ట్ చేశానా? నీవిలా ఒంటరిగా వున్నావని బాధగా అన్నానే. మేమందరం హాయిగా కాపురాలు చేసుకుంటుండగా నీవిలా...''

ఆ తర్వాత అరగంట భర్త ఎంతమంచివాడో, ఎంత సరసుడో, సహృదయుడో, అత్తవారు తనని ఎంత అపురూపంగా చూస్తారో, తన అదృష్టం అంతా చెప్పుకొచ్చింది.

ఆమె వెళ్లాక అనిపించింది. రేణు తన కంటె అందగత్తెకాదు. రేణువాళ్లు తమఅంత డబ్బుగలవారు కాదు. అయినా ఆమె ఎంత అదృష్టవంతురాలు. తనేం పాపం చేసిందని ఇలా అయింది- అన్పించింది నిర్మలకి. రేణు ఎంత సంతోషంగా వుంది. అలాంటి సరసుడు భర్తగా దొరికితే ఎవరన్నా అలాగేవుంటారు. రేణు వచ్చివెళ్లిన దగ్గరనించి ఏదో దిగులుగా అన్పించింది నిర్మలకి. మూడునెలల కితం లతకి పెళ్లిఅయివెళ్లింది. అసలు పెళ్లిలోనే పెళ్లికూతురు, పెళ్లికొడుకు ఇద్దరూ ఎంత సరదాగా మాట్లాడుకున్నారు. తనను ఎన్నాళ్లబట్టో ఎరిగినట్టు అప్పుడే జోక్‌లు వేసేవాడు. పెళ్లవగానే పదిహేనురోజులు శెలవుపెట్టి హనీమూన్‌కి కాశ్మీర్ వెళ్లారు. వాళ్లత్తగారు చూడ్డానికి పాతఫాషన్‌గావున్నా, భావాలు ఆధునికంగావున్నాయి. 'ఇంకా తోటలో దిగడాలు, మొహాలు

కడిగించటాలు అవన్నీ ఎందుకండి వదినగారూ, పెళ్లి సింపుల్‌గా కానీయండి' అందట. 'ఇద్దరినీ సరదాగా ఓనెల రోజులు తిరిగిరానీయండి, గృహప్రవేశం అవి తరువాత చేసుకుంటాం. పెళ్లయిన కోడలు ఇంటికి ఎప్పుడన్నా వచ్చేదేకదా. మీ అమ్మాయి, మీ అల్లుడు-మీకుంటే వాళ్లకేం పెట్టుకున్నా వద్దనం, అలా అని మేం అడగం. మీయిష్టం వాళ్లిష్టం. కాపురానికి ఏంకావాలో వాళ్లే చూసుకుంటారు, మనవంతు పెళ్లిచేయడంవరకే' అందిట. లత ఎంత అదృష్టవంతురాలు- మూడు ముళ్లు వేయించుకుని జన్మలో ప్లేను ఎక్కకపోయినా ఛంగుమని మొగుడితో తిరగడానికి వెళ్లిపోయింది.

కుసుమ చక్కగా బోస్టన్ యూనివర్సిటీలో ఎమ్మె ఎకనామిక్స్‌లో డాక్టరేట్‌కి సీటువచ్చి స్కాలర్‌షిప్ మీద వెళ్లింది. అదింక ఇండియా రాదుట. అక్కడే ఎవర్నో ఇండియన్‌ని చూసి చేసుకుంటుందిట. నలుగురిలో "చిన్నప్పటినుంచీ అదృష్టవంతురాలివి! అల్లారుముద్దుగా పెరిగావు. నీలా మాకు చీరలు అవి ఎలావస్తాయి తల్లీ! మీ డాడీలా మాడాడీకి అంతడబ్బులేదు" అని ఈర్ష్యపడిన స్నేహితురాళ్లు ముగ్గురిని చూసి తనిప్పుడు అసూయపడాల్సి వస్తూంది. హుం...పెట్టి పుట్టడం అంటే ఇదేగాబోలు! తన అదృష్టం ఇలా మారుతుందని ఎవరనుకున్నారు. వంటరిగా కూర్చుంటే ఇవే ఆలోచనలు వస్తున్నాయి నిర్మలకి. వంటరిగా కూచోక రోజంతా జత ఎవరుంటారు తనకి.

రేణు వచ్చి వెళ్లాక ఆమె చెప్పినట్లు ఉద్యోగంచేస్తే కాస్త జోరుతగ్గుతుంది అన్పించింది నిర్మలకి.

"నీకెందుకమ్మా ఉద్యోగం? నీకేంలోటు అయిందిప్పుడు" అన్నారు శివశంకరంగారు. "ఉద్యోగం అంటే మాటలా. నీవంత శ్రమపడలేవు తల్లీ"

"లేదు డాడీ...వుత్తినే కూర్చుంటే విసుగొస్తూంది. ఏదన్నా ఉద్యోగంచేస్తే కాలక్షేపం అవుతుందని" నసిగింది.

"చెయ్యనీయండి. ఇటుచదువో, అటు సంసారమో లేకుండా ఉత్తినే ఎన్నాళ్లు కూర్చుంటుంది. ఏ వయస్సులో ముచ్చట ఆ వయస్సులో. సంసారం ముచ్చట ఎలాగో తేలిపోయింది కనుక ఉద్యోగమన్నా చేయనీయండి. తినికూచుంటే పిచ్చెత్తుతుంది ఎవరికన్నా" శారదమ్మ అంది. భార్యవంక చురచుర చూశారాయన. నిర్మల తలదించుకుని వెళ్లిపోయింది అక్కడనించి.

"నీకు బుద్ధీ జ్ఞానం ఎప్పుడొస్తుంది - దాని ముందు అలా అంటే అది బాధపడదూ" కోపంగా అన్నారు భార్యతో.

"ఏం...తప్పుమాట ఏం అన్నాను. అవును ఉత్తినే తిని ఎన్నాళ్లు కూచుంటుంది. మొగుడు, సంసారంలేదు. దాని బతుకు అదిబతకడానికి ఓ ఆధారముండొద్దూ" శారదమ్మ గట్టిగానే అంది.

"దానికేంలోటు. ఉద్యోగంచేసి బతకవల్సినంత ఖర్మ దానికేంపట్టదు నేనుండగా"

"మీరుండగా సరే. ఎల్లకాలం మనం వుండం. ఈలోగా దానికోదారి చూపవద్దా..."

"అది కూర్చుని తినే వీలుకల్పించకుండా పోతాననుకున్నావా. నా తరువాతకూడా అదెవరి మీదా ఆధారపడకుండా చేసేపోతాను" గర్వంగా అన్నారు.

'ఇంకా మనకి ముగ్గురు మగపిల్లలున్నారు, ఇద్దరి చదువులున్నాయి. వాళ్ల పెళ్లి పేరంటాలున్నాయి... అని మరవకండి. ఎన్ని లక్షలూ తిని కూర్చుంటే కరిగిపోతాయ్"

"వాళ్లు మగపిల్లలు. చదువులు చెప్పిస్తున్నాం. ఎలాగో బతకగలరు. ఈ ఇల్లు, కొంత డబ్బు దానికి రాయాలని నిశ్చయించుకున్నాను"

శారదమ్మ ఆశ్చర్యంగా చూసింది. "బాగుంది... మగపిల్లలు మట్టికొట్టుకుపోతారు అనుకున్నారా! ఇంతఇల్లు దాని పేరరాసిపోతే జన్మలో మనల్ని క్షమించరు మగపిల్లలు... దేనికన్నా న్యాయం వుండాలి. మీకు కూతురు అపురూపం అయితే అవచ్చు. కాని మగపిల్లలకి అన్యాయం చేసే హక్కుమీకులేదు" తీవ్రంగా అంది ఆవిడ.

"వాళ్లకీ నిర్మలంటే ప్రాణం. దానికిల్లు ఇస్తా







నంటె ఎవరూ వద్దనరు. ఆడపిల్లకి ఇల్లులేక పోతే ఎక్కడికి పోతుంది?''

''హుఁ...మీరు లాయర్లు. ఇంత వయను, అనుభవం వచ్చిఇలా మాట్లాడుతున్నారేమిటి.

ఈనాడు చెల్లెలిమీద వున్న అభిమానం, సానుభూతి రేపు వాళ్లకి పెళ్లిళ్లయి, వాళ్లకి సంసారాలు వచ్చాక వుంటాయా - వుండకపో వడంలో అసహజం ఏముంది. ఎవరి స్వా ర్థంవారిది''

''అందుకే! దాన్ని ఎవరూ చూడనక్కరలే కుండా, అది ఎవరికీ బరువు కాకూడదనే దానికి ఓ దారి చూపించుతాను. ఈ ఇల్లుదాని కే వుంటుంది'' నిశ్చయంగా అన్నారు శివశంక రంగారు.

శారదమ్మ నిట్టూర్చింది- ''అలాచేసి మీ చేతుల్తో మీరే వాళ్లమధ్య శత్రుత్వానికి పునాదు లు వేస్తున్నారన్నమాట'' కటువుగా అంది.

''అయితే ఏంచెయ్యమంటావు ? దాన్ని రో డ్డుమీద వదిలేయమనా నీ ఉద్దేశం''

''రోడ్డుమీద వదిలేయక్కరలేదు, దానికి ఏదో ఉద్యోగం చూడండి. మనం వున్నన్ని రోజులు బాధలేదు, తదనంతరం కొంత డబ్బు దానికి చెందేట్లు రాయండి''

''నిన్నెవరూ సలహా అడగలేదు. నా ఆస్తి, నా స్వార్జితం నా ఇష్టంవచ్చినట్లు చేస్తాను'' కసురుకున్నారాయన. శారదమ్మ మాటల్లో నిజం ఆయన ఆనాడు గుర్తించలేదు - అది కుటుంబంలో ఎన్ని కలతలకి, కలహాలకి దారి తీస్తుందో ఆయన ఊహించదలచలేదు.

★ ★ ★

నిర్మల ఆ వూరిలో ఉమెన్స్ కాలేజిలో లెక్చ రర్‌గాచేరి ఆరునెలలు అయింది. ఉద్యోగంలో చేరాక కాలక్షేపం అవుతోంది నిర్మలకి. ఉదయం లేచిం దగ్గరనించి

కాలేజికి వెళ్లడానికి ముస్తాబు హడావిడి, వచ్చాక మర్నాటిక్లాసులకి ప్రిపేరు అవడం. కాలేజి టైములో రెండు మూడు క్లాసులకి అటెండ్ అవడం. అలవాటులేక శారీరకంగా శ్రమ అనిపించినా మానసికంగా ఉల్లాసంగానే వుంది నిర్మలకి. అనవసరమైన ఆలోచనలు, దిగులు, ఆమొరోజ్‌నెస్ తగ్గాయి.

'వారం రోజులకే ఎలానల్లబడ్డావో చూడమ్మా? ఎందుకమ్మా తీరికూర్చుని ఈ ఉద్యోగం నీకు' అన్నారు శివశంకరంగారు కూతురి తల నిమిరి.

'ఫరవాలేదు డాడీ, అలవాటయిపోతుంది...' అంది తలవంచుకుని. శారదమ్మ భర్త వంకకాస్త కోపంగా చూసింది. 'బాగుంది సంబరం, ఎంతకన్నారగరుంతా పెంచుతారా' అన్నట్టు.

'ఈ బస్సులు, వెయిటింగ్ అవి నీవుపడలేవమ్మా. అన్నయ్య స్కూటరు నీవు తీసుకెళ్లు. వాడు బస్సులో వెడతాడు. లేదంటే వాడికి ఒకటి కొంటాను' అంటూ, కొడుకుని పిలిచి స్కూటరు ఇమ్మని చెప్పారు ఆయన.

మొదటిసారి రఘుకి కాస్తకోపం వచ్చింది చెల్లెలిమీద. 'తన కాలేజి అంతదూరం. తను బస్సులో వెళ్లాలా.. రెండుమైళ్లున్న ఈవిడ స్కూటరుమీద వెళ్లాలా...' అన్నట్టు మొహం మాడ్చుకున్నాడు.

'నాకు చాలాదూరం, రెండు బస్సులు మారాలి' అని నసిగాడు.

'ఫరవాలేదులేవోయి! మగవాడివి ఆమాత్రం కష్టపడవచ్చు. ఇంకోటి కొనేవరకు బస్సులో వెళ్లు-' అన్నారాయన.

అన్న మొహం మాడ్చుకోడం చూసి నిర్మల మనసు చివుక్కుమంది. 'వద్దులే అన్నయ్యా! నాన్న అలాగే అంటారు. నేను బస్సులో వెడతాను' అంది.

'నీకు తెలీదమ్మా... నీవు ఆ బస్సులు అవి ఎక్కలేవు. వాడికేం మగవాడు ఎలా అన్నా వెడతాడు' అని తేల్చేశారాయన. రఘు కాస్త విసురుగా వెళ్లిపోయాడు.

'కూతురంటే అంత ప్రేముంటే ఇంకో కారు కొనిచ్చుకోమను. నా స్కూటరెందుకు యియ్యాలి' అని తల్లిదగ్గర మొహం మాడ్చుకొని గొణిగాడు రఘు.

'దేనికన్నా లిమిట్వుండాలి. దాన్నలా నెత్తినెక్కించుకుంటున్నారు' అని కూడా చెప్పాడు.

శారదమ్మ ఎవరిని ఏంఅనాలో తెలియక నిట్టూర్చింది. భర్తమీద ఆవిడకీ కోపం వచ్చింది.

మొదటి జీతం అంతా ఖర్చుపెట్టి ఇంట్లో అందరికీ బట్టలు తెచ్చింది నిర్మల.

'ఎందుకే ఇలా తగలేయడం? నీ జీతం వేరే ఎకౌంట్ ఓపెన్ చేసిదాచుకో. అనవసరంగా ఇలా ఖర్చుపెట్టేయకు, ముందు పనికి వస్తుంది' అంది శారదమ్మ.

'అదేదో సరదాగా తెస్తే ఆమాటలేమిటి. ఏదో దానిజీతం దాచుకోకపోతే గతిలేనట్టు మాట్లాడతావేమిటి?' శివశంకరంగారు కసిరారు. 'మీ అమ్మ మాటలకేం తల్లీ అలాగే అంటుంది. నీసంపాదన నీ ఇష్టం వచ్చినట్టు ఎంజాయ్చెయ్యి-' అనేశారు.

ఎంజాయ్!... ఏంచేస్తుంది ఎంజాయ్... ఎవరితో చేస్తుంది తను! ఏడాది తిరిగేసరికి అలా అనిపించింది నిర్మలకి. తను సంపాదించి ఏం ఎంజాయ్ చెయ్యాలి? సినిమాలు, షికార్లు.. ఎన్నిరోజులు తిరుగుతుంది! ఎవరితో తిరుగుతుంది? కాలేజిలో ఇద్దరు ముగ్గురు కొలీగ్స్తో స్నేహం అయింది. మాధవి ఇంగ్లీషు లెక్చరర్ సరదాగా వుంటుంది. స్నేహానికి ప్రాణం ఇస్తుంది. కాని వివాహిత. సరదాగా ఏదన్నా సినిమాకి వెడదాం. హోటల్కి వెడదాం పదా అంటే "ఇంటికెళ్లాలోయ్. మా శ్రీవారికి కోపం వచ్చేస్తుంది. లేటుగా వెడితే మొహం మాడ్చేస్తారు' అంటుంది నవ్వుతూ. ఆమెకి ఆరు నెలలయింది పెళ్లయి. ఏమిటో వీళ్లు! ఓ సినిమాకి వెడితే మొగుడికి కోపంవస్తుంది అనుకుంటారీ ఆడవాళ్లు. ఇంతచదివి ఉద్యోగం చేస్తున్నా అంతభయపడి చావడం ఏమిటి అనుకుంటుంది నిర్మల కోపంగా. హిస్టరీ లెక్చరర్ ఉమ గలగలమాట్లాడుతూ జోకులు వేస్తూ నవ్విస్తుంది. సరదాలున్నాయిగాని 'ఇంట్లో ఇద్దరు పిల్లల్ని, అత్తగారిమీద వదిలి వచ్చాను రోజంతా చూస్తుంది గాని సాయంత్రం ఆలస్యం అయితే ఆవిడగారు మూతి ముడుచుకుని జీతం బత్తెం లేని నౌకరీ దాన్ని వుండగా నీకేం అమ్మా తిరిగి వస్తావు అని చెప్తుంటుంది' అంటూ సినిమాకి రమ్మంటే తప్పించుకుంటుంది.

కెమిస్ట్రీ లెక్చరర్ పద్మ అవివాహితయేమో నిర్మలతో రెండుమూడుసార్లు సినిమాలు, హో

టళ్లకి పిలిస్తే వెళ్లింది. ఓసారి హెూటల్‌లో వాళ్ల అన్నచూసి ఇంట్లో చెప్పాడు. 'ఆ నిర్మలతో స్నేహం ఏమిటి? ఏం ఆవిడగారిలా నీవూ తయారవుతావా? ఆవిడ సంసారం, మొగుడు అన్నీ వదులుకుని రాగల స్వతంత్రభావాలున్న గొప్ప ఆవిడ. ఆవిడకంటే మొగుణ్ణి వదులుకుని వచ్చినా ఆదుకునే తల్లిదండ్రులున్నారు. మాకేం అంతడబ్బులేదు. పిచ్చిస్నేహాలు చేసి మతులు పోగొట్టుకోకు' అంటూ తల్లి తిట్టింది.

ఆ తరువాత నిర్మల పిలిచినా ఏదో సాకుతో తప్పించుకోవడం మొదలుపెట్టింది. పద్మ ఎందుకు తనని తప్పించుకుంటుందో ముందు నిర్మలకి అర్థంకాలేదు. ఒకరోజు లేడీస్ రూములో మీటింగు పెట్టినట్టు అయిదారుగురు లెక్చరర్లు కూచుని నిర్మల గురించి మాట్లాడుకుంటున్నారు. ఆరోజు నిర్మల వంట్లో జ్వరం వచ్చినట్టు వళ్లంతానెప్పులు, తలనొప్పి వచ్చి క్లాసు తీసుకుని పాఠం చెప్పలేక క్లాసువదిలి, ప్రిన్సిపాల్ పర్మిషన్ తీసుకుని ఇంటికి వెళ్లబోతూ కామన్ రూందగ్గరికి వచ్చింది.

''ఇంకా ఇన్నాళ్లూ నిర్మల అన్‌మారీడ్ అనుకున్నానోయి... అమ్మ బాబోయ్.... ఎంత ధైర్యం బాబూ, కాపురం వదిలివచ్చేసింది' అంటోంది తెలుగు లెక్చరరు లలిత.

'ఏమోయి పద్మా... ఆవిడా నువ్వూ అంత క్లోజ్‌గా తిరిగారు. ఏం ఈమధ్య వెళ్లడం మానేశావు-' ఆరా తీస్తూంది లెక్కల లెక్చరరు కుముదిని.

'ఈవిడ మొగుణ్ణి వదిలేసింది, ఈవిడతో తిరిగితే రేపు నేనూ మొగుణ్ణి వదిలేస్తానని మా అమ్మభయం ఈవిడ యిన్‌ఫ్లూన్స్ నామీద పడుతుందని మావాళ్ల భయం. మా మదర్ తిట్టింది-' అంటోంది పద్మ.

'నిజంగా ఆ ధైర్యాన్ని మెచ్చుకోవాలి... ఉద్యోగం చేస్తున్నా మొగుడు ఏమన్నా నోరు మూసుకొని భరిస్తాం మనం. మా ఆయనయితే నెల జీతం ఫస్ట్‌తారీకే తీసేసుకుంటారు. ఒక చీరకొనాలన్నా ఆయన పర్మిషన్ కావాలి- అలా ఒదిగివుంటున్నా ఏదో అంటూనేవుంటారు. అయినా కాపురాలు చేసుకోవడంలేదూ-' అంది ఫిజిక్స్ ఎమ్మెస్సీ ఫస్టుక్లాస్‌లో పాసయిన సుప్రియ.

'ఆ.. ఏంధైర్యంలెద్దూ.. మొగుణ్ణీ కాపురాన్నీ వదులుకుని యీవిడగారు సాధించింది ఏమిటి? రేపు ఆ మొగుడు చక్కగా మరోపెళ్లి చేసుకుంటాడు. అలా ఈవిణ్ణి చేసుకునేందుకు ఎవడన్నా ముందుకు వస్తాడా! ఎంత చదువుకున్నా ఎంత ఉద్యోగాలు చేసినా ఎన్నికబుర్లు చెప్పినా మగాడితో మనం సమానం కాదనడానికింతకంటే ఉదాహరణ ఏంకావాలి? కాస్తకి కూస్తకి కాపురాలు వదులుకుంటే నష్టపోయేది మనమే గదా. నిర్మలకి డబ్బుంది. అందం, చదువు, ఉద్యోగం అన్నీవున్నాయి. కాని ఇప్పుడంటే ఏదో ఆవేశంతో ఏదోసాధించాననుకుని తృప్తిపడుతుంది. నాల్గురోజులుపోతే ఓ సంసారం, పిల్లలు ఏ ముద్దూముచ్చట లేకుండా మోడులా బతకాలంటే తనకి మాత్రం వినుగుకాదూ. తొందరపడి, ఆవేశంతో చేసిందని నా అనుమానం-' ఉమ అంది.

'నిర్మల మంచిదేనోయి, సరదాగా వుంటుంది... కాని పాపం ఎందుకిలా జరిగిందో... నన్నడిగితే మనం ఎన్నో అనుకుంటాం. కన్నెగా ఎన్నో ఊహిస్తాం, నిజజీవితంలోకి వచ్చేసరికి ఆ ఊహలన్నీ తలకిందులయి ఆ నిరాశకి తట్టుకోలేక కొందరు అనుకున్నవి జరుగలేదని అవతలి మనిషిలో లోటుపాట్లని భూతద్దంలో మాదిరి చూసి గోరంత కొండంతగా ఊహించి బాధపడతారు- నిర్మల గొడవ అలాంటిదేనని నా అనుమానం. అతన్ని మార్చడానికి కాస్తయినా ప్రయత్నించలేదని నా అనుమానం. ఎంతచెడ్డవాడయినా కాస్త ఓర్పు చూపితే మారేవాడేమో, తొందరపడి తెంచుకుందేమోననిపించింది నాకు. మనం అనుకున్నవి అనుకున్నట్లు జరగవు. వున్నదానితో ఎడ్జస్ట్ అవకతప్పదు. ఎవరో అన్నట్టు మేరెజ్ అంటేనే క్షణక్షణం ఇంకోరికోసం ఎడ్జస్టు అవుతూ బతకడం. ఆ ఎడ్జస్ట్‌మెంటాలిటీ వుండకపోతే మేరెజస్ ఫేలవుతాయి' మాధవి అంది.

''ఆ... డబ్బుంది అని వాళ్ళ వాళ్ళకి మహా గర్వంట. మాకేం కూతురు బరువా? కాపురం లేకపోతే పీడాపోయింది. ఇలాంటి మొగుడితో మా అమ్మాయి కాపురం చెయ్యదు- అని

తీసుకొచ్చేశారట. పెద్దవాళ్ళు, తల్లితండ్రి నచ్చ చెప్పాల్సిందిపోయి ఇలా వెనకేసుకువస్తే వయసు వేడిలోవున్న ఆ పిల్లకి అంతకంటే నాల్గుఆకులు అహంకారంవుంటుందిగా. ఇదే కాస్త లేని తల్లితండ్రులయితే అంత సులభంగా కాపురంపోతే పోయిందని కూతురి బాధ్యత మీదవేసుకుంటారా? ఇంతకంటే నరకబాధలు పడ్తూ కాపురాలు చేస్తున్నవాళ్ళులేరూ'' కాస్తపాతభావాలతో ఛాందసంగా మాట్లాడే హిందీలెక్చరర్ వరలక్ష్మి సాగదీసింది.

''ఏమిటో... ఈరోజుల్లో ఇలాంటివి ఎక్కువయిపోతున్నాయి. ఇదంతా స్త్రీపురోగమనం అనుకోవాలేమో! ఇదివరకయితే పెళ్ళయితే చావయినా, బతుకయినా అక్కడే అనుకునేవారు ఆడవాళ్ళు. భర్త అంటే అధికారం చెలాయిస్తాడు, భర్తకి అణిగిమణిగి ఒదిగుండాలి అనుకుని, భర్తలేం చేసినా మన ఖర్మ అనుకుని సహించిపడుండేవారు. ఇప్పుడు కొద్దిపదువుకుని లోకజ్ఞానం అలవరుచుకున్నారు. పురుషుడికన్నా తను ఏ విషయంలోనూ తక్కువకాదని గ్రహించిన స్త్రీ పూర్వం మాదిరి పురుషుడి జులుం సహించి పడివుండలేకపోతూంది. అటుపాతకాలం స్త్రీలాగా అణగి వుండలేక, ఇటు విదేశీ స్త్రీమాదిరి పూర్తి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలులేక మధ్యస్థంగా ఊగిసలాడుతూంది ఈ తరం స్త్రీ. విదేశాల్లో మాదిరి విడాకులు తీసుకుంటే, విదేశాల్లో మాదిరి హృదయవైశాల్యంతో రెండో పెళ్ళిచేసుకునే పురుషులు మనదేశంలో ఎందరున్నారు? ఇటువున్న భర్తని వదులుకుని, అటు ఇంకో పెళ్ళికి అవకాశంలేక జీవితం వృధాఅయిందన్న బాధతో, దిగులుతో బతుక్కుతుంది ఈ తరం స్త్రీ. ఎంత చదువుకున్నా పురుషుడితో సమంగా సంపాదిస్తున్నా భర్తకి తలఒగ్గే బతుకుతున్నారు నూటికి తొంభైమంది. అర్థం చేసుకునే భర్త, అనురాగం పంచేభర్త నూటికి ఏ అయిదుమందికో దొరుకుతాడు. మిగతా ఐదు మంది నిర్మలలాంటి పౌరవ, తెగువవున్న స్త్రీలు భర్త జులుం సహించలేక ధైర్యంగా ఎదిరిస్తున్నారు. ఎన్నాళ్ళు గడిచినా స్త్రీ పురోగమనం అంతా వేషభాషల్లో మినహా వ్యక్తిస్వాతంత్ర్యంలో కనబడటంలేదు'' ఆవేశంగా అంది పొలిటికల్ సైన్స్ లెక్చరర్ వనజ.

''ఈ ఆవేశాలు మాటల్లో వినటానికి బాగుంటాయి. నిజజీవితంలోకి వచ్చేసరికి ఎందుకూ పనికిరావు. ఆవేశపడి నిర్మల కాపురం వదులుకుంది- తరువాత ఇప్పుడు ఆవిడ సాధించింది ఏముంది. ఏదీ ఇంకా మొన్న మొన్న కనుక జీవితంలో ఏం నష్టపోయిందో గుర్తించడంలేదు. మరో నాలుగేళ్ళు పోతే మోడులా మిగిలిన జీవితం చూసుకుని ఏడవాలి- డబ్బుంటే బతుకుతెరువుకి పనికొస్తుందిగాని తృప్తి మానసికశాంతి, ఆనందం కొనుక్కోగలదా-'' సవాల్ చేసింది వరలక్ష్మి.

''అసలు చాలారోజులు నిర్మల అన్‌మేరీడ్ అనుకున్నా సుమా. మంగళసూత్రం కూడా తీసిపారేసిందేమో పెళ్ళికాలేదనే అనుకున్నా'' పద్మ అంది.

''చాలా ఘనకార్యం చేసిందానిలా -- మేము ధరం విడిపోయాం అని తనే గొప్పగా చెప్తుకుంది. ఎవరన్నా ఇలాంటివి బయటపడకుండా దాచాలని చూస్తారు- ఆవిడే గొప్పగా చెప్పుకుంటుంది.''

''ఏమయినా, నా మటుకు నేను నిర్మల ధైర్యాన్ని మెచ్చుకుంటున్నాను- నేనా పరిస్థితిలోవుంటే పడ్తునట్లు సహించేదాన్నేమోగాని విడిపోయి వచ్చేసే ధైర్యం వుండేదికాదు'' సుప్రియ అంది.

''ఆ... ఈ ధైర్యం అమ్మ నాన్నల్ని చూసుకుని. వాళ్ళు చాటిపోయాక అప్పుడు అర్థం అవుతుంది ఆవిడకి. అయినా పెద్దవాళ్ళయి వుండీ కూతురికి నచ్చచెప్పాల్సిందిపోయి వాళ్ళూ ఆవిడగారితో ఎగిరిపడటం ఏమిటో'' వరలక్ష్మి హేళనగా అంది.

నిర్మల ఇంక వింటూ నిలబడలేకపోయింది- ఆమె మొహం ఎర్రబడిపోయింది. ఛా... తన గురించి అందరూ ఎంతలా మాట్లాడుతున్నారు... పైకి నవ్వుతూ మాట్లాడే వీళ్ళంతా లోపల ఇంత కుళ్ళు దాచుకున్నారు. మళ్ళీ అంతా చదువుకున్నారు. ఉద్యోగాలు చేస్తున్నారు. తోటి స్త్రీని ఇంత చులకన చేస్తారా. స్త్రీకి స్త్రీయే శత్రువు. మగవాళ్ళు మారాలి అని [illegible] ముందు ఇలాంటి ఆడవాళ్ళు మారాలి.

ఓ ఆడది భర్త దగ్గిర బాధలు, అవమానాలు సహిస్తూ పడివుంటే సానుభూతి చూపుతారు గాని, ధైర్యంగా తన బతుకు తాను బతికితే ఎవరూ చూడలేరు... హర్షించలేరు. తోటి స్త్రీని స్త్రీలే అర్థం చేసుకోలేకపోతే ఈ స్త్రీజాతికి పురోగమనం ఎప్పుడు?- ఆవేశంగా విసురుగా రూములోకి అడుగుపెట్టింది. నిర్మలని చూడగానే అందరి నోళ్ళు ఠక్కున మూతపడ్డాయి- మొహాలు చూసుకున్నారు- నిర్మల మాడిపోయిన మొహం చూసి తమ మాటలు విందని గ్రహించారు- మాధవి తడబడి "అదేం, క్లాసు లేదా మీకు ఇప్పుడు" అంటూ పలకరించింది.

"ఏం అలావున్నారు? మొహం ఏమిటి అలావాడిపోయింది" సుప్రియ ఏదో అనబోతుంటే నిర్మల అందరివంకా ఒకసారి చూసి, "ఒంట్లోబాగోలేదు. ఇంటికి వెళ్ళిపోవాలని వచ్చాను. పర్మిషన్ తీసుకుని ఇలా రావటం మంచిదయింది. మీకు నా గురించి వున్న అభిప్రాయాలు తెలిశాయి. థేంక్స్... వస్తాను" అంటూ వడివడిగా వెళ్ళిపోయింది.




ఆ తరువాత కాలేజీలో తనపని తాను చేసుకుంటూ ముభావంగా గడపటం అలవాటుచేసుకుంది నిర్మల. దాంతో లైఫ్ మరీ డల్‌గా అన్పించటం మొదలుపెట్టింది. క్లాసులు లేనపుడు కామన్ రూములో సరదాగా తోటి లెక్చరర్లతో గడిపేది ఇదివరకు. ఇప్పుడు ఏదో పుస్తకం పట్టుకుని కూర్చుంటుంది. ఎవరన్నా ఏదన్నా అడిగితే సమాధానం చెప్తుంది.

ఓరోజు మాధవి నొచ్చుకుంటూ- "నిర్మలా, ఆరోజు మా మాటలు విని కోపం తెచ్చుకొన్నట్టున్నావు. ఇదివరకులా సరదాగా మాటలు మానేశావు. " అంది.

"సారీ నిర్మలా, నిన్ను విమర్శించాలని కాకపోయినా ఇలాంటి విషయాలలో అందరికీ కుతూహలం వుంటుంది. ఏంజరిగిందో తెల్సుకోవాలన్న ఆరాటంతోపాటు, తమకు లేని ధైర్యం ఇంకొకరికుందని మెచ్చుకునేవాళ్ళతోపాటు, విమర్శించేవాళ్ళూ వుంటారుగా, దాని కోసం నీవింత హర్ట్ అవడం బాగులేదు" అంది మరికాసేపాగి.

"మాధవీ... నేనేం నా విషయాలు మీదగ్గిర దాచలేదు. మీరూ చదువుకున్నవారు. ఏ ఆడదీ సుఖంగా, సంతోషంగావుండే కాపురం వదులుకుని రాదు. భర్తతో మనస్పర్థలు వస్తే, ఆ ఇంట్లో, ఆ కాపురంలో తనకింక సుఖశాంతులు దొరకవు అని నిశ్చయంగా తెల్సుకున్నాకే గడపదాటుతుంది. ఇదివరకటి స్త్రీ అయితే గడపదాటివచ్చే సాహసం వుండేదికాదు. కాని కాస్త చదువుకుని, ఆర్థికస్వాతంత్ర్యంవున్న స్త్రీ కూడా ఆ నరకంలో మగ్గాలని మీరంతా ఇంకా ఆశిస్తున్నారంటే నాకు బాధ అన్పించింది. అంత తేలిగ్గా ఇంకో ఆడదాన్ని విమర్శించే ముందు మనమూ అదేస్థితిలో వుంటే అని ఒక్కక్షణం ఆలోచిస్తే అంత సులువుగా మాటలు జారరు. " ఆవేశంగా అంది నిర్మల.

"సారీ నిర్మలా! ఫర్‌గెట్ ఇట్ ప్లీజ్... మనందరం ఒక ఫామిలీలా ఇక్కడ పనిచేస్తున్నాం. నీవలా మొహం ముడుచుకునివుంటే నేను చాలా గిల్టీగా ఫీలవుతున్నాను" అంది స్నేహపూర్వకంగా చెయ్యిపట్టుకుని.

అయినా ఆతరువాత నలుగురితో మాట్లాడినా పూర్వంలా అందరితో కలివిడిగా గడపలేకపోయింది నిర్మల.

ఇంట్లో కూడా నిర్మల మాట్లాడటం తగ్గిపోయింది. పూర్వంలా చలాకీగా తిరగని కూతుర్నిచూసి శివశంకరంగారు మధనపడటం మొదలుపెట్టారు. ఎలాగైనాసరే కూతురికి రెండోపెళ్ళి చెయ్యాలన్న ఆరాటం మొదలైంది ఆయనలో. రెండేళ్ళయిందికనక అల్లుడేమన్నా కాస్త మెత్తపడి డైవోర్సు ఇవ్వడానికి అంగీకరిస్తాడేమో? అతనుమాత్రం ఎన్నాళ్ళు ఒంటరిగా వుంటాడు? ఈపాటికి ఆ ఆవేశం తగ్గి

వుంటుంది అనిపించింది.

తండ్రిగాకాక లాయరుగా తన క్లయింట్ విడాకులు కోరుతోందనీ,విడాకులు ఇష్టంలేకపోతే పరస్పర అవగాహనతో సెపరేషన్అయి ఇద్దరూ మళ్ళీ పెళ్ళిళ్ళు చేసుకోడానికి పర్మిషన్ తీసుకోవడానికి తన క్లయింట్ ఇష్టపడుతోందని లాయరునోటీసు పంపించారు. పదిహేనురోజుల తర్వాత అల్లుడితరపు లాయరు "తన క్లయింట్ విడాకులు తీసుకోవడానికి సిద్ధంగా లేడని, మీ క్లయింట్‌కి కావలిస్తే కోర్టుకెక్కి తీసుకోవచ్చుని" జవాబు పంపాడు.

అల్లుడి పగ, ప్రతీకారవాంఛ శివశంకరంగారికి అర్థమయింది. ఇదంతా ఆయన కూతురికి చెప్పక తప్పలేదు ఈసారి. అల్లుడిని ఏవిధంగా లొంగదీసుకోవాలా అని ఆయన రాత్రింబగళ్ళు ఆలోచిస్తూనేవున్నారు. తనా మాట చెప్పగానే కూతురు మొహం కళతప్పడంచూసి ఆయన మరింత దిగులుపడ్డారు.

"అల్లుడికి ఓ ఉత్తరం రాయండి. ఎన్నాళ్ళిలా పంతాలు, పట్టింపులు. దాని మొహం చూస్తున్నారా... ఆ కళా, ఆ సంతోషం ఏంలేవు దాని మొహంలో" అంది శారదాంబ ఓరోజు.

"ఏం రాయమన్నావు -- నా కూతుర్ని తీసుకెళ్ళి మళ్ళీ ఏలుకో అని బతిమిలాడుతూ రాయమంటావా? " ఉరిమారు ఆయన.

"అయ్యో రాత. మాటకి ముందు గయ్‌మంటారు. ఆడపిల్లని కన్నాక ఇంత పంతం, పట్టింపు వుండకూడదు. రెండేళ్ళయింది. అతను కాస్త మారివుంటాడు. ఏవరినన్నా పెద్దవాళ్ళని తీసుకెళ్ళి సంధి కుదురుతుందేమో..."

"సంధి లేదు, ప్రేలాపన లేదు. నీవు మాట్లాడకు. అతనికెంత పొగరో నీకేం తెలుసు. విడాకులు ఇస్తే అది ఎక్కడ మళ్ళీ పెళ్ళిచేసుకుని సుఖపడిపోతుందోనని పగతో విడాకులు ఇవ్వకుండా కూర్చున్నాడు. ఎన్నాళ్ళు పెళ్ళిచేసుకోకుండా తనూ వుంటాడో నేనూ చూస్తాను. అప్పుడు వాడి ఆట ఎలా కట్టించాలో నాకు తెలుసు"

"అతనికేం మగవాడు. ఆడది కావాలంటే పెళ్ళే అక్కరలేదు అతనికి. మన అమ్మాయి అలాకాదుగా. అతను ఒప్పుకున్నా రెండోపెళ్ళి ఈదేశంలో అంత సులువనుకుంటున్నారా. పెళ్ళయి ఆరునెలలు కాపురంచేసినదాన్ని చేసుకోడానికి ఎవరొస్తారు. వచ్చినా అది మీరిచ్చే లక్షలకోసం రావాలి. అలా వచ్చేవాడితో పెళ్ళి ఎంత సంబరంగావుంటుందో మీకు తెలుసు"

శారదాంబ మాటల్లో నిజం ఒప్పుకోడం ఆయనకు ఇష్టంలేదు. "అసలు ముందు నించి నీవే అన్నింటికి శుభం పలకమంటే ఏదోలా మాట్లాడుతున్నావు. కన్నతల్లివి, శుభంకోరే మాటలా ఇవి? పెళ్ళికాదు పెళ్ళికాదు అంటూ పాట.... పోనీ వెధవ పెళ్లికాకపోతే చచ్చిపోతుందా" ఎగిరిపడ్డారు శివశంకరంగారు.

"చచ్చిపోదని తెలిసి మరి ఈ ప్రయత్నాలు ఎందుకుచేస్తున్నట్టు. నానోరు మూయించడానికి మీరేదో అంటున్నారని నాకు తెలుసు. మీకు తెలుసు. మీ మనసులో కోరిక తెల్సుకోనంత వెర్రిదాన్ని కాదులెండి, మీ ఇష్టంవచ్చినట్టు చెయ్యండి" ఆవిడ విసుగ్గా అక్కడినించి లేచివెళ్లిపోయింది.

ఆవిడ అన్నట్టే ఇంకో ఆరునెలలు గడిచేసరికి ఆయన ధైర్యం మరింత సన్నగిల్లింది. ఆ ఆరునెలల్లో ఆయనకి బ్లడ్‌ప్రెషర్ రోగం పట్టుకుంది. చిన్న మైల్డ్ హార్ట్‌ఎటాక్ వచ్చింది. దాంతో ఆయనకి నిర్మలగురించి మరింత చింతపట్టుకుంది. తనకేదన్నా అయితే నిర్మలని వీళ్లంతా సరిగా చూడరేమో! తను పోయేలోగా నిర్మలకి ఎలాగైనా పెళ్లిచెయ్యాలి. ఈ రెండేళ్లలోనే నిర్మలలో వచ్చిన మార్పుచూశాక ఈ వయసులో కూతురిని వంటరిగా యింక ఎన్నేళ్లుంచడం అనిపించి దిగులుపడేవారు. భార్య అన్నట్టు తను తొందరపడి కూతురిబతుకు పాడుచెయ్యలేదుగదా అని మథనపడటం ఆరంభించారు. నిర్మలలో చురుకుదనం, పోయిన కళాకాంతులు ఎలాతేవడమా అన్నదిగులుతో ఆయన బ్లడ్‌ప్రెషర్ మరింత పెరిగింది.

"నాకేంనాన్న... నిక్షేపంలా వున్నాను. నాకేం పెళ్లిచేసుకోవాలన్న కోరికలేదు. అనవసరంగా నాకోసం దిగులుపడకండి. పెళ్లిజీవితంలో ముఖ్యమే, కాని పెళ్లేజీవితంకాదు. నాకు ఉద్యోగం





వుంది. ఎవరు చూసినా, చూడకపోయినా నాబతుకు నేను బతకగలను. నాదిగులుతో మీరిలా అయిపోవడం నేను చూడలేను డాడీ--" తండ్రి ఆరోగ్యం రోజురోజుకీ దిగజారిపోవడం, తనగురించి బెంగపడటంచూసి తండ్రి దగ్గర కూర్చుని అంది.

"అది కాదమ్మా నీరూ... ఎన్నాళ్లు ఏ సరదా, సంతోషం, కోరికా లేకుండా ఒంటరిగా వుంటావు. ఆ దరిద్రుడిని వదిలించుకుంటే మళ్లీ పెళ్లిచెయ్యొచ్చనుకున్నానుగాని వాడిలా పంతంతో కక్ష సాధిస్తాడనుకోలేదు" దిగులుగా అన్నారు.

"పోనీండి డాడీ... మీరంతా వున్నారు నాకేంలోటు. నాకేం పెళ్లిమీద కోరిక లేదు" అంది. ఆ మాటల్లో ఇదివరకటి ధాటి కనపడలేదు ఆయనకి. నిట్టూర్చారు ఆయన.

"పోనీ డైవోర్సుకి అప్లై చేసి. ఏమవుతుందో చూద్దామా. జడ్జి గోపాలరావు నాఫ్రెండు..." ఆశగా ఏదో చెప్పబోయారు.

"అదంతా తరువాత ఆలోచిద్దాం. ముందు మీ హెల్త్ బాగవనీండి. ఇలా ఆలోచిస్తుంటే ఆ బ్లడ్‌ప్రెషర్ తగ్గదు మీకు" నిర్మల మందలించింది.

"చేతులారా మనం చేసుకున్నదానికి బాధపడటం ఎందుకు. మీ తండ్రీ కూతుళ్లు చాలా తెలివయినవారు, అన్నీ తెల్సినవాళ్లు, తప్పుగలవారు. దేనికోసం ఈ చింత? మొగుడు, కాపురం లేనంతమాత్రాన పోయిందేముంది" అవకాశం దొరికిందని చురక అంటించింది శారదాంబ.

భార్యని ఏంఅనలేక పళ్లుకొరుక్కున్నారు ఆయన. "జరిగిందేదో జరిగింది ఇప్పుడు మీ ఆరోగ్యం పాడుచేసుకుని ఏంప్రయోజనం" శారదాంబ విసుగ్గాఅంది. నిర్మల తల్లివంక చూడలేక కళ్లు వాల్చుకుంది. ఇదంతా నీవల్లే అంటున్నట్టు గిల్టీగా ఫీలయింది.

మరో నాలుగునెలలు గడిచాయి. ఆ నాలుగు నెలల్లో శివశంకరంగారి ఆరోగ్యం ఇంకాస్త దిగజారింది. ఏమందులకీ లొంగనంటూంది ఆయన బ్లడ్‌ప్రెషర్. తింటున్నా తిరుగుతున్నా మనిషిలో పూర్వపు నిబ్బరం, మొహంలో గంభీరం లోపించాయి. ఆయన భారీవిగ్రహం, ష్రింక్ అయినట్టు కుంచించుకుపోయింది.

ఆసమయంలో ఆయన చెల్లెలి కొడుకు రామం ఊరినుంచి వస్తూ ఒక వార్తతీసుకొచ్చాడు. నిర్మల మొగుడు ప్రకాశరావు ఈ మధ్య ఇంట్లో ఎవర్తినో పెట్టుకున్నాడుట. పైకి పనికి, వంటకి అనిచెప్పినా ఇంటి ఇల్లాలుగానే ఆమె వ్యవహరిస్తోందిట. పెద్ద చదువులేకపోయినా తెలివయిన మొహం, చురుకుగా పనిపాటలు చేసుకుంటూ, బాగాముస్తాబయి ఇంట్లోతిరిగే ఆమె గృహిణిలాగే కన్పిస్తుందిట. ఇద్దరూ కల్సి సినిమాలకి, షికార్లకి కూడా తిరుగుతున్నారుట. ఈ వార్తలన్నీ ప్రకాశరావు ఇంటిపక్కన వుండే రామంఫ్రెండు చెప్పాడుట. ఇరుగుపొరుగు ఈ విషయం వింతగా చెప్పుకుంటున్నారుట. రామం ఫ్రెండు ఇంటికి వెళ్లినపుడు స్వయంగా ఆమెని చూశాను అని చెప్పాడు రామం. ఈ వార్త చీకటిలో దారితెలియక కొట్టుమిట్టాడుతున్న మనిషికి చిన్న కాంతిరేఖలా సంతోషాన్నిచ్చింది శివశంకరంగారికి.

"దరిద్రుడు! పెళ్లిచేసుకుంటే కేసుంటుందని ఎవర్తినో తెచ్చిపెట్టుకున్నాడన్నమాట. ఈ పాయింటుతో వాడిని కోర్టుకి లాగుతాను" పాయింటు దొరికిందన్నట్టు ఆవేశంగా అన్నారు శివశంకరంగారు.

"నేనుముందే చెప్పాను. అతను మగవాడు. పెళ్లాంలేకపోయినా ఆడది దొరుకుతుంది అతనికి. కేసుపెడితే, నేనేం పెళ్లి చేసుకోలేదు పనికి పెట్టుకున్నాను అంటే ఏం చెయ్యగలరు మీరు..." శారదాంబ నిలేసింది.

శివశంకరంగారు మొహం మాడ్చుకున్నారు. భార్యవైపు ఉరిమిచూసి -- "నీకు కూతురు కంటె అల్లుడే ఎక్కువలా వుంది. అతను అలా చేశాడని సంతోషంగా వున్నట్టుంది. నీవు వెనకేసుకువస్తున్నావు అతన్ని..."

"అవును మామయ్యా... అత్తయ్య అన్నది రైటే... పెళ్లిచేసుకుంటేగదా కేసు" రామం అన్నాడు.

"అతను ముందునించి ఇలాంటి రకమే అంటాను. ఇంకో ఆడదానితో తిరిగితే ఏభార్య సహిస్తుంది అని వాదిస్తాను" సాలోచనగా

అన్నారు శివశంకరంగారు.

''వాదిస్తారు డాడీ. కోర్టుకి వాదనలుకాదు, రుజువు కావాలి'' కొడుకు అన్నాడు.

''చూద్దాం! కేసు ఫైలుచేస్తాను, ఎలాజరిగితే అలా జరుగుతుంది'' నిరాశ పైకికన్పించ కుండా అన్నారు.

★ ★ ★

నిర్మలకేసు మూడునెలల్లో హియరింగుకి వచ్చే ఏర్పాటుచేశారాయన. నిర్మలభర్త గట్టి లాయరుని పెట్టుకున్నాడు. 'తన క్లయింట్ సంఘంలో పెద్దమనిషని, ఉన్నతోద్యోగి అని, మర్యాద హోదా కలవాడని, అతనికి స్త్రీవ్య సనం ఎంత మాత్రంలేదని, భార్య అతనితో కాపురం చెయ్యకుండా వెళ్ళిపోవడంలో అతని నేరం ఏమీలేదని, అతను అందరి భర్తలమా దిరేనని, భార్య నెప్పుడూ కొట్టితిట్టి హింసించ లేదని, అతని భార్యే నేలమీద విహరించ డంమాని ఆకాశంలో విహరించినట్లు, సినిమా లలో, నవలల్లో మాదిరి భర్తలేడని లేనిపోని పిచ్చిపిచ్చి ఆలోచనలతో కాపురం పాడుచేసు కుని వెళ్ళిపోయిందని, కలలకి వాస్తవానికి తేడా గుర్తించలేక అవివేకంతో కాపురం వదులు కుంటే ఆ తప్పు నాక్లయింట్‌ది కాదని వాదించాడతను. అతను భార్య వెళ్ళిపోయాక తనవైపు ప్రయత్నాలు తను చేశాడు. రెండుత్త రాలు రాసినా రాలేదు. నాక్లయింట్ చేసేదిలేక వూరుకున్నాడు. ప్రతివాది తండ్రి లాయరు. తన క్లయింటు విడాకులు కోరుతుందని నోటీ సు పంపితే ఎలాఅన్నా ఆ కాపురం నిలుపుకో వాలన్న కోరికతో నాక్లయింట్ విడాకులకి అంగీ కరించలేదు. ప్రతివాది ఇప్పుడు వస్తే ఆమెతో కాపురం చెయ్యడానికి సిద్ధంగా వున్నాడు నాక్ల యింటు. నాక్లయింటు మగవాడు. ఇంట్లో భార్యలేకుండా రెండుసంవత్సరాలనుంచి ఇబ్బందులుపడుతున్నా రెండోపెళ్ళిచేసుకో కుండా భార్య ఎప్పుడన్నా తిరిగివస్తుందని ఆశతో ఎదురుచూశాడు. ఆఖరికి ఇల్లుగడిచే మార్గంలేక ఇంట్లో వంటకి, పనికి మనిషిని కుదుర్చుకున్నాడు. నాక్లయింట్ భార్య వుండగా ఇంకోస్త్రీతో సంబంధం ఎప్పుడూ పెట్టుకోలేదు. ఇంట్లో ఆడమనిషి వున్నంతమా త్రాన ఏవేవో సంబంధాలు అంటకట్టడం అన్యాయం. లోకులు కాకులు, వారి మాటలు లెక్కచెయ్యనక్కరలేదు. నాక్లయింట్ హిందూ వివాహధర్మాన్ని గౌరవించే మనిషి. నాక్ల యింట్ ఇప్పటికీ కాపురం నిలుపుకోవాలని ఆరాటపడ్తున్నాడు కనక కోర్టువారు దయ వుంచి ఈ కాపురం చక్కపరచమని వేడు కుంటున్నాను'' అంటూ చాలా ధాటిగా ఉప న్యాసాలు దంచాడు. అతని మాటలు జడ్జి గారు నమ్మినట్టే కన్పించారు.

శివశంకరంగారు తనవాదనలో 'మొదటి నించి నాక్లయింట్‌కి అతనికి మనసు కలవలే దు. నాక్లయింట్‌ని మానసికంగా మాటలతో హింసించేవాడు. సుఖసంతోషాలువున్న కా పురం ఏ ఆడదీ కావాలని వదులుకోదు. కల వని మనసులతో కలకాలం కల్సి నరకం అనుభవించడంకంటె విడిపోయి ఎవరి బతు కులు వారు బతకటం నయం అనుకుంది నాక్లయింట్. ఒకరినొకరు ద్వేషించుకుంటూ ఒకయింట్లో బతికేకంటే విడిపోయి కొత్తజీ వితం ప్రారంభించాలనుకుంది నాక్లయింటు. కోర్టువారు దయవుంచి ఆమెకి విడాకులు ఇప్పించవలసిం'దని కోరారు.

మరి మూడు నెలలు కేసు నడిచాక వచ్చిన జడ్జిమెంటులో ప్రకాశరావు అందరి భర్తల కంటే విపరీత ధోరణులతో ప్రవర్తించలేదని తమకు నమ్మకం కల్గిందని, నిర్మల చిన్న విషయాలని కొండంతలుగా ఊహించుకొని కాపురం వదిలివెళ్ళిందని తమకు నమ్మకం కల్గినందువల్ల, ప్రకాశరావు ఇప్పటికీ ఆ భార్య తిరిగి వస్తే స్వీకరించడానికి సిద్ధంగావున్నాడు కనక హిందూ వివాహధర్మాన్ని గౌరవించి ఆమె తిరిగి భర్త దగ్గరకి వెళ్ళాలని తాము కోరుతున్నామని, విడాకులకి తగినంత కా రణం కనపడలేదని, కాపురానికి వెళ్ళేది మానేది నిర్మల ఇష్టమని, కోర్టు బలవంతంగా ఎవరిచేత కాపురాలు చేయించలేదని- ఇద్దరూ ఇష్టపడి పరస్పర అవగాహనతో తిరిగి పెళ్ళికి వప్పుకుంటే కోర్టుకి ఏమి అభ్యంతరం ఉండ దని 'కర్ర విరగకుండా పాము చావకుండా' తీర్పు చెప్పారు జడ్జిగారు- అంటే ప్రకాశరావు అంగీకారం లేనిదే నిర్మల పెళ్ళిచేసుకోడానికి




వీలులేదు. కావాలని ప్రకాశరావు కక్ష తీర్చుకుంటున్నాడని ఈ విషయంలో తమింక ఏం చెయ్యలేరని గ్రహించాక శివశంకరంగారి నడుము విరిగినట్లయింది. ఆ దెబ్బతో ఆయన పూర్తిగా హతాశులయ్యారు. నిర్మల పైకి ఎంత లెక్కలేనట్టు నిర్లక్ష్యం చూపాలన్నా ఆ దెబ్బతో ఆమె ఆశలూ అడుగంటి కృంగిపోయింది. విరక్తి, నిర్లిప్తత మరింత పెరిగింది. ఆమె మొహం మరింత వాడిపోయింది. శివశంకరంగారు తప్పు చేసిన వాడిలా కూతురికి. భార్యకి మొహం చూపలేనట్టు తప్పించుకుని తిరిగారు- ఆ దెబ్బతో ఆయన బ్లడ్‌ప్రెషర్ మరింత పెరిగింది. డాక్టరు 'మనసు ప్రశాంతంగా ఉంచుకోకపోతే మందులిచ్చి ప్రయోజనంలే'దని మందలించాడు.

``దానదృష్టం అంతే. దానికి మీరేం చెయ్యగలరు. మనం చేతులారా చేసుకున్నాం. ఇప్పుడిలా బెంగపెట్టుకుని ఆరోగ్యం పాడుచేసుకుని నన్ను అన్యాయం చేసిపోదామనుకుంటున్నారా- మీరిలాగేవుంటే రేపే నేను దాన్నిలాక్కెళ్ళి మొగుడి దగ్గర వదిలి వస్తాను. జాగ్రత్త. అది కాపురం అక్కర్లేదనుకుని వచ్చింది. దానికి లేని బాధ మీకెందుకు- ఏదో తొందరపడి వచ్చినా అది తప్పుతెలుసుకుంటే ఎప్పుడో వెళ్ళేది. అదనిశ్చింతగా వుండగా మధ్య మీరెందుకిలా దిగులుపడి ఆరోగ్యం పాడుచేసుకుంటారు.'' అని శారదాంబ చాలాగట్టిగా మందలించింది. పక్కనే వున్న నిర్మల వంక చూసి- ``చూశావా... ఓ ఆలోచనా పాడులేకుండా ఆవేశంతో చేసిన తొందరపాటుపనివల్ల ఎందరి మనసులు. ఎందరి జీవితాలు అల్లకల్లోలం అవుతాయో చూడు.... నీమాత్రం ఆవేశం లేకనా- ఏంజరిగినా ఓర్చుకుంటూ ఆడవాళ్ళు కాపురాలు చేస్తున్నారు. ఊ... ఆ.... అంటే విడిపోవడానికి ఇదేం విదేశంకాదు. వచ్చేయడం తేలికే కాని తరువాత వచ్చే పరిణామాలు ఎదుర్కోవడం ఎంత కష్టమో అర్థం అయిందా'' అందావిడ గంభీరంగా. నిర్మలకి తల్లి మాటలకి దుఃఖం పొంగి వచ్చింది. ఇంట్లో తల్లి, అన్నలు, పనివాళ్ళు అందరూ తనేదో ఘోరాపరాధం చేసినట్టు, తండ్రి అనారోగ్యానికి తనే కారణం అన్నట్టు చూస్తున్నారు.

"డాడీ... నన్ను పంపేయండి డాడీ అక్కడికి. నావల్ల మీ అందరికీ బాధలెందుకు. నా ఖర్మానికి నన్ను వదిలేయండి- నేను వెళ్లిపోతాను. అక్కడ బతకలేకపోతే చస్తాను- రేపే వెళ్ళిపోతాను నేను...." ఏడుస్తూ ఆవేశంగా అని అక్కడ నించిపారిపోయింది.

"నీరూ.... నీరూ.... అమ్మా...." శివశంకరంగారు ఆదుర్దాగా పిలిచారు. "మీరసలు మనుషులేనా? బుద్ధిజ్ఞానం అసలున్నాయా- అదసలే కుమిలిపోతూంటే దాని ఎదురుగా అలా మాట్లాడుతావా? నీవసలు తల్లివేనా... సవతితల్లిలా దాన్ని ట్రీట్ చేస్తున్నావు. అది ఇంట్లో వుందని, ఎవరో వూర్లోవారు వుండి తినిపోతున్నారన్నట్టు ప్రవర్తిస్తున్నావు. ఇదిగో శారదా, అది నా ప్రాణం... దాన్ని నీవు ఇక మీదట ఏమన్నా మాటదక్కదు. ఓ ఆడపిల్ల పెళ్ళవగానే చచ్చినట్టే లెక్క మీకు. పుట్టింట్లో వుంటే కన్నతల్లే విషంగా మారుతుందని నిరూపిస్తున్నావు. సరే, నీ ప్రవర్తనతో నా కళ్ళు తెరిపించావు- నీ కిష్టంవున్నా లేకపోయినా నా ప్రాణం వున్నన్నిరోజులు అదిక్కడే వుంటుంది. నా తదనంతరం ఏం చెయ్యాలో చేస్తాను. దానిగురించి ఎవరేం మాట్లాడినా ఇహ సహించను"- ఆయన చాలా తీవ్రంగా భార్యని మందలించి కూతురి గదిలోకి వెళ్లారు. నిర్మల తలగడలో మొహం దాచుకుని ఏడుస్తూంది. "నీరూ.... తల్లీ... ఇలా చూడమ్మా.... ఛ.... ఏడుపేమిటమ్మా-" అన్నారు తలనిమురుతూ.

"డాడీ నేను వెళ్ళిపోతాను డాడీ- నన్ను పంపించేయండి. నావల్ల మీ అందరికీ బాధలు వద్దు. నా ఏడుపు నేను ఏడుస్తాను. నేవెళ్ళిపోతాను..." అంది ఏడుస్తూ-

"ఛ.... చిన్నపిల్లలా ఏమిటమ్మా అది.... నా ఆరోగ్యం బాగులేదన్న బాధతో అమ్మ ఏదో అంటే ఇలా బాధపడ్తావా...."

"లేదు డాడీ... మీకు తెలియదు. ఈ మూడేళ్ళకే అంతామారిపోయారు. అన్నయ్యలు నాతో ఇదివరకులా వుండటంలేదు. అమ్మ అన్నింటికీ నేనే కారణం అన్నట్టు చూస్తుంది. నేను ఇంట్లో వుండను. వేరే ఇల్లు చూసుకుంటాను, లేదంటే వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్లో వుంటాను-"

"నేనుండగా నీకేం ఖర్మతల్లీ.... అమ్మతో గట్టిగా చెప్పాను ఇవాళ నిన్నేం అన్నా వూరుకోనని. అసలు నీవామాటలు పట్టించుకోవద్దు. ఈ ఇల్లు నాది, ఈ సంపాదన నాది. నా ఇంట్లో నేనున్నన్ని రోజులు నా ఇష్టంగా జరుగుతుంది"

నిర్మల కన్నీళ్ళమధ్యనించి బేలగా చూస్తూ- "పోనీ డాడీ... ఆయన దగ్గరకి వెళ్ళిపోనా" అంది.

"నీకేం మతిపోయిందా- ఇప్పుడు ఈ స్టేజీలో వెడితే నీగతి ఏమవుతుందో, నిన్నెలా ట్రీట్ చేస్తాడో నేనూహించగలను. నో.... ఇట్స్ టూ లేట్" అన్నారు ఆయన.

నిర్మలకీ ఆ విషయం తెలుసు- ఆ భయమే లేకపోతే ఇంకో ఛాన్సు ఇవ్వడానికి ప్రయత్నించేది. కాని ఇప్పుడు.... ఆ విషయం తల్చుకుంటేనే గుండెదడగా వుంది ఆమెకి.

"పిచ్చిపిచ్చి ఆలోచనలతో మనసు పాడుచేసుకోకమ్మా.... చూద్దాం- ఇంకో రెండు మూడేళ్ళు పోతే దారికి వస్తాడేమో- అతనికి మాత్రం సంసారం, పిల్లలు కావాలని వుండదూ- నీవు మాత్రం సంతోషంగా తిరక్కపోతే వూరుకోను" అని మందలించారు.

★ ★ ★

ఆ తర్వాత నాల్గురోజులలో ఆయన ఎవరికీ చెప్పకుండా విల్లురాసి రిజిష్టర్ చేయించేశారు. ఉన్న ఇల్లు కూతురి పేరపెట్టి, ఓ లక్ష రూపాయలు ఆమెపేర బ్యాంకిలో ఫిక్సెడ్ డిపాజిట్టులో పెట్టి ఆ వడ్డీ ఆమెకి నెల నెలా చెందేట్టు- కొడుకులు ముగ్గురికీ తలో లక్ష, వూర్లోవున్న పొలాలు, భార్యకి కొబ్బరితోట, ఓ లక్ష క్యాష్- ఆమె తదనంతరం అది కొడుకులకి చెందేట్టు, భార్య బతికున్నంతకాలం ఆ ఇంట్లో వుండవచ్చని ఆమె కూతురికి తోడుగా అక్కడ వుండాలని తన కోరిక అని విల్లులో స్పష్టంగా రాశారు- విల్లు రాశాక ఆయనకి కాస్త నిశ్చింత అనిపించింది. తనున్నాలేకపోయినా కూతురికి ఏ లోటూరాదు అనుకున్నాక కాస్త స్థిమితపడ్డారు- దాంతో బ్లడ్‌ప్రెషర్ తగ్గు




మొఖం పట్టింది.



ఓ రెండేళ్ళు యాంత్రికంగా పెద్దగా ఏమార్పులు లేకుండా గడిచిపోయాయి. రఘు లాయరు అయి తండ్రి ప్రాక్టీసు అందుకున్నాడు- రెండోవాడు కృష్ణ- ఇంజినీరింగ్ ఫైనల్ఇయర్. మూడు మోహన్- బి.కాం. అయి ఎమ్.బి.ఏలో చేరాడు. నిర్మల ఉద్యోగానికి వెళ్ళడం రావడం... అంతా రొటీన్- ఆమె జీవితంలో ఓ రకమైన ఉదాసీనత చోటుచేసుకుంది.

ఆ ఏడాది రఘుకి మంచి సంబంధం వచ్చి పెళ్ళి సెటిల్ అయింది. పెళ్ళికూతురు దివ్యది ఆ వూరే. ఆమె తండ్రి పెద్ద కంపెనీలో పనిచేస్తున్నారు. దివ్య ఎమ్మే పాసయి లా చదువుతూంది. పిల్లచాలా చక్కగావుంటుంది. చాలా మంచి సంబంధం అని అందరూ చాలా సంతోషించారు. రఘు అయితే చూసింది మొదలు ఆ అమ్మాయి అందానికి దాసుడయిపోయాడు. ముహూర్తం నెలా పదిహేనురోజులకి కుదిరింది. ప్రధానం చిన్నసైజు పెళ్ళిలా చాలా ఆర్భాటంగా చేశారు పెళ్ళివారు. నిర్మల దివ్యని, ఆమె చలాకీతనాన్ని చూసి ఇంక తనకు ఇంట్లో బాగా కాలక్షేపం వుంటుందని సంబరపడింది. ఆనెలాపదిహేను రోజులలో దివ్య, రఘు పెళ్ళి అయిపోయినట్టే సినిమాలకి, షికార్లకి తెగతిరిగారు. రఘు సగం రోజులు వాళ్ళింట్లోనే భోజనం చేసేవాడు. ఇద్దరూ ఏరి కోరి చాలా ప్రెజెంట్స్ ఇచ్చుకున్నారు. దివ్య దివ్య అంటూ ప్రతిమాటకీ ముందూ ఆమె గురించే మాట్లాడేవాడు. వాళ్ళిద్దరినీ చూస్తుంటే నిర్మల ఆశ్చర్యంతోపాటు అదోరకం బాధ కల్గింది. పెళ్ళికాకుండానే అన్ని పనులని ఎంతఅపురూపంగా చూస్తున్నాడు. ఎలా వెంట తిరుగుతున్నాడు- ఒక మగవాడు తనని ఆరాధిస్తూ, ఆరాధిస్తూ వెంట తిరగడంకంటే ఆ ఆడపిల్లకి కావల్సింది ఏముంటుంది! ఆ గర్వం, ఆ సంతోషంతో దివ్య మొహం వెలిగిపోవడం చూసి.... తనపెళ్ళి రోజులు గుర్తుకు తెచ్చుకునేది. ఆ కళ్ళల్లో మెరుపులు, మైమరపులు. ఆ నవ్వులు తన జీవితంలో ఒక రోజయినా లేవు- పుస్తకాలలో చదవడం, సినిమాలలో చూడటంతప్ప నిజజీవితంలో వుంటాయా అన్న అనుమానం ఈ రోజు తీరిపోయింది. ఇది మనుషుల ప్రవృత్తిబట్టి వుంటుందా, లేక అదృష్టాల మీద ఆధారపడి వుంటుందా. మగవాడు ఆ కొత్తమోజులోనయినా భార్యని కాస్తబాగా చూస్తాడే, ఆ మాత్రందానికి కూడా తాను నోచుకోలేదు- ఆ మనిషిలో ప్రేమ అనురాగం అప్యాయత అన్న పదాలకి అర్థం తెలిస్తే తన జీవితం ఇలా ఎందుకయ్యేది అని విచారించింది నిర్మల.

కొడుకు, కాబోయే కోడలు ఎంతో సరదాగా తిరుగుతుండటం చూసి, నిర్మల మొహంలో భావాలు చదివినట్టే శివశంకరంగారు బాధపడ్డారు. ఏ ఆనందానికీ నోచుకోని కూతుర్ని చూసి, కాస్త సర్దుకున్న బాధ తిరిగి మొదలైంది. శారదాంబ కూడా కూతురి మనోభావాలు గుర్తించింది.

పెళ్లి కుదిరాక నిర్మల భర్త ప్రసక్తి, నిర్మల అత్తవారి గురించి అడిగారు వియ్యాలవారు. శివశంకరంగారు ఏదీ దాచకుండా నిష్కర్షగా కూతురు అల్లుడు విడిపోయారని చెప్పేశారు. వాళ్ళు మొహాలు చూసుకున్నారు. నిర్మల ఉద్యోగం చేస్తూంది కనక ఆమె భారం తమ అల్లుడి మీద వుండదు కనక మనకెందుకులే అని వూరుకున్నారు. వియ్యపురాలు అయితే మాత్రం "అమ్మాయికి మళ్ళి పెళ్ళిచేస్తారా. ఎన్నాళ్ళు ఇలా వుంచుకుంటారు" అంది. "మళ్ళి ఒకసారి అల్లుడి దగ్గరకి వెళ్ళి పెద్దవాళ్ళతో చెప్పించకపోయారా" అని ఉచిత సలహా పారేసింది. "ఆడపిల్లని ఇంట్లో పెట్టుకుంటే ఇబ్బందులు వస్తాయి వదినగారూ ముందు ముందు. 'ఆడపిల్ల' అన్నాక 'అడ'నే వుండాలిగాని' ఈడపిల్లకాదు కదా, ఎంత పుట్టింటివారికి వున్నా అత్తింటి కాపురం చేసుకుంటే వున్న తృప్తి ఇలా పుట్టింట్లోపడివుంటే వస్తుందా" నీతులు బోధిస్తున్న వియ్యపురాలిని ఏమీ అనలేక మొహం గంటుపెట్టుకుంది శారదాంబ. ఆ కోపం అంతా భర్తమీద చూపింది. "ఇన్నాళ్ళు దాచివేరు. ఇప్పుడు రఘుపెళ్ళి అవుతూంది. వాళ్ళిద్దరూ చిలకాగోరింకల్లా తిరుగుతూంటే ఇది మోడులాపడివుండటం దానికెంత బాధ, మనకెంతబాధ. ఆ వియ్యపు

రాలు పెళ్ళికి ముందే ఇలా అంది. రేపు కోడలు వచ్చాక ఇది వాళ్ళకి ఎంత లోకువవ్వుతుందో తెలుసా? ఇంట్లో కోడలేమన్నా అంటే అది ఎంత బాధపడ్తుంది. అదివిని ఎటూ చెప్పలేక మనం ఎంత బాధపడాలి. అనకుండా వూరుకుంటే అది విపరీతంగాని, పుట్టింట్లోపడివున్న ఆడపిల్లని అనడం సహజం. నాకు తెలుసు ఇలాంటివన్నీ జరుగుతాయని. పెద్దలు అనుభవంతో చెపుతారు-"

"చాలిస్తావా నీ సాధింపు. ఏం ఆ వియ్యపురాలికి నా కూతురు బరువయిందటనా? ఎన్నాళ్ళుంటుందో, వుంచుకుంటామో అది ఆవిడకేం బాధ. ఈసారంటే నోరుముయ్యమను-" కోపంగా అన్నారు శివశంకరంగారు.

"ఇవాళ వియ్యపురాలంది- రేపు కోడలంటుంది. ఎన్నాళ్ళు ఎవరి నోళ్ళు మూయించగలం. అందులో రఘు ఇక్కడుండేవాడు. పోనీ ఏదో పైవూరిలో ఉద్యోగం అనుకుంటే అదోదారి- రేపు ఇంట్లో ఆ కోడలు దీన్ని చిన్నచూపు చూస్తే...."

"అంతదాకా వస్తే వాళ్ళని బయటికి నడిచి వేరింటికాపురం పెట్టుకోమంటాను. నీవు అన్నింటికీ పెడఆలోచనలు చెయ్యకు" విసుక్కున్నారాయన.

మిగతా విషయాలలో శివశంకరంగారికి ఎంతటి లోకానుభవమున్నా కూతురి విషయంలో మాత్రం ఆయన అనుభవాన్ని అనురాగపు పొరకమ్మింది. ఎవరిమాటలు, ఎవరి విమర్శలు ఆయన వినరు. లెక్కచెయ్యరు. తనకి డబ్బువుంది. ఆ డబ్బుతో కూతురి సుఖానికి బాటవెయ్యగలనన్న విశ్వాసం వుందిఆయనకి. లోకంలో డబ్బు ఒక్కటే అన్నీ సమకూర్చదన్న విషయం గ్రహించడానికి ఇష్టపడరు. తనదికన్న కడుపు కనక కూతురి విషయం కడుపులో పెట్టుకుంటారు. కూతురిపట్ల సానుభూతి వుండాలి. మిగతావారికి ఎందుకుంటుంది, ఎందుకుండాలి అని ఆలోచించడానికి కష్టపడరు. కొడుకులు పెళ్ళిళ్ళయ్యే వరకే తమ బిడ్డలు. కోడలు వచ్చాక వాళ్ళ సంసారాలు, వాళ్ళ స్వార్థాలు వాళ్ళవి. ఈనాడు చెల్లెలి పట్ల వున్న ప్రేమాభిమానాలు రేపుండవు అన్న నిజం ఆయన గ్రహించలేదు. భార్య శారదాంబ కన్నతల్లి అయివుండీ ఎంత లోకజ్ఞానంతో మాట్లాడుతూందో అర్థం చేసుకోకుండా కూతురు అక్కడ వుండటం ఆమెకిష్టం లేదన్నట్టు మాట్లాడి సాధించేవారు.

★ ★ ★

రఘు పెళ్లి అట్టహాసంగా, ఆడంబరంగా జరిగింది. ఒక్క ఆడపిల్ల అని పెళ్లి బాగా చేశారు. లాంఛనాలు, మర్యాదలు బాగానే జరిగాయి. కూతురికి మంచి ఫర్నీచర్, ఫ్రిజ్, గోద్రేజ్‌ల దగ్గరినించి అన్నీఇచ్చి పంపారు అత్తవారింటికి. రఘు కళ్లు నేలమీద ఆననట్టే భార్యని చూసుకొని ఊహాలోకాల్లో తేలిపోతూ చుట్టూ జరుగుతున్నది పట్టించుకోడం మానేశాడు. నిర్మల ఎంత సంతోషంగా, ఎంత హడావిడిగా అన్నపెళ్లిలో తిరిగినా ఏదో వెల్తిగా అన్పించింది. అదేమిటో ఆమెకి అర్థంగాలేదు. పెళ్లికి వచ్చిన చుట్టాలు 'అమ్మాయి మరివెళ్లదా, అల్లుడేమన్నాడు, మళ్లీ పెళ్లి చేస్తారా' లాంటి ప్రశ్నలు కొందరు డైరెక్ట్‌గా అడిగితే, ఇంకొందరు ఇన్‌డైరెక్ట్‌గా అడిగారు. ఆ మాత్రం చనువులేనివాళ్లు ఆ భావాలు చూపులతో వ్యక్తం చేశారు. అటు ఆడపెళ్లివారు నిర్మలని చూసినప్పుడల్లా గుసగుసలాడుకునేవారు. కళ్లతో సౌంజ్ఞలు చేసుకునేవారు. 'ఈ అమ్మాయే మనదివ్య ఆడపడుచు. మొగుణ్ని వదిలేసిందట. మూడేళ్లబట్టి పుట్టింట్లోనే వుంటోంది. అంటూ గుసగుసలాడేవారు. నిర్మల అదంతా పట్టించుకోకుండా దులిపేసుకోవాలన్నా ఒక్కోసారి ఆ మాటలు ఆమె చెవిన పడి మనసు చివుక్కుమనేది. మొహం చిన్నపోయేది. తప్పు చేసినదానిలా తప్పించుకు వెళ్లిపోయేది.

గృహప్రవేశం, రిసెప్షన్ హడావిడి, ఆ తరువాత హనీమూన్ ట్రిప్ అయ్యాక దివ్య కాపురానికి వచ్చింది. ఆ అమ్మాయి స్వతహాగా సరదా అయింది. ఈ కాలంపిల్లల భావాలుకలది కనక నిర్మల గురించి మొదట ఏం అనుకోలేదు. ఇంట్లోతల్లి, చుట్టాలు రకరకాలుగా మాట్లాడుకోడం విన్నాక ఆమెకి తెలియకుండానే ఆమెలో నిర్మలంటే అదోరకం చులకన భావం




మెడినోవా
వారి మాస్టర్ హెల్త్
చెకప్ కేవలం
రూ. 500/- లకే



# ఆలోచించి వేసే మీ ప్రతిఅడుగు!
# మీ ఆరోగ్యకరమైనభవిష్యత్తుకు వెలుగు!!



ఆరోగ్యంగా ఉండటం ప్రతి వ్యక్తికి అవసరం. మీరు ఆరోగ్యంగా ఉన్నట్లే కవిపించవచ్చు. కానీ, మీకు తెలియకుండానే ఏ వ్యాధి అయినా మీ శరీరంలో ప్రారంభదశలో ఉండవచ్చు. కాబట్టి అప్పుడప్పుడు ఆరోగ్యపరీక్ష చేయించుకోవటం ఎంతో అవసరం.

కేవలం రూ.500/- ఖరీదుచేసే మెడినోవా వారి సంపూర్ణ ఆరోగ్య పరీక్షా పథకంతో మీ ఆరోగ్యాన్ని పరీక్ష చేయించుకొని అనారోగ్యాన్ని ఆమడ దూరం నెట్టేయండి.

ఆరోగ్యపథానికి అందమైన పథకం– మెడినోవా



**Medinova**
DIAGNOSTIC SERVICES
*A Division of*
*Standard Medical & Pharmaceuticals Ltd.*
Panjagutta Main Road, Hyderabad 500 482
Ph: 226161 228144 228166

వచ్చింది. అసలు ఆ కొత్తవైవాహిక జీవితంలో నిర్మల గురించి ఆలోచించే తీరికేలేదు ఆమెకి. ఎంతసేపు రఘు - ఆమె, సినిమాలు, షికార్లు, గదిలో తలుపులు బిడాయించుకొని ఒకరి కౌగిలిలో ఒకరు కరిగిపోవడంతో ఓ నెల గడిచిపోయింది. అప్పటికి ఆ దంపతులిద్దరికీ కాస్త కొత్తమైకం వదిలి ప్రపంచంలోపడ్డారు. రఘు కోర్టుకి వెళ్లడం ఆరంభించాడు. దివ్య లా ఫైనల్ఇయర్‌లో వుందికనక చదువు ఆపకుండా పూర్తి చెయ్యాలని ఇద్దరూ అనుకున్నారు. కనక మళ్లీ దివ్య కాలేజికి వెళ్లడం ఆరంభించింది. కాలేజికి వెళ్లిరావడం, సాయంత్రం షికార్లు, సినిమాలు, రాత్రి భోజనాలవగానే గదిలో దూరడం- ఉదయం ఏడులోపల లేవరు ఇద్దరూ. ఉదయం కాఫీ టిఫిన్లు గదిలోకే తీసుకెళుతోంది దివ్య. బ్రేక్‌ఫాస్ట్, స్నానాలు పూర్తిచేసి గాని గదిలోంచి బయటపడరు. ఉదయంపూట ఎవరి హడావిడిలో వారు తయారై కాలేజీలకి, ఆఫీసులకి వెళ్లడం- అన్న పెళ్లి అయితే దివ్యతో తనకి బాగా కాలక్షేపం అవుతుందనుకున్న నిర్మలకి చాలా ఆశాభంగం కల్గింది. ఇంట్లో ఎదురుపడితే హాయ్ అనడమో, ఇప్పుడే వచ్చావా ఇంటికి అని ఓ చిన్న పలకరింపు తప్ప, ఇద్దరూ ఒకఈడువాళ్లయినా కూర్చుని మాటామంతీ ఆడుకునే అవకాశమేరాలేదు నిర్మలకి. రాత్రి భోజనాలపుడు మాత్రం వాళ్లెక్కడికీ వెళ్లనిరోజు అంతా కల్సి భోజనం చేసే అవకాశం వచ్చేది. అప్పుడు మామగారున్నారనేమో ఎక్కువ మాట్లాడేదికాదు. జనరల్‌గా లోకాభిరామాయణమో, కుటుంబ విషయాలో మాటల్లో దొర్లేవి. ఆ పరిస్థితిలో దివ్యతో చనువుగా ఎలా వుంతటమో నిర్మలకి అర్థంకాలేదు. అటు శారదాంబకీ కోడలు వచ్చిన ముద్దుముచ్చట తీరలేదు. ఆ అమ్మాయి ఇంట్లోవున్న కాసేపు అయినా అందరిమధ్యకు రాదాయె అనుకుంటుంది. ఆదివారం వస్తే దివ్య, రఘు ఇద్దరూ ఆమె పుట్టింటికి వెళ్లి భోజనాలు చేసి రాత్రికిగాని రారు. అత్తగారేదన్నా అడిగితే జవాబు చెప్పడంతప్ప తనంతట తానుగా ఏదీ మాట్లాడని కోడలితో శారదాంబకీ పరిచయం పెంచుకునే అవకాశం లేకుండా పోయింది. అత్తవారిల్లు, అత్తగారికి కాస్తోకూస్తో చేదోడుగా వుండాలని, ఆ ఇల్లు తనది, పనిపాట కాస్త చూసుకోవాలని కూడా అనుకోకుండా ఏదో హొటల్లో వున్నట్టు వేళకి కాఫీ, టిఫిన్లు భోజనాలకి రావడంతప్ప ఏదీ కల్పించుకోకుండా గెస్ట్ మాదిరి గడుపుతున్న కోడలిని ఏమనాలో తెలియటంలేదు శారదాంబకి. ఇంట్లో వంటకి మనిషివున్నా, ఎన్ని పనులుంటాయి కనీసం ఇది చెయ్యనా అత్తయ్యా అని రానికోడలిని ఏం అనుకోవాలో తెలియదు ఆవిడకి. రఘు అయితే పెళ్లయ్యాక ఓ వంటిల్లు వుంటుందని, వంటపని వుంటుందన్న విషయం మర్చిపోయినట్టు దివ్య గదిలోకి కాఫీ ఫలహారాలు తెస్తే తినడంతప్ప మిగతా విషయాలు పట్టించుకోడం మానేశాడు. ఓ వారంరోజులు వంటావిడ సెలవు పెడితే తల్లి పనితోసతమతమవుతుంటే నిర్మల సాయంచేసేదికాని దివ్య వంటింటివైపన్నా రాలేదు. "కోడలు వచ్చినా నాపాట్లు తప్పలేదు" ఒకటి రెండుసార్లు గొణుక్కుంది శారదాంబ.

"పోనీలే అమ్మా... నేనున్నానుగా సాయంచెయ్యడానికి" అంది నిర్మల నెమ్మదిగా.

అటువచ్చిన శివశంకరంగారు హాస్యంగా, "ఏమిటోయి... కోడలు వచ్చినా వంటింట్లోనే మగ్గుతున్నావు? నీవు ఇవతలికిరా, ఈరోజు కోడలి వంట రుచి చూద్దాం" అన్నారు.

"ఆ... చేసే కోడలేలెండి! అసలా అమ్మాయికి ఇంకా ఇది తన ఇల్లు, సంసారం అన్నది పట్టనేలేదు. ఏదో హొటల్లో వున్నట్టు తినిపోవడంతప్ప" విసుగ్గా అంది ఆవిడ.

"తెలియకపోతే తెలియజెప్పాలిగాని గొణుక్కుంటే ఏం లాభం?"

"చిన్నవాళ్ళా చెప్పి చేయించుకోడానికి. ఏమన్నా అంటే అత్త ఇలా అందని నన్ను ఆడిపోసుకుంటారు. అసలు మీ కొడుకుననాలి! పాపం వాడు, వంటింట్లో అన్ని పన్లకి మిషన్లున్నాయి, మీట నొక్కితే వచ్చేస్తాయి అనుకుంటున్నాడులెండి. పెళ్లాం ఎక్కడ కష్టపడిపోతుందోనని భయంగావోలు. పెళ్లయి మూడునెలలు అయినా ఇంకా కొత్తపెళ్లాం మోజులోనే వున్నాడు. ఆ మైకం దిగితే అప్పుడు ఏమన్నా మనం అనిపిస్తామేమో" నవ్వుతూ

అన్నా పెళ్లయిందగ్గరనించి బొత్తిగా పరాయి వాడిలా అయిపోయాడన్న బాధవుంది ఆవిడ మాటల్లో.

"అంతామరి నీలాగేవుంటారా. గదిలోవున్న కాసేపు 'అయ్యో అత్తగారేం అనుకుంటారో, మామగారేం అనుకుంటారో, అయ్యయ్యో పట్టపగలు వీళ్లు చూస్తారు వాళ్లు చూస్తారు' అని భయపడటానికి నీకోడలు ఈకాలంపిల్ల-" శివశంకరంగారు హాస్యమాడారు.

నిర్మల బిడియంగా తలదించుకుంది. తల్లి అంటే పాతకాలంది. కాని తను.... తనకి ఇలాంటి అనుభవం ఎప్పుడు కలిగిందికనక. గదిలో భర్త బంధించడం, అయ్యో అత్తగారేం అనుకుంటారో వదలండి అని ముద్దులు గునవడం ఇలాంటి అనుభూతులకి అసలు తావెక్కడేదిసింది తన మూన్నాళ్ల కాపురంలో? నిజంగా దివ్య ఎంత అదృష్టవంతురాలు. అంత అపురూపంగా చూసుకొనే భర్త దొరికాడు. మాటిమాటికీ దివ్యని చూస్తూ తన మూడునాళ్ల కాపురం గుర్తుతెచ్చుకొని నిట్టూర్చేది నిర్మల.

"ఇలాంటివాళ్లకి వేరింటి కాపురాలుపెడితే గాని బాధ్యతలు వంటబట్టవు. అయినా అందరూ మీ కోడలులాగే వుంటారా. మా అన్నయ్య కోడలు వచ్చిన మూడోరోజే ఇంటి పెత్తనం అంతా చేతిలోకి తీసుకొని అత్తగారిని కుర్చీలో కూర్చోపెట్టి అన్నీ చేతికందించేది."

"నీ కోడలు అలా కాదంటావు. ఉండు రఘుని పిలిచి మీ అమ్మని కుర్చీలో కుర్చోపెట్టాలి ఇంక అని చెబుతాను" హాస్యంగా అన్నారు.

"ఆ... అందలం ఎక్కించే రకాలువేరులెండి. ఆ రకాలు మర్యాటిసించే తెలుస్తాయిలెండి. పనిపాట మాట అటుంచి కాస్త గదిదాటి బయటికి వచ్చి నలుగురితో కలియడానికి ఏం వచ్చింది. కోడలు వచ్చిందన్నమాటేగాని ఓ మాటా మాంతా" మూతి ముడిచింది శారదాంబ.

"ఆ... ఏదో కొత్తమోజు! నాల్గురోజులుపోనీ ఇంతకీ నీతో ఏం మాట్లాడుతుంది. నీతో, నాతో మాట్లాడాలంటే జనరేషన్‌గాప్ అంటారు ఈ కాలం పిల్లలు".

"పోనీ నేనంటే ముసలిదాన్ని. తన ఈడుది నిర్మలవుందిగా ఇంట్లో...."

శివశంకరంగారు అవును నిజమేనన్నట్టు తలపంకించారు.

"ఆ అమ్మాయి తత్వమే అంతేమో. అట్టే మాట్లాడే రకంగాదేమో"

"అవునవును... మాట్లాడే రకమోగాదో అలా రఘుగది బయట రెండు నిమిషాలు వుండి వినండి- వాళ్ల వాళ్లుగాని, ఫ్రెండ్సుగాని వచ్చినపుడు వినండి"

భార్య మాటల్లో నిజంవుందని ఆయనకీ తట్టింది. కోడలు వస్తే నిర్మలకి కాస్త కాలక్షేపం వుంటుందని ఆయనా ఆశించారు. కాని ఆ కోడలు ఎప్పుడూ నిర్మలతో సరదాగా గడపడం ఆయన చూడలేదు. పోనీ వాళ్లు ఏ సినిమాకో వెడుతున్నప్పుడైనా కనీసం మర్యాదకైనా రమ్మని పిలిచినట్టు కనబడలేదు ఆయనకి. ఏదో కొత్తమోజు అనుకున్నారు. నాల్గునెలలు పైన అయింది. ఇంకా అంత కొత్తేమిటి! పాపం... నీరు వంటరిగా వుంటుంది, దాన్ని కాస్త ఎక్కడికన్నా తీసుకెళ్లాలని రఘుకైనా అన్పించలేదా అనుకున్నారు ఆయన.




మరో వారం తరువాత -

ఆరోజు ఆదివారం! రఘు, దివ్య సినిమాకి వెళ్లడానికి ముస్తాబు అవుతున్నారు. వాళ్ల మాటలనుబట్టి సినిమాకు వెడుతున్నట్టు గ్రహించి శివశంకరంగారు "రఘూ" అని పిలిచారు.

మైకట్టురుంటూ బయటికివచ్చి... "ఏం

నాన్నా..." అన్నాడు.

'సినిమాకి వెడ్తున్నారామీరు' అన్నారు రఘు వంక చూసి.

తండ్రి అలాఅడగడం వింత అన్పించి 'ఆ... ఏం?' అన్నాడు ఆశ్చర్యంగా.

"ఏం లేదు. నీరూని కూడా తీసుకెళ్లండి మీతో. పాపం అది ఒక్కర్తి వెళ్లలేదు. ఎంతకని ఇంట్లో ఒక్కర్తే కూచుంటుంది. మీరలా సినిమాలకి వెళ్లినపుడు దాన్ని పిలుస్తుండండి" అన్నారాయన.

రఘు మొహం అదోలా పెట్టాడు. తండ్రి ముందు ఏంఅనలేక ఊ అని ముభావంగా గదిలోకి వెళ్లిపోయాడు. గదిలోంచి దివ్య మామగారి మాటలు వినసే వింది. "ఏమిటీ... ఆవిడని మనతో సినిమాకి తీసుకెళ్లాలా" అంది తీక్షణంగా మొగుడి వంక చూసి.

రఘు చూపులు మరల్చురుని, "నాన్నగారు చెప్పాక తీసుకెళ్లకపోతే బాగుండదు. ఏమన్నా అనుకుంటారు" అని గొణిగాడు.

"అయితే ఆవిడతోనే వెళ్లండి... నేనురాను. అయినా భార్యాభర్తలిద్దరూ సరదాగా వెడ్తుంటే మధ్య ఆవిడని తీసుకెళ్లమనడానికి బుద్ధుండక్కరలేదా! అంత వయసుంది, అంతపెద్దాయనకి ఆమాత్రం తెలీదా? మనమధ్య ఆవిడెందుకు? అంతగా కావాలంటే వాళ్లే తీసుకెళ్లొచ్చుగా" అంది కోపంగా.

"ష్.. నెమ్మది. నాన్న వింటారు. బాగుండదు దివ్యా... ఈసారికి తీసుకెడదాం. మళ్లీసారి నించి అసలు మనం ఇంట్లో చెప్పొద్దు సినిమాకి వెడుతున్నట్టు. ఈ ఒక్కసారి రానిద్దూ. ఇప్పుడు వద్దంటే నాన్నగారేం అనుకుంటారో... ప్లీజ్" బతిమిలాడుతూ భార్యని శాంతపరచడానికి ప్రయత్నించాడు.

తండ్రి అన్నని పిలిచి చెప్పటం, భార్యాభర్తల మధ్య ఘర్షణ ఏమీ తెలియని నిర్మల అన్న వచ్చి 'సినిమాకి వెడుతున్నాం నీవూరా' అనగానే చిన్నపిల్లలా సంబరపడిపోయి వెంటనే ముస్తాబయి బయలుదేరిపోయింది. తీరా చేసి బయలుదేరాక వదినగారు మొహం ముడుచుకుని వుండటం, అన్న ముభావంగా వుండటం చూశాక, కారణం తెలియక చిన్నపోయింది. సినిమాహాల్లో కూడా దివ్య ఒక్కమాటా మాట్లాడలేదు. నిర్మల పలకరిస్తే తలాడించి జవాబిచ్చింది తప్ప మాట్లాడలేదు. అన్నా వదినా కూడా మాట్లాడుకోకుండా ఎడమోహం పెడమొహంగా వుండటం చూసేసరికి నిర్మలకి చాలాసేపటికిగాని తన రాక వాళ్లకి నచ్చలేదన్న విషయం తట్టలేదు. మరి అలాంటప్పుడు తనని ఎందుకు పిలిచినట్టు? ఏం అర్థంకాలేదు. ఎప్పుడూ నవ్వుతూ తుళ్లుతూ మాట్లాడుకునే ఆ ఇద్దరూ అలా కూర్చుంటే తనేదో తప్పుచేసినట్టు సిగ్గుతో చితికిపోయింది నిర్మల. ఛా... ఎందుకు వచ్చాను అని బాధపడింది. ముగ్గురూ మౌనంగా సినిమా చూసి ఇంటికి వచ్చారు. వాళ్లిద్దరూ అలా ఎందుకున్నారో గదిలో రాత్రి రఘు, దివ్యల ఘర్షణ విన్నాక నిర్మలకి అర్థం అయింది. డ్రాయింగ్ రూం లో పుస్తకాలు తీసుకుని మేడమీదకి వెడుతుంటే గదిలో తన ప్రసక్తి వినవచ్చి ఆగిపోయింది నిర్మల. "దివ్యా... ఇంకా కోపంపోలేదా? మరీ నీవు అంతలా మాట్లాడకుండా వుంటే నీరూ ఏం అనుకుందో? నాన్నగారికి తెలిస్తే బాగుండదని అన్నాను. అయినా అదేం పరాయిదా? ఎంతయినా నాచెల్లెలు. ఒకసారి సినిమాకువస్తే అంత కోపం తెచ్చుకోవాలా? మనం ఈ ఇంట్లో వున్నప్పుడు నాన్న చెప్పాక ఆయన ఎదురుగా ఏమనమంటావు? ఈసారినించి అసలు మనం సినిమాకి వెడ్తున్నట్టు ఇంట్లో చెప్పద్దన్నానుగా. ఈమాత్రందానికి అంత కోపం అయితే ఎలాగోయ్" భార్యని గదిలో బతిమిలాడుతున్నాడు రఘు.

"నాకోపం మీకేంలెక్క. మీ ముద్దుల చెల్లెలికి కోపం రాకుండా చూసుకోండి. ఆవిడగారికి ఎక్కడ కోపం వస్తుందోనని మీ నాన్నగారు, మీనాన్నగారికెక్కడ కోపం వస్తుందోనని మీరు... ఆవిడగారు మొగుణ్నొవదిలి ఏళ్లతరబడీ పుట్టింట్లో కూర్చున్నా ఆవిడగారి కింత ఇంపార్టెన్స్. అంతేలెండి కొందరి అదృష్టం - ఏంచేసినా చెల్లుతుంది. ఆవిడగారు మీకు ముద్దయితే మీరు నెత్తినెక్కించుకోండిగాని నానెత్తిన ఎక్కించాలని చూడకండి" దివ్య కోపంగా అంది.




ఆ ఇంట్లో మామగారు నిర్మలని ఎంత ముద్దుచేస్తున్నది - అపురూపంగా చూస్తున్నది, ఆ ఇంట్లో ఆమె ఏంఅడిగినా ఆయన క్షణాల మీద ఎలాజరుపుతారో ఈ నాలుగైదు నెలల నించి చూస్తున్న దివ్యకి నిర్మలంటే జెలసీ లాంటిది కల్గింది. దానికి తోడు పుట్టింట్లో నిర్మల గురించి అనుకునే చులకన మాటలు, ఇవన్నీకల్సి నిర్మల ఇంట్లో కాపురం వదులుకుని తిష్ఠవేసిందని, ఆవిడగారు జన్మంతా తమ నెత్తిమీద వుంటుందని తన సంపాదన ఏదో తినిపోతున్నట్టు అసూయ, కోపం పెంచుకుంది దివ్య. ఆ ఉక్రోషం ఇవాళ వెళ్లగక్కింది. ఆ మాటలు వినగానే నిర్మల మొహంలోకి రక్తం పొంగింది - తండ్రిచెప్పాడని కాదనలేక పిలిచాడన్నమాట అన్న. తను వారి వెంట వెళ్లడం దివ్యకి ఇష్టంలేదన్నమాట. తనెంతపూల్. అన్నపిలిచాడని ముందువెనకాతల ఆలోచించకుండా వెళ్లినందుకు శాస్తి జరిగింది. అవమానంతో, ఉక్రోషంతో ఆరాత్రి చాలాసేపు ఏడ్చింది నిర్మల.

ఆరోజునించి దివ్య నిర్మలతో అసలు మాట్లాడటం మానేసింది. ఎదుటపడితే మొహం చిట్లించేది. నిర్మలకి కూడా అదోరకం విరక్తి లాంటిది కల్గింది. కాలేజికి వెళ్లడంరావడం, తన గదిలో లైబ్రరీనుంచి తెచ్చుకున్న పుస్తకాలు చదువుకోవడం. ఎప్పుడైనా తండ్రి పలకరిస్తే మాట్లాడటం తప్ప సాధారణంగా గదివదిలి బయటికి రావడం మానుకుంది. కృష్ణ బెంగుళూరులో ఉద్యోగం రావడంతో వెళ్లిపాయాడు. మోహన్ యమ్.బి.ఏ. ఆఖరి సంవత్సరం చదువుతో క్షణంతీరికలేకుండా వున్నాడు. ఎవరిమట్టుకు వారు వారిపనులతో బిజీ... తనొక్కత్తే ఏ పనిపాటు, ఏ బాధ్యతలు లేకుండా ఎవరికి అక్కరలేనిదన్నభావం నిర్మలలో రోజురోజుకీ బలపడసాగింది. దాంతో మరీ మూడీగా తయారైంది. ఎవరి సమస్యలతోనూ ప్రమేయంలేనట్టు రోజులు మాత్రం దొర్లిపోసాగాయి.

అలాంటి స్తబ్దవాతావరణంలో ఆ ఇంట్లో చిన్నారి అనిల్ రాకతో ఏదోపోయిన చైతన్యం తిరిగి వెల్లివిరిసినట్లయింది. దివ్య పురుడు పోసుకుని మూడోనెలలో బాబుని ఎత్తుకుని రాగానే బొద్దుగా తెల్లగా ముద్దొస్తున్న మనవడిని చూడగానే వ్యధ, చింత, ఆందోళన, కొడుకుకో

డలువట్ల విముఖత అన్నీపోయి ఒక్కసారిగా శివశంకరంగారు నూతనోత్సాహంతో శక్తిపుంజుకున్నట్టు అయ్యారు. రోజంతా ఇంట్లో వున్నంతసేపు మనవడితోనే గడపసాగారు ఆయన. శారదాంబ సరేసరి. వాడి ఆలనాపాలనా అంతా ఆవిడే చూసుకునేది. నిర్మలకీ బాబుని చూడగానే ఏదో మమతానురాగాలు పుట్టాయి. అన్న వదినలతో ఎలావున్నా బాబుని చూడగానే మాత్రం అన్నీమరిచిపోయి వాడిని అపురూపంగా ఎత్తుకునేది. వెధవ ఎంత ముద్దుగా వున్నాడు అనుకునేది మెత్తటి బుగ్గలు పుణుకుతూ. వాడి బోసినవ్వులుచూసి, వాడి ఊంగాలు వింటూ, వాడితో సరిగా పలుకుతూ సమయం మర్చిపోయేది. వాణ్ని ఎత్తుకున్నప్పుడల్లా అప్రయత్నంగానే తనకీ ఓ బాబువుంటే తన జీవితం ఇంత డల్‌గావుండేది కాదు. వాడి ఆటపాటలతో, ముద్దుమురిపాలతో టైము గడిచేదేమో అని అనుకున్నప్పుడల్లా, అప్పుడు ఆ పిండాన్ని వదుల్చుకోవాలని తనెంత ఆరాటపడిందో గుర్తువచ్చి గుండెల్లో ముల్లుగుచ్చుకున్న అనుభూతి కలిగేది. తను తొందరపడింది... అలా చెయ్యకపోవలసింది - చెయ్యకుండా వుండివుంటే ఈరోజు తన బతుక్కి ఓ అర్థం, ఓ ఆలంబనవుండేది అనుకుని నిట్టూర్చేది. బాబుకి తల్లి స్నానంచేయిస్తే పౌడరు వేయడం, బట్టలు తొడగడం, వాడిని ఆడించడం అన్నీ నిర్మలే చూసేది. దివ్యకి పిల్లవాడి బాధ్యత అత్తగారు, నిర్మల తీసుకోవడం తన సినిమాలకి, షికార్లకి ఆటంకంలేకపోవడంతో బాగానేవుందనిపించింది. నిర్మల బాబుతోడిదే లోకం అన్నట్టు గడపడం చూసిన శివశంకరంగారు బాధపడేవారు. దానికి పిల్లపాపవుంటే ఇలా పిల్లలకోసం మొహం వాచినట్లుండేదా - ఎంతయినా స్త్రీకి మాతృత్వంమీద మమకారం వుంటుందంటారు. ఆ అవకాశం ఇంక నిర్మలకి రాదేమో అనుకుంటే ఆయన గుండెలు బరువెక్కేశాయి. శారదాంబ కూతురినిచూసి నిట్టూర్చేది. 'మోడులా మిగిలిపోయింది ఓ అచ్చట ముచ్చట లేకుండా' అని లోలోన కుమిలిపోయేది.

అయితే ఆమాత్రం తృప్తి, ఆనందంకూడా నిర్మలకి ఎంతోకాలం దక్కలేదు. దివ్య హఠాత్తుగా మారిపోయింది. నిర్మల బాబుని ఎత్తుకుంటే మొహం చిట్లించి "బాబుకి పాలుపట్టాలి" అంటూ లాక్కునేది. పౌడరువేస్తుంటే -- "నేను.వేస్తాను, ఇలా ఇవ్వు" అని గుంజుకున్నట్టు బాబుని తీసుకుపోయేది. ఏదన్నా చెయ్యబోతుంటే, "అక్కరలేదు నీవువెళ్ళు నేను చేసుకోగలను" అనేది కఠినంగా. బాబుని నిర్మలదగ్గరకి వెళ్ళకుండా చెయ్యడానికి గదిలోకి తీసుకెళ్ళిపోవడం మొదలుపెట్టింది. హఠాత్తుగా దివ్య ఎందుకిలా మారిపోయిందో తెలియక అలవాటయిన బాబు దూరమవగానే తల్లడిల్లిపోయింది నిర్మల. ఆరునెలలుగా వాడి ఆలనాపాలనా చూస్తూ, కన్నతల్లిలా సాకిన నిర్మల చేతులుఖాళీ అయిపోయి పిచ్చెక్కినట్లుండేది. అత్తని గుర్తుపట్టి బోసినవ్వులునవ్వే బాబుని చూసి ఆరాటంగా చేతులుచాపేది. దివ్య అది చూడనట్లు బాబుని తీసుకుని మేడ ఎక్కిపోతూంటే గిలగిలలాడిపోయేది నిర్మల. శారదాంబ కోడలి వ్యవహారంచూసి అర్థంకాక, ఆవిడా నొచ్చుకునేది నిర్మలమొహంచూసి. కాని కోడలిని ఏమంటే ఏం తంటానోనని ఎలా అడగడంఅని ఆవిడ ఆలోచించేది. బిక్కమొహంవేసుకుని తిరిగే కూతుర్నిచూసి ఆవిడ గుండె ద్రవించేది.

ఒకరోజు బాబు గదిలోఏడుస్తున్నాడు. నిద్రపోతున్న దివ్య బాబుని కసిరి పిర్రమీద ఒకటి అంటించింది. బాబు గుక్కపట్టాడు. పక్కగదినుంచి వింటున్న నిర్మల ఇంక ఆగలేక చప్పున గదిలోకివచ్చి బాబునిఎత్తుకుని గదిలోంచి బయటికితీసుకొచ్చి ఆడించసాగింది. దివ్య నిద్రమత్తులోవుండి వూరుకుంది. నిద్రపోయి గంటతరువాత సావకాశంగా దిగివచ్చింది. బాబుని ఆడిస్తూ నవ్వుతున్న నిర్మలని చూసేసరికి తిక్కరేగినట్టు చటుక్కునవచ్చి "బాబుని నిన్నెవడు తీసుకురమ్మన్నాడు" అంది కసిరినట్టు.

"వాడు ఏడుస్తున్నాడు. నీవు నిద్రపోతున్నావని" చిన్నపిల్లలా భయపడ్తూ సంజాయిషీ ఇచ్చింది నిర్మల.

"ఏడుస్తున్నాడనరే నీవెప్పుడూ ఎత్తుకోకు వాడిని, నీకిదే చెప్తున్నా" అంది కఠినంగా.

శారదాంబ వింటూ వూరుకోలేకపోయింది




"దివ్యా ఏమిటామాటలు? అదేం చేసింది? ఏడుస్తున్నపిల్లాడిని ఎత్తుకోవడం తప్పా? అయినా ఇంట్లోవున్నాక, పిల్లాడు ఏడిస్తే ఎలా వూరుకుంటారు. ఇంతకీ అదెందుకు ఎత్తుకో కూడదువాడిని. నెలరోజులనుంచి చూస్తున్నా ను దాన్ని వాడిదగ్గరకు రానీయడంలేదు. ఆరునెలలు నీకొడుకు ఉచ్చలు, పీతుళ్లుఎత్తి నీవు సినిమాలు, షికార్లు తిరుగుతుంటే అత్తకా బట్టి వాడిని సాకింది. ఇన్నాళ్లూ పనికొచ్చిందా అది? ఇప్పుడు ఏంవచ్చింది నీకు." తీక్ష ణంగానే అడిగింది శారదాంబ-ఈసారిమాత్రం నల్లబడిన కూతురిమొహం చూస్తుంటే ఆవిడ కడుపులో దేవినట్లయి మొదటిసారిగా నిర్మల తరపున మాట్లాడి కోడలిని నిలేసింది.

అత్తగారు ఎప్పుడూ అలాకోపంగా మాట్లాడ టంచూడని దివ్య ఒక్కక్షణం బెదిరింది. అయినా అందరిముందు ఓడిపోవడం ఇష్టంలేనట్టు సూటిగా అత్తగారివంక చూ సింది.

"నలుగురుపిల్లల్ని కన్న మీకు తెలియదా నేను ఎందుకు ఎత్తుకోనీయడంలేదో." సవాల్ చేసినట్లడిగింది.

శారదాంబ అర్థంకాక తెల్లపోయింది.

"ఎందుకు ఏమయింది?"

"మా అమ్మచెప్పింది... గొడ్రాలిచేతిలో బిడ్డ దక్కదని. గొడ్రాలికళ్ళుపడితే నల్లరాయన్నా పగిలిపోతుందిట. పిల్లపాపలేనివాళ్ల దిష్టి బాబుకి తగులుతుందిట" అంది ఆరిందాలా.

శారదాంబ తెల్లపోయింది. నిర్మలమొహం గుర్తుపట్టలేనట్టు నల్లబడిపోయింది. అలా అచేతనంగా చేష్టలుడిగినదానిలా చూస్తూ వుండిపోయింది. శారదాంబ మాతృహృదయం కూతురికిజరిగిన అవమానానికి తట్టుకోలేకపో యింది "ఏమిటి... నాకూతురు గొడ్రాలా? దాని కళ్లుపడితే నీబిడ్డ దక్కడని మీఅమ్మ చె ప్పిందా నాకూతురు గొడ్రాలుకాదే- దానికర్మ కాలి దానికాపురం ఇలా తగలబడి- పిల్లలికి మొహంవాచినట్టు నీ కొడుకుని అపురూపంగా కన్నతల్లికంటే ఎక్కువగా చూస్తుందే. నీలా అదీ కాపురంచేసుంటే నల్గురినికనేది ఈపాటి కి. దాని అదృష్టం ఇలా తగలబడి కడుపునప డిన బిడ్డని దక్కించుకోలేక నీ పిల్లలకోసం దేవుళ్లాడే స్థితికవచ్చిందే. పిల్లల్నికన్న మీ అమ్మ ఇంకోఆడదానిగురించి ఇలా మాట్లాడు తుందా? ఆవిడ చెప్పినా నీవు చదువులు వెలగబెట్టినదానివి, అన్నింట్లోనూ అంత మోడర్న్‌గావుంటావు- ఈ విషయంలో అమ్మ మాటలునమ్మి ఆడబిడ్డని అయినా ఆలోచించ కుండా ఇలా అంటావా? జాగ్రత్త దాన్నొక మాటఅంటే నేనూరుకోను. వెళ్లు... నీకొడుకుని ఎవరికంటా పడకుండా మేడమీదదాచుకో. వె ళ్లు. ఫో, తీసుకుఫో! నిర్మలా... పాపిష్టిదానా నీకెంత ఖర్మపట్టిందో చూశావా. ఈదేశంలో మొగుణ్నివదిలినదాని గతింతేనే. నీకర్మ. అందరిచేత మాటలుపడు. అందరిచేత ఉమ్మేయించుకో. ఈసారి వాణ్ని ముట్టుకో నీచే తులు విరగ్గొడ్తాను."

శారదాంబ పూనకంవచ్చినదానిలా ఎన్నడూ చూడని వీరావేశంతో అరిచి కిందకూలబడి ఏడవసాగింది. నిర్మల పిచ్చిదానిలా నిలువుగు డ్లు పెట్టుకుని చూస్తూవుండిపోయింది. మధ్యా హ్నం నిద్రపోతున్న శివశంకరంగారు, మేడ మీద గదిలోంచి రఘు ఈ కేకలకి, గలభాకి అక్కడికి వచ్చారు. నిర్మలలాగే ఆయనా చేష్ట లుడిగి నిల్చుండిపోయారు. రఘు తప్పుచేసిన వాడిలా తలదించుకుని ఎవరికీ మొహంచూప లేనట్టు మళ్ళీ మేడమీదకి వెళ్లిపోయాడు.

కాసేపటికి శివశంకరంగారు తేరుకుని స్థాణువులా నిలబడ్డ నిర్మల భుజంచుట్టూ చేయివేసి లాలింపుగా "పదమ్మా..నీ గదిలోకి వెళ్ళి కాసేపు పడుకో..పద..." అన్నారు ఏంజర గనట్టు. తండ్రి తీసుకెడ్తుంటే బుద్ధిమంతురా లిలా ఆయనతో నడిచింది.

'ఏడుస్తుంది. గుండెలుపగిలేలా దుఃఖి స్తుంది... కూతురు'అని అనుకున్న ఆయనకి నిర్మల ఏభావం వ్యక్తపరచకుండా అలా కా మ్గా వుండిపోవడం ఆశ్చర్యం కలిగించింది. నిర్మలమనసు మొద్దుబారేటంత గట్టిదెబ్బ తగి లిందని ఆయన ఊహించలేకపోయారు. గది లోకివెళ్లాక శివశంకరంగారు కూతురి భు జంచుట్టూ చెయ్యివేసి దగ్గరకు లాక్కుని -- "మూర్ఖులనే మాటలు పట్టించుకోకూడదమ్మా- ఏం చెప్పినా పదిన పరాయింటిదేగదా, నీమీద



అభిమానం ఎక్కడనించి వస్తుంది. ఆ మాటలు వినివిననట్టు వదిలేయాలి మనం. నీవు ఏంబాధపడనని ప్రామిస్‌చెయ్యి నాకు-'' అన్నారు చెయ్యిచాచి

నిర్మల అదోలా నవ్వింది. ''బాధ... బాధెందుకు డాడీ. బాబుమీద నాదృష్టి పడితే వాడికేదన్నా జరిగితే? వదినమాటలు నిజమేనేమో! ఏంకాకపోతే వూరికే ఎందుకంటారు అందరూ- బాబుకి ఏం అవకూడదు. నేను ఎత్తుకోనులే డాడీ'' అంది.

శివశంకరంగారి గుండెలు ద్రవించాయి. చంటివాడితో ఆటలాడుతూ కాస్త దిగులుమర్చిపోయిన కూతురికి ఆ మాత్రం ఆనందంకూడా దక్కనీయకుండాచేసిన కోడలిని ఆరోజునుంచి ఆయన క్షమించలేకపోయారు. ఆ క్షణానవెళ్లి ఎడాపెడా వాయించి, ఇంట్లోంచి తరిమివెయ్యాలి వాళ్లని అన్నంత ఆవేశంవచ్చింది. కాని కన్నకొడుకు, రక్తం పంచుకుపుట్టిన మనవడు ఓపక్క, కూతురు ఓపక్క -- ఎవరిని కాదనుకునేటట్టు.. తెంచుకుందామన్నా రక్తపాశం తెంచుకోనిస్తుందా? ఆయన భారంగా అడుగులువేస్తూ గదిలోంచి బయటికి నడిచారు ఇంకేంఅనాలో తెలియక.

తండ్రి వెళ్ళాక తలుపులోపల్నించి గడియపెట్టుకుని మంచంమీద వాలింది నిర్మల. ఏమిటో, ఏడవాలన్నా కన్నీళ్లు ఇంకిపోయినట్టు ఏడుపురాలేదు. అదోరకం షాక్‌తగిలినదానిలా నిర్లిప్తంగా అలా కళ్లుమూసుకు పడుకుండిపోయింది నిర్మల.

గదిలోకివెళ్ళాక మొదటిసారిగా రఘుకి భార్యమీద కోపంవచ్చింది. ''దివ్యా... నీవు మాట్లాడేముందు కాస్త వెనకముందు చూడవేం? నీరూని ఎందుకలా అన్నావు? అదెంత బాధపడుతుందో, అమ్మానాన్న ఏంఅనుకుంటారోనన్నదేనా లేదానీకు'' గట్టిగా అన్నాడు.

దివ్యకూడా అనేశాక నిర్మలమొహంచూసి, అత్తగారి మాటలకి మామగారు ఏంఅనకుండా గంభీరంగా వుండిపోవడంచూసి మనసులో కాస్త బెదిరింది. ఆ మాట అనకపోవాల్సిందేమోననిపించింది. కాని ఎన్నడూ కోపగించని భర్త నిలేసేసరికి అహం అడ్డువచ్చింది. ''ఏం నేనేం కానిమాట అన్నాను..మా అమ్మావాళ్లంతా చెప్పారు. అలాంటివాళ్ల కళ్లుపడితే పిల్లాడు పాడయిపోతాడని ఎత్తుకోనీయొద్దని చెప్పారు. మీ చెల్లెలుకంటే నాకు నా పిల్లాడు ఎక్కువ'' అంది మొండిగా.

''దివ్యా... అది బాబుని నీకంటే ఎక్కువగా చూసేది. కన్నతల్లిలా అసహ్యించుకోకుండా వాడి దొడ్లు, ఉచ్చలు కూడా కడిగి ఎంత ముద్దుగా చూసేది. దాన్ని అలా అనడానికి నోరెలావచ్చింది. స్టుపిడ్‌గా ఈ మాటలన్నీ నమ్ముతావా నీవూనూ. పాపం దానిమొహంచూస్తే నాకెంతబాధ అన్పించిందో-వాడిమీదే ప్రాణాలు పెట్టుకున్నట్లుండేది. వాడికోసం ఎన్ని బట్టలు, బొమ్మలుకొంది. నీవు హాయిగా నిద్రపోతుంటే, సినిమాలు, షికార్లుతిరుగుతూంటే ఆయాలా నీ కొడుకుని ఎత్తుకుని మోసింది- దాన్నిలా అనడం...'' బాధగా అన్నాడు.

''ఆ... ఆవిడగారు బట్టలు, బొమ్మలు కోనీయకపోతే మనబాబుకి మనం కొనుక్కోలేమా? ఇంట్లోవుండి పనిపాటలేక బాబుని ఎత్తుకునేది కాలక్షేపానికి. దానికోసం పెద్ద పొగుడుతున్నారు ఆవిడని...'' కోపంగా అంది.

''దివ్యా..అమ్మానాన్నల మొహంచూడు. అందులో అమ్మ ఒక్కరోజయినా నిన్ను ఏమన్నా అందా. నీరూ వచ్చి ఇన్నాళ్లయినా దాన్ని ఏనాడూ సైడ్‌చేయనిది ఈరోజు ఇంత బాధపడి అలా అందంటే నీవు ఎంతమాటన్నావో, అది వాళ్లకి ఎంత కష్టంకలిగించిందో ఊహించు. నీవు ఒకసారి నీరూకి క్షమాపణచెప్పాలి. సారీ చెప్పేసిరా. వెళ్ళు.'' అన్నాడు.

భర్త అలా అనకపోతే క్షమాపణ కోరకపోయినా ఏదో మాటల్లో అన్నట్టు సారీ అనేదేమో నిర్మలతో- కాని తనతప్పు ఎత్తిచూపి తలవంచమనేసరికి ఎక్కడలేని పౌరుషం వచ్చింది దివ్యకి. ఇంట్లో ఆడింది ఆటగా, గారాబంగా పెరిగిందేమో ఇంకొకరిముందు తలవంచటం అలవాటులేని దివ్యకి అవమానం అన్పించింది.

''నేనేం చెప్పను... నాకు నా పిల్లాడికంటే మీ చెల్లెలు ఎక్కువకాదు. నా బాబుని ముట్టుకోనీను మీరేంచెప్పినా సరే. పైగా క్షమాపణ చెప్పా





# ఎదురు చూసిన ఆ క్షణం



వసుమతీ! రేపు నిన్ను, పిల్లల్ని చూడ
టానికి వస్తున్నాను, క్షమిస్తావన్న నమ్మకం
తోనే. కలిసాక అన్ని సంగతులు చెబుతాను
ప్రేమతో?...
— శివ

ఎన్నో సంవత్సరాల తరవాత ఆమెకు భర్త రాసిన ఉత్తరం అది.

ఉత్తరం వచ్చిన ఆనందం, తరవాత ఏం జరగబోతోందో అన్న సందేహం ఆమెను ఒకచోట నిలవనియ్యటంలేదు.

భర్త వచ్చే టైము సమీపించడంతో తలుపు తీసిన ఆమె ఎదురుగా నిలబడిన భర్తనుచూసి అవాక్కయింది. కారణం...?

హృదయపు లోతులను స్పృశించే తమిళకథ 'నిరీక్షణ' జూలై 'విపుల'లో చదవండి.



## మరెన్నో ఇతర భాషా కథలతో...

జూలై సంచిక **విపుల** రెండున్నర రూపాయలే

లట, చచ్చినా చెప్పను-'' అంది తెగేసినట్టు.

రఘు మొహంలో రక్తం పొంగింది. విసురుగా ఏదో అనబోయేలోగా ''నాయనా... దానిగురించి మీరేం దెబ్బలాడుకోనక్కరలేదు. మీరంతా దాని ఖర్మానికి దాన్ని వదిలి హాయిగా వుండండి. మీకు చేతులెత్తి నమస్కరిస్తాను. దానిజోలికి ఎవరూ వెళ్లకండి. దాన్నలా వదిలేయండి-'' శారదాంబ ఏడుస్తూ అని వెళ్లిపోయింది. రఘు తలదించుకున్నాడు.

ఆరోజు ఇంట్లో ఎవరికి తిళ్లు తిప్పలు లేవు. నిర్మల మూసిన గదిలోంచి ఆరోజల్లా బయటికి రాలేదు. బాబురాకతో ఆ ఇంట్లో వచ్చిన చైతన్యం ఆ సంఘటనతో హరించిపోయి, పూర్వపు స్తబ్దత అలుముకుంది ఇంట్లో.

మర్నాడు ఉదయం ఏంజరగనట్టే నిర్మల గదిలోంచి తయారైవచ్చి భోంచేసి కాలేజీకి వెళ్లిపోయింది. నిర్మల ఏం అనకపోయినా ఆమె అంతరంగమధనం గుర్తించింది శివ శంకరంగారు, శారదాంబే.

ఆరోజునుంచి నిర్మల బాబువంక చూడ్డంకూడా మానుకుంది. ఆరునెలలుగా కన్నతల్లికంటే ఎక్కువగాసాకి, ఆప్యాయత, అనుబంధం పెంచుకున్న కూతురు ఒక్కసారిగా ఆ బంధాన్ని తెంచుకోడానికి ఎంత కష్టపడుతుందో, ఆమె మనసులో చెలరేగే తుఫానుని అర్థంచేసుకుని నిస్సహాయంగా నిట్టూర్చడం మినహా ఏం చెయ్యలేకపోయారు ఇద్దరూ. ఇంట్లో వాతావరణంచూసి రఘు నొచ్చుకుంటూ ఓరోజు బాబుని తీసుకొచ్చి నిర్మలకి అందించబోయాడు. ''నీరూ... నీవెత్తుకోవడం మానేశావని బాబు బెంగపెట్టుకున్నాడు. చూడు... నీకోసం ఎలా దిక్కులు వెతుకుతున్నాడో-''

'నిజంగానే తొమ్మిదినెలల బాబు నిర్మలని చూసి నవ్వుతూ చేతులందించాడు. ''తీసుకో నీరూ... దివ్య మాటలని పట్టించుకోకు. తనకి ఇలాంటి సెంటిమెంట్స్‌లేవు. వాళ్లమ్మ ఏదో అన్నారని తనూ తెలివితక్కువగా అనేసింది. ప్లీజ్... మామూలుగా వాణ్నిచూడు నీరూ'' అన్నాడు రఘు నొచ్చుకుంటూ

నిర్మల అదోలా నవ్వింది. ''వద్దన్నయ్యా- మళ్లీ ఎందుకు అనవసరంగా నాకీ బంధం తగిలిస్తావు. ఈ వారంరోజులుగా వీడికి దూరంగా వుండటానికి నేనెంత కష్టపడుతున్నానో తెలుసా ? ఇప్పుడిప్పుడే అలవాటు అవుతోంది. అనవసరంగా ఇంకొకరి పిల్లలమీద ఆశపెట్టుకుంటే ఏనాటికన్నా ఆశాభంగం తప్పదు- వద్దు... వాణ్ని నాకు చూపించకు. తీసుకెళ్లిపో. వాడి ముద్దుమొహం చూస్తే నేను కంట్రోలు చేసుకోలేను''. గాద్గదికంగా అంటుంటే కళ్లనీళ్లు చిమ్మాయి.

రఘు మనసు ద్రవించింది. ''నీరూ..వీణ్ని ఇదివరకులాగా నీవెత్తుకోకపోతే నామీద ఒట్టే, దివ్య తరఫున నేను క్షమాపణ చెప్పుకున్నాను'' అంటూ బాబుని నిర్మల చేతిలో బలవంతంగా పెట్టి- మొహం తిప్పుకుని వెళ్లిపోయాడు.

బాబుని ఎత్తుకుని నిస్సహాయంగా చూస్తూ కాసేపు నిలబడిపోయి, తరువాత గదిలోకివెళ్ళి బాబుని గుండెలకి హత్తుకుని వారంరోజులుగా బిగపట్టిన బాధని కరువుతీరా ఏడ్చి కరిగించుకుంది.

దివ్య, భర్తే తీసుకెళ్లి ఆడపడుచుచేతిలో పిల్లాణ్నిపెట్టాక ఏం అనలేక వూరుకుంది. ఆమెకీ మనసులో ఏమూలో పశ్చాత్తాపంలాంటిది కలిగి 'ఛ... ఈ కాలంలోనూ ఇలాంటి పిచ్చినమ్మకాలేమిటి స్టుపిడ్‌గా, అనుకొని సర్దుకుని వూరుకుంది.

మనుమలమధ్య భేదాభిప్రాయాలు సర్దుకున్నా తరువాత పదిహేనురోజులకే బాబుకి మూసిన కన్ను తెరవనంత జ్వరం వచ్చింది. ముందు ఒకటి రెండు రోజులు ఏ అజీర్ణమో ఏదో అనుకున్నారంతా. మూడోరోజున నూటనాలుగు డిగ్రీల జ్వరం ముంచుకొచ్చేసరికి అంతా గాభరాపడిపోయారు. డాక్టరు వచ్చాడు, మందులిచ్చాడు. తగ్గుమొహం పట్టలేదు. మందులు మార్చారు. గుణం కనపడలేదు. ఐదు రోజులుగా కన్ను తెరవకుండా వళ్ళెరగకుండా పడుకున్న బాబుని చూస్తుంటే అందరూ . బెంబేలుపడిపోయారు. నిర్మలయితే రాత్రింబవళ్ళు వాడిపక్కనే అంటిపెట్టుకుని వుండిపోయింది.

''ఏమిటో ఈ జ్వరం అంతుపట్టడంలేదు.'' అంటూ డాక్టరు గాభరాపడ్డాడు. ఇంకా ఏవేవో




టస్టులు చేయించాలని మర్నాడు స్పెషలిస్టు లని రప్పించాలని అనుకుంటూండగానే, రాత్రికిరాత్రి బలవంతంగా పట్టిన కాసిన పాలు కక్కుకొని అలాగే బిగుసుకుపోయాడు బాబు. బాబు ఇకలేడన్న నిజం మరో ఐదు నిమిషాలకి గాని ఎవరికీ తట్టలేదు. నిర్మల వెర్రిదానిలా అలా గుడ్లప్పగించి చూస్తూ వుండిపోయింది. శివశంకరంగారు బాబు మంచం పక్కన కుర్చీలో కూలబడి మొహం కప్పుకున్నారు. శారదాంబ ముద్దుల మనవడి అచేతన శరీరా న్ని తీసుకుని గోలగోలున ఏడ్చింది. రఘు ఇంకా నమ్మలేనట్టు నోటమాటరాక చూస్తుండి పోయాడు. దివ్య అయితే ఐదు నిమిషాలు అలా తెల్లపోయినట్టు వుండిపోయి తరువాత ఏం తోచిందో శివంగిలాలేచి నిర్మలమీద విరు చుకు పడింది.

''చూశారా... నేచెపితే నామాట నమ్మలేదు. ఈవిడ కళ్ళుపడే, దిష్టితగిలి బంతిలాంటి నాబాబు పోయాడు. మా అమ్మ చెప్పింది నిజమే అయింది. చూశారా... మీరంతా నన్ను తిట్టారు. ఇప్పుడు చెప్పండి. ఇప్పుడు అంతా వచ్చి నా బాబుని తెచ్చివ్వండి. రాక్షసీ... నీవే నాబాబుని చంపావు. నీవల్లే వాడు చచ్చిపో యాడు'' అంటూ నిర్మల మీదకివెళ్ళి జుట్టుప ట్టుకొంది.

''నీవు శనివి, శనిగ్రహానివి. ఈ ఇంటికి పట్టిన దరిద్రానివి. మేం సుఖంగావుంటే చూడ లేవు. అందుకే కళ్ళల్లో నిప్పులు పోసుకొని నా బాబుని పొట్టని పెట్టుకున్నావు. వాణ్ణి ముద్దు చేసినట్టేచేసి వాడినేదోచేసి చంపావు. మీరంతా కల్సి నా బాబుని దానికి అప్పగించి దానిచేత చంపించారు. నా బాబుని తెండి... ఎలా తెస్తారోతెండి'' దివ్య పూనకం వచ్చినదానిలా వూగిపోతూ అరిచింది.

నిర్మల బిక్కచచ్చిపోయింది. శివశంకరంగా రు తేరుకొని లేచి దివ్య చేతిలోంచి నిర్మల జుత్తు వదిలించి- ''దివ్యా... నీకేం మతిపో యిందా! బాబుని అదెందుకు చంపుతుంది. బాబంటే దానికి ప్రాణం. ఏమిటా మతిలేని మాటలు. బాబు అంటే అందరికీ ప్రాణమే. మేం కావాలని వాణ్ణి చంపుతామా? రఘూ... దివ్యని లోపలికి తీసుకెళ్ళు. జాగ్రత్త! ఇవతలికి రానీయకు కాసేపు. దుఃఖంతో ఏం చేస్తున్నదీ ఆమెకి తెలియడంలేదు'' అన్నారు.

''ఊహు-నేవెళ్ళను. దీన్ని చంపిగాని వెళ్ళ ను. నా బాబునితెచ్చి ఇస్తేగాని వదలను'' అంటూ మళ్ళీ నిర్మలమీదకి వెళ్ళింది దివ్య.

రఘు బలవంతంగా దివ్యని పట్టుకున్నా డు. శివశంకరంగారు పిచ్చిదానిలా చూస్తున్న నిర్మలని ''నీరూ... నీవు గదిలోకి వెళ్ళిపో'' అని అన్నారు. నిర్మల కలలో మాదిరిలేచి నడి చింది.

''అయిందా... మీ అందరి కళ్ళు ఇప్పుడు చల్లబడ్డాయా. అందరూ కల్సి ఆవిడికి నా బాబుని అప్పగించి చంపించారు. [illegible] హాయిగా వుండండి. నేను చచ్చినా ఇంక మీ మొహాలు చూడను'' అంటూ ఏడుస్తున్న దివ్యని లాక్కెళ్ళినట్టే గదిలోకి తీసుకెళ్ళాడు రఘు.

కబురుతెలిసి దివ్య పుట్టింటివాళ్ళు వచ్చా రు. ''అమ్మా... నీవు చెపితే వినలేదు...'' అంటూ మరింత ఏడ్చింది దివ్య.

బాబు చచ్చిపోయిన దుఃఖానికితోడు కూతు రు గురయిన అపనిందకి, కోడలు, వియ్యాల వారి మాటలతో శివశంకరంగారు, శారదాంబ మరింత దుఃఖపడ్డారు. నిర్మలయితే రెండు రోజులవరకు గదిలోంచి రాలేదు. తల్లి కాఫీ తెచ్చినా, ఫలహారం తెచ్చినా ముట్టుకోలేదు.

''అమ్మా... నేనే చంపానా బాబుని'' అనేది వెర్రిదానిలోచూస్తూ... ''డాడీ... బాబు నిజంగా అందుకే చచ్చిపోయాడా'' అంటూ [illegible] కళ్ళతో, శూన్యంలోకి చూస్తున్నట్టు చూ[illegible]

కూతురి వాలకానికి వాళ్ళు మరింత [illegible] పడ్డారు. ఎంతచెప్పినా రెండురోజులు [illegible] మంచినీళ్ళు ముట్టలేదు నిర్మల.

మూడోరోజు నిర్మల గదిలోంచి ఏదో [illegible] చప్పుడయి శివశంకరంగారు ఏదో అను[illegible] నంతోచి పరిగెత్తివెళ్ళి కిటికీలోంచి చూశారు. నిర్మలపైన వేలాడుతున్న ఫేనుకి [illegible] కుని అప్పుడే [illegible] శివశంకరంగారు గావుకేక పెట్టారు. [illegible] అందరూ పరిగెత్తివచ్చారు. కిటికీలోంచిచూ[illegible] రఘు చటుక్కున గుర్తువచ్చి అవతలివైపు

తలుపు తండ్రి గదిలోంచి గడియతీసి వుండటం గుర్తువచ్చి, పరిగెత్తి అటు తలుపు తీసి నిర్మల కాళ్ళుపైకెత్తి పట్టుకున్నాడు. అందరూ పరుగున గదిలో చొరపడ్డారు. అప్పటికి ముడి ఇంకా గట్టిగా బిగవలేదు. బల్లవేసుకుని తాడుకోసి నిర్మలని కిందకి తెచ్చారు. భయంతో షాక్‌తో తెలివితప్పింది. ఇంకో రెండు నిమిషాలు ఆలస్యం అయితే ఏం జరిగేదో అందరూ గుర్తించారు. కూతురింత పనిచేస్తుందని ఎదురుచూడని శివశంకరంగారికి ఇది పెద్ద షాక్. ఆ షాక్‌తో ఆయన గుండెనొప్పి తెరలావచ్చి కూలబడిపోయారు గుండెలు పట్టుకొని. నిర్మల మొహంమీద నీళ్ళు చల్లాక తెలివి వచ్చింది. డాక్టరువచ్చి ఇంజక్షనిచ్చాక కాస్త నొప్పి సర్దుకుంది శివశంకరంగారికి. మూడురోజులకిందట పసివాడి చావు. ఈ రోజు ఇలా, 'ఈ కొంపకి ఏదో శని పట్టుకుందిరా బాబూ' అంటూ కొడుకుని పట్టుకొని ఏడ్చింది శారదాంబ. "నన్నెందుకు చావనీయలేదు మీరు. నేను ఎందుకు బతకాలి, చావనయినా చావనీయరా నన్ను" అంటూ హిస్టీరియా వచ్చినదానిలా ఆ రోజంతా ఏడుస్తూనేవుంది నిర్మల.

మాట్లాడే ఓపికలేక శివశంకరంగారు అలా మౌనంగా పడుకున్నారు. ఇటు కూతురు మళ్ళీ ఏ అఘాయిత్యం చేస్తుందోనని ఒకవైపు కనిపెట్టుకుచూడ్డం, అటు భర్తకి సేవతో శారదాంబ నలిగిపోయింది. దివ్యని పిల్లాడు పోయాక పుట్టింటివారు తీసుకెళ్ళారు. అసలే మనసు బాగులేని శారదాంబ కూతురు చేసిన పనికి కోపం పట్టలేకపోయింది. "ఈ అఘాయిత్యం పనులుచేసి మమ్మల్ని ఈమాత్రం అయినా బతకనీయవా? నీవుచేసిన పనికే మీ నాన్న అలా అయ్యారు. నిజంగా ఏదన్నా జరిగితే ఆయన దక్కేవారా అసలు. నీకేదన్నా జరిగితే మీ నాన్న గుండెలు బద్దలవుతాయని తెలిసి ఇంత సాహసం చేస్తావా? నా పసుపుకుంకాలు పొట్టనపెట్టుకుంటావా?" అంటూ కూతురిమీద ఎగిరిపడింది. మర్నాడు నిర్మల కళ్ళనీళ్ళు నింపుకుని వుండిపోయింది.

శివశంకరంగారు కాస్త తేరుకున్నారు. నెమ్మదిగా కూతురు గదిలోకి వచ్చారు. "నీరూ... మళ్ళీ ఇలాంటి పని ఎప్పుడన్నాచేస్తే నా శవమే మిగులుతుంది. మళ్ళీ ఇలాంటి ప్రయత్నం ఎన్నడూ చెయ్యనని మాటివ్వకపోతే ఇప్పుడే నీ కళ్ళముందే నేను ఉరివేసుకుంటాను" అని గంభీరంగా అన్నారు శివశంకరంగారు...

"పదండి. అందరం కట్టకట్టుకుని ఉరిపోసుకుందాం. అప్పటికన్నా శని విరగడవుతుందేమో. తండ్రికితగ్గ కూతురూ... కూతురికి తగ్గతండ్రి... ఒకళ్ళకోసం ఒకరు ఉరులుపోసుకోండి. మమ్మల్ని నట్టేటముంచి వెళ్ళండి ఇద్దరూ" పిచ్చి కోపంతో అర్చింది శారదాంబ.

కూతురు దగ్గరమాట తీసుకునిగాని ఆయన ఆ గదిలోంచి వెళ్ళలేదు. బాబుపోయాక ఇల్లంతా శ్మశాన నిశ్శబ్దం అలుముకుంది. ఆ వాతావరణంలో ఎవరికివారు బతక్క తప్పదన్నట్టు భారంగా రోజులు నిశ్శబ్దంగా గడుపుతున్నారు.

★ ★ ★

ఆ ఏడాది కృష్ణ పెళ్ళి సందడితో ఆ ఇంట్లో మళ్ళీ కాస్త సందడి, సంతోషం అలుముకుంది. దివ్య మళ్ళీ నెలతప్పింది. కృష్ణది ప్రేమ వివాహం. తనతోపాటు ఇంజినీరింగు చదివిన అమ్మాయిని రిజిష్టరు మ్యారేజి చేసుకుంటానన్నాడు. వాళ్ళు కన్నడులు. బ్రాహ్మణులే. అమ్మాయి పొడుగ్గా మంచి స్మార్ట్‌గా వుంది. చదువుకున్న పిల్ల. తండ్రి మైసూరులో డి.ఎస్.పిగావున్నాడు. వాళ్ళు తెలుగువాళ్ళు కాదన్న అభ్యంతరంతప్ప, ఇంకేం అడ్డుచెప్పడానికి ఏమీ కనబడలేదు. శారదాంబ బాధవేరు. "అలవాట్లు, ఆచారాలువేరు... ఎలా కుదురుతుంది." అంటూ సణిగింది.

"ఇంకా ఈరోజుల్లో ఇవన్నీ ఏమిటమ్మా! అయినా తెలుగువచ్చు కొద్దిగా. కన్నడంవాళ్ళ అలవాట్లు మనవి బాగా కలుస్తాయమ్మా" అని వాదించాడు కృష్ణ.

భర్త దగ్గిర గొణిగింది శారదాంబ. "వూరుకో... ఇప్పుడు మనంవద్దన్నా వాడు మానడు. మన పెద్దరికం నిలుపుకోవడం మంచిది. పెళ్ళయి వాడెలాగూ ఇక్కడుండేవాడుకాడు. వాడి పాట్లేవేవాడివి. మనం ఏదోచెప్పి అడ్డు చెప్పడం ఎందుకు?" అన్నారు నిర్లిప్తంగా.




రిజిష్టర్ పెళ్ళికిమాత్రం ఒప్పుకోను అంది ఆవిడ. ''వద్దు. రిజిష్టరు పెళ్ళేమంచిదిలే... అలా అయితే మళ్ళీ మన నీరూ అందరిలో వెల్తిపడకుండా వుంటుంది. ఓ పార్టీ ఇచ్చేద్దాం ఇక్కడ సరిపోతుంది'' అన్నారాయన.

''మీకెంతసేపూ కూతురు ఆలోచనే. ఓ ముద్దుముచ్చట లేకుండా ఏంపెళ్ళి?'' అని గొణిగింది ఆవిడ.

మరో నెలలో కృష్ణ పెళ్ళి అయింది. ఊర్లో అందరికీ పార్టీ ఇచ్చారు. కోడలుచేత గృహప్రవేశం చేయించింది శారదాంబ. కొత్త దంపతులు ఇద్దరూ అక్కడ నాలుగు రోజులున్నారు. ఆ నాల్గురోజులూ లత సరదాగానేవుంది. నిర్మల గురించి కృష్ణ చెప్పాడు. లతకి నిర్మలపట్ల సానుభూతి కలిగింది. ఆమెతో సరదాగా మాట్లాడింది. అయినా నిర్మల ఏంఅంటే ఏం ప్రమాదమో, పెద్ద వదినగారిలా ఈవిడా తయారవుతుందేమో, అనవసరంగా ఎందుకు పూసుకుతిరగడం అన్నట్టు అంటీ అంటనట్టే వుండిపోయింది- లత మాట్లాడుతున్నా.

''నీరూ... మేం వెళ్ళిఅక్కడ సెటిల్అయ్యాక ఈ డిసెంబరు శలవుల్లో నీవు బెంగుళూ రురావాలి'' అన్నాడు వెళ్ళేముందు కృష్ణ. లత కూడా మరీమరీ చెప్పింది ఆప్యాయంగా చెయ్యినొక్కి.

''మీ కృష్ణ లత అదృష్టవంతులు. చక్కగా జాంతని పెళ్ళి చేసుకొని చిలకా గోరింకల్లా ఎగిరిపోయారు వేరింటి కాపురానికి'' అంది ఆ రాత్రి దివ్య రఘుతో- ''మనకే ఈ బాదరబందీలు. గోలానూ'' అంది కినుకగా.

''ఏం... నీకేం బాదరబందీలున్నాయి. హాయిగా ఏ రెస్పాన్సిబులిటీస్ లేకుండా వున్నావు ఇంట్లో. అమ్మ అన్నీ చూసుకుంటూంటే'' అన్నాడు రఘు.

''ఎంతయితేమాత్రం మనింట్లో మనంవున్న స్వేచ్ఛ ఎక్కడుంటుంది? అన్నింటికీ అత్తగారి, మామగారి ఇష్టాయిష్టాలకి లొంగివుండాలి. నాదేంవుంది ఇంట్లో. అంతా పెత్తనం మీ అమ్మగారిదే. అదే నా ఇల్లయితే నా ఇష్టంవచ్చినట్టు డెకరేట్ చేసుకుంటాను. రకరకాల వంటలు నేర్చుకునేదాన్ని. ఇక్కడ ఏం చెయ్యాలన్నా

పెద్ద ప్రోబ్లమ్. ఇక్కడుండబట్టి తరువాత మీ చెల్లెలు రెస్పాన్సిబులిటీ అదీ మనదవుతుంది. మీ అమ్మానాన్నపోయాక ఆవిడ మననెత్తినే వుండాలి. హాయిగా మీరూ ఈ 'లా'కాకుండా ఇంకేదన్నా చదివివుంటే మనమూ ఉద్యోగం పేరున ఇక్కడ్నుంచి పోయేవారం.''

అన్న వదిన నెమ్మదిగా ఏం మాట్లాడుకోవడంలేదు. మేడమీద బాల్కనీలో కూర్చున్న నిర్మలకి ఆ మాటలు వినబడ్డాయి. ఎంత పట్టించుకోకూడదనుకున్నా ఇలాంటి మాటలు వింటే మనసు చివుక్కు మంటుంది. అప్పుడే వదినగారు ఎంతదూరం ఆలోచిస్తూంది. అమ్మానాన్న తరువాత వాళ్ళనెత్తిన తన పీడ పడ్తుందని ఆలోచిస్తూంది. నిజమే తను ఆమెకి ఏం అవుతుంది. తల్లితండ్రి అంటే... కన్నారు కనుక తనని ఆదరిస్తున్నారు. రేపు వాళ్ళు లేనిరోజు... ఇన్నాళ్ళు ఆలోచనేరాని నిర్మల ఆ ఆలోచన తట్టగానే గతుక్కుమంది. నిజమే... అప్పుడు తను అన్నల దయాధర్మంమీద ఆధారపడాలా? ఎంతమాత్రంకాదు. తనకి ఉద్యోగంవుంది. తన బతుకు తను బతక్కలదు. ఇప్పుడంటే తల్లితండ్రికోసం ఇక్కడుండి ఈ అవమానాలు సహిస్తుంది. అప్పుడింక తనకి ఎవరు లెక్క. దేవుడి దయవల్ల తనకి చదువుంది... ఉద్యోగముంది. ఎవరికీ భారంకానక్కరలేదు. అయినా ఇంత ఈసడింపుగా మాట్లాడుతున్నారు. అదే చదువు, ఆర్థిక స్వాతంత్ర్యంలేని ఆడదయితే ఇంకెంత హీనమవుతుందో. అందుకేనేమో ఆడవాళ్ళు ఎన్ని బాధలుపడ్డా ఆ మొగుడుదగ్గిరే పడుంటారు అనుకుంది. ఈసారేమనన్నా అంటే వూరుకోకుండా జవాబివ్వాలి. ''వదినమ్మగారూ... నా గురించి నీకేం బాధవద్దు. నేను నీనెత్తిన కూర్చుంటానని ఇప్పటినుంచీ భయపడకు తల్లీ'' అని చెప్పాలి. ఆమె నోటికి మరీ హద్దుపద్దు లేకుండావుంది. మొగుడి సంపాదన తనేదో తినిపోతున్నట్టు ఏడుస్తోంది ఎందుకో అనుకుంది కోపంగా.

★ ★ ★

దివ్యకి ఈసారి ఆడపిల్లపుట్టింది. పురుడు పోసుకొచ్చాక నిర్మల ఈసారి కన్నెత్తికూడా పిల్లని చూడలేదు. అసలు దివ్య పిల్లని కిందకి తీసుకొచ్చేదికాదు. దగ్గిరికితీసి అనుబంధం పెంచుకుని బాధపడటం కంటె దూరంగా వుంటే ఏ ఎటాచ్‌మెంటు వుండదని నిర్మల పిల్లని వేలేసి కూడా తాకలేదు. శారదాంబా ఈసారి అంటీ ముట్టనట్టేవుంది- ఇప్పటికీ బాబుని తల్చుకుని నిర్మల బాధపడ్తూనేవుంది. వాడినవ్వులు, ఆ పాలబుగ్గలు గుర్తువచ్చి ఆమెకి తెలియకుండానే కళ్ళు చెమరుస్తాయి.

డిసెంబరు సెలవుల్లో కృష్ణ మళ్లీ రమ్మని రాశాడు ఉత్తరం. ''పోనీ వెళ్లిరా అమ్మా నాల్గురోజులు కాస్త మార్పు వుంటుంది నీకు'' అన్నారు శివశంకరంగారు. 'వద్దు' అన్నట్టు తల ఆడించింది నిర్మల. నిర్మల మనసు ఎంతవిరిగిందో, ఆమెలో విరక్తి, నిర్లిప్తత ఎంతపెరిగాయో ఆయనకి అర్థమైంది.

''దాన్నిఎందుకు అక్కడికి వెళ్లమంటారు వాళ్లది కొత్తకాపురం. ఇదెందుకు అక్కడికి దూరంగా వుంటేనయినా బంధుత్వాలు తిన్నగా వుంటాయేమో- అక్కడికి వెళ్లి వాళ్లని చూసి ఇది బాధపడడమేగా జరిగేది'' అంది రాత్రి శారదాంబ. శివశంకరంగారు మౌనంగా వూరుకున్నారు.

రోజురోజుకి నిర్మలని చూస్తుంటే ఆయన కడుపులో దేవసాగింది. ఎలాగైనా కూతురికి పెళ్లిచెయ్యాలన్న కోరిక ఆయనలో పోలేదు. రాత్రింబవళ్లు అదే ఆలోచన ఆయనకి- అల్లుడిని ఎలా లొంగదీసుకోవాలా అన్న ఆలోచనే అనుక్షణమూ ఆయన్ని దొలుస్తూంది. మరోసారి ఉత్తరం రాస్తే- లేదంటే ఏ పెద్దలనన్నా పంపితే అన్పించింది... పోనీ డబ్బాశ చూపితే లొంగుతాడేమో! ఏ లక్షోరెండులక్షలో ఇస్తానంటే కాగితం రాసి ఇస్తాడేమోనన్న ఆలోచన వచ్చింది. ఆ ప్రయత్నం చేసిచూడాలనుకున్నారు. లాయరుగా ''తన క్లయింట్ పునర్వివాహం చేసుకోదలచింది అని దానికి అంగీకారం కోరుతూ, లక్షరూపాయలు ఇవ్వడానికి సిద్ధంగావుంది, మీ అంగీకారం, ఖరీదు తెలపగలరు?'' అని రాసి పడేశారు- రాసిన మర్నాటినించి జవాబుకోసం చూడసాగారు.

సంక్రాంతి సెలవులకి కృష్ణ, లత వారంరోజులు సెలవుపెట్టి వచ్చారు. ఇల్లంతా కాస్త





నందడిగా వుంది- లత నిర్మలతో చనువుగా మాట్లాడుతూంటే దివ్యకి చాలా ఉక్రోషంగా వుంది. 'ఏడాదికి నాల్గురోజులు వచ్చిపోతారు కనక పెద్ద అభిమానాలు వలకపోస్తుంది. ఆడ పడుచు అంటే అభిమానం అన్నట్టు. రోజూ వుంటే తెలిసేది. తనూ వేరేవుంటే చూ పించేది అభిమానాలు. అసూయగా అను కుంది. అనుకున్నది మనసులో దాచుకోలేక వాళ్లిద్దరి స్నేహం చూడలేక అసూయ ఒకరోజు బయటికే వెళ్లగక్కింది. "నీకేమమ్మా అదృష్ట వంతురాలివి, హాయిగా బెంగుళూరులో వుంటారు. మీఇల్లు, మీకాపురం అంటూ నీకుంది-" అంది హాస్యంగా అన్నట్టు-

"నీకేంలోటు అక్కయ్యా. చక్కగా ఏ బాదర బందీ లేవు. అన్నీ చూసుకోడానికి అత్తగారు న్నారు. మావగారున్నారు- మీ ఇద్దరూ ఫ్రీ బర్డ్స్‌లా తిరగచ్చు. మాకు అక్కడ అన్నింటికీ ఇబ్బందే. ఇద్దరం చచ్చిచెడి ఉద్యోగాలు చేస్తు న్నా ఇంత పెద్దఇల్లు, ఇంతదర్జా మాకు అక్క డెక్కడుంది. ఇంటికొచ్చి అన్నిపనులూ చేసుకో వాలి. హాయిగా ఇంట్లోచూడటానికి ఎవరన్నా పెద్దవాళ్లుంటే ఎంతబాగుండును అన్పి స్తుంది. ఇంట్లో పెద్ద దిక్కుంటే ఎంతహాయిగా వుంటుంది- నిజం చెప్పాలంటే పిల్లల్ని కనా లంటే భయంగా వుంది- ఇద్దరం ఉద్యోగం చేస్తూ- పిల్లల్ని కంటే ఎవరుచూస్తారు అన్నది మా ప్రాబ్లం- నీకేం? ఇంట్లో అత్తయ్య, నిర్మల వున్నారు నీవెక్కడికన్నా వెళ్లినా పిల్లని చూడ టానికి-" లత అంది.

"ఆ... చూస్తారులే. ఆ నిర్మల చేయివడి నిక్షేపంలాంటి నాబాబు పోయాడు- మళ్లీ పాపని ముట్టుకోనివ్వడం లేదు. అందుకే-" అంది కోపంగా.

"ఛా...అక్కయ్యా అలా మాట్లాడకు- పాపం నిర్మల విషయం తలుచుకుంటే నాకు చాలా బాధగా వుంటుంది. బాబుపోవడం అది అంతా ఆయన చెప్పారు- నీలాంటి చదువుకు న్నవాళ్లూ ఇలా మాట్లాడితే ఎలా అక్కయ్యా. నిర్మల కాపురం ఇలా అయినందుకు మనం సానుభూతి చూపాల్సిందిపోయి ఇలా అంటే పాపం ఆ అమ్మాయి ఏం అయిపోతుంది"

"అవునమ్మా, నీకేం నాల్గురోజులు వచ్చిపో తావు కనక ఇలాగే అంటావు- ఇక్కడవుండేవా ళ్లకి తెలుస్తాయి బాధలు."

"నీకేంబాధ అక్కయ్యా... తనని చూసుకోడా నికి తల్లితండ్రి వున్నారు- ఎవరూపెట్టి పోషించక్కరలేకుండా తనూ సంపాది స్తూంది." దివ్యధోరణి నచ్చక లత కాస్త నొచ్చు కుంటూ అంది.

"బాధ అంటే డబ్బొక్కటేనా లతా. ఇంట్లో కాపురం వదిలేసిన ఆడపడుచు వుంటే ఎన్ని ప్రాబ్లమ్సో నీకర్థంకాదు- మేం ఇద్దరం సినిమా కి వెడితే చూడలేదు. సరదాగా వుంటే చూడలే దు. ఆవిడకి తోడు మామగారు. ఆవిణ్ణి మాతో సినిమాలకి, షికార్లకి తీసుకెళ్లమంటారు. నామొగుడితో నాకు సరదాగా వెళ్లాలని వుంటుంది కాని మధ్య ఈవిడెందుకు నావెంట. మామగారికయితే కూతురు అపురూపం అని అందరూ అలాగే చూడా లంటారు.ఆయనకి కూతురు అపురూపం అయితే మధ్య నాకెందుకుండాలి- ఆవిణ్ణి ఒక్కమాట అనడానికి లేదు. ఆవిడ నోట్లోంచి మాటవస్తే చాలు జరగాలి. ఆవిడ కంట్లోంచి నీటి చుక్కరాలిందంటే భూప్రపంచాలు ఏకమ యినంత హడావిడి. ఏం ఆవిడ సంపాదిస్తే ఇంట్లో ఇస్తుందనుకుంటున్నావా. అంతా బ్యాంకిలో దాచుకుంటుంది. ఏం కావాలన్నా ఆయనకొనిస్తారు. మొగుడు, కాపురం లేకపో యినా ఆ చీరలు, ఆవేషాలు చూడు... పండగొ స్తే పుట్టింటికొచ్చిన కూతురికన్నా అంత మంచిచీర కొంటారో లేదోకాని మామగారు మాత్రం ఆవిడ పుట్టినరోజులకి, పండగలకి ఎంతెంత తగలేసికొంటారో తెలుసా. చూ స్తుంటే వళ్లుమండిపోతూంటుంది. ఇంకా ఈకూతురు అందరిలా సవ్యంగా కాపురం చే సుకొంటే ఎంత అపురూపమయ్యేదో, ఇంకా ఎంత దోచిపెట్టేవారో మామగారు. ఆయనికి ఎంతసేపు కూతురు తప్ప కొడుకులున్నారూ కోడళ్లున్నారూ, మనవలు పుడ్తారు, వాళ్లకీ ఆస్తి ఇవ్వాలి అన్న తాపత్రయమే లేదు. ఎంత సేపూ కూతురు, కూతురు" దివ్య మనసులో వున్న అక్కసు అంతా వెళ్లగక్కింది.

పెరట్లో పూసిన సన్నజాజులు, కనకాంబరా

లు, మరువం అవికోసి మాలకట్టి లతకిద్దామని వచ్చిన నిర్మల దివ్య అన్నమాటలు విని గుమ్మంబయటే ఆగిపోయింది- ఎంత దారుణంగా మాట్లాడుతుంది దివ్య- ఎప్పటికప్పుడు తనని ఏదో అని హర్ట్ చెయ్యకపోతే తోచదుగా బోలు! ఇంట్లో అమ్మానాన్న వున్నారు కాబట్టి లోపలలోపలే అంటుంది. వాళ్లేకపోతే మాటలతో చిత్రహింస పెట్టేదేమో ఈపాటికి. తండ్రి తనకంతా దోచిపెడ్తాడని గాబోలు భయం. ఈ ఆస్తిలో తనూ వాటా కొచ్చిందని గాబోలు ఆ దుగ్ధ. ఈడబ్బు, ఆస్తి తనకేం అక్కరలేదు- వాళ్లకే కట్టబెట్టమంటుంది. ఎందుకు గొడవలు అని సహిస్తున్న కొద్దీ అంటూంది దివ్య- వూరుకుంటున్న కొద్దీ అలుసు తీసుకుంటోంది. ఏనాడూ రానంత కోపం వచ్చింది నిర్మలకి. గదిలోకి దూసుకువెళ్లింది. దివ్య మాటలు సగంలో ఆపేసి గాభరాపడింది. లత నిర్మలని చూసి నవ్వి ఏదో అనబోయింది.

"వదినా, ఇది నాపుట్టిల్లు- నాకింకా అమ్మానాన్న బతికున్నారు. నేను కాపురం వదిలివచ్చినా, మొగుణ్ణి వదిలి వచ్చినా నాకో పుట్టిల్లు వుందికనక వచ్చాను. అమ్మనాన్నలేకపోతే అడుక్కు తిననైనా తింటాను కాని మీఇంటికి రానులే. నీబాబుసొమ్ము తినిపోతున్నట్టు మరి మాట్లాడావంటే మాటదక్కదు. నీకెంత హక్కు వుందో నాకు తెలియదుకాని ఈ ఇంట్లో నాలుగోవంతు భాగం నాదీ అని మర్చిపోకు. ఆస్తికోసం, డబ్బుకోసం నేను కక్కుర్తిపడను నావంతు కూడా నీమొగుడికీయమని నాన్నకి చెపుతానులే. బతకటానికి నాసంపాదన చాలు నాకు. అమ్మానాన్నల మొహాలు చూసి ఇక్కడ వుంటున్నాను. కానిగతిలేక కాదు- ఈసారి నాగురించి ఒక్కమాట అన్నావంటే మర్యాద దక్కదు జాగ్రత్త." నిర్మల మొహం ఎర్రబడిపోగా ఆవేశంతో వణికిపోతూ అర్చింది.

"చూశావా లతా... చూశావా ఆపొగరు... ఏంవున్నలేకపోయినా ఆపొగరుచూడు..." దివ్య ఉక్రోషంగా ఏదో అనబోయింది.

"ఏం... మొగుడ్ని వదిలానుకాని మానం, అభిమానం, పౌరుషం అన్నీ వదిలానను కుంటున్నావా. ఏం మొగుణ్ణి వదిలినంత మాత్రాన నాకు గౌరవం, మర్యాద లేదనుకుంటున్నావా. నీచేత... నీచేత మాటలుపడేంత పనికిమాలిన దాన్ననుకుంటున్నావా. ఆడదానివయివుండి తోటి ఆడదాని ఇబ్బందేమిటో, ఎందుకలా జరిగిందోనన్న ఆలోచన లేకుండా, చదువుండి సంస్కారం లేని నీవు ఓమనిషి ననుకుంటున్నావా- నన్ను అనేటంత, వేలెత్తిచూపేంత గొప్పదానివా... ఈసారి నాజోలికి వచ్చావంటే ఈ చెప్పుదెబ్బ రుచి చూపిస్తాను"

ఏం అంటున్నది తెలియనంత వెర్రి ఆవేశం వచ్చేసింది నిర్మలకి. అగోలకి అందరూ చుట్టూచేరారు. లత నిర్మలని శాంతపర్చాలని ప్రయత్నిస్తూ-" నిర్మలా... ప్లీజ్ స్టాపిట్... ఏమిటిది అసహ్యంగా మనం ఇలా దెబ్బలాడుకో కూడదు" అంది.

"అవును లతా... మనం అనకు. నీవిలా మాట్లాడకూడదు అని నాకు నీవూ నీతులు బోధించు. తను ఎన్నిమాటలయినా అనచ్చు- ఈరెండేళ్లుగా మెత్తనికత్తిలా నన్ను చూపులతో, ఎత్తిపొడుపులతో ఎంతగాయపర్చిందో మీకేంతెలుసు- ఆవిడ చూపులలో హేళన, తిరస్కారం అనుభవించిన వారికి అర్థమవుతాయి. అయినా అంతా సహించాను. నావల్ల కుటుంబంలో కలతలు రాకూడదని. నేనేం చేసానని నామీద ఇంతకక్ష- తన ఆస్తి, సంపాదన నేను తినిపోతున్నానని దుగ్ధా.. ఎందుకింత లోకువ నేనంటే? మొగుణ్ని వదిలాననా- నా కష్టమేమిటో, బాధయేమిటో ఏమీ అర్థం చేసుకోకుండా ఇలా అంటుంటే ఎంతకని సహించను. ఎన్నాళ్లని సహించను- నేనిక్కడ వుండటమే మీకింత కష్టంగావుంటే ఈరోజే ఇంట్లోంచి వెళ్లిపోతా" ఆవేశంగా మొదలుపెట్టి గొంతు పూడుకుపోగా ఇకమాటరాక దుఃఖం ముంచుకు వచ్చింది- ఆమె కేకలకి అందరూ మూగడంతో దివ్య బెదిరిపోయింది. గిల్టీగా, బెరుకుగా చూసింది.

"నీరూ... నీవెక్కడికీ వెళ్ళనవసరం లేదు. నీవు ఈఇంట్లో వుండటం ఇష్టంలేనివారు ఈ ఇంట్లోంచి వెళ్ళచ్చు- నేనున్నన్నిరోజులు నిన్ను వెళ్ళమనే అధికారం ఎవరికీ లేదు. ఈఇంట్లో మరోసారి ఇలాంటి సంఘటన జరిగితే నేను




సహించను.'' శివశంకరంగారు చాలా గంభీరంగా అందరి వంకాచూసి అక్కడనించి వెళ్లిపోయారు.

రఘు బిడియంగా తలదించుకున్నాడు. దివ్యమొహం అవమానంతో నల్లబడింది. లత నెమ్మదిగా నిర్మల చేయిపట్టుకుని గదిలోంచి బయటికి తీసుకొచ్చేసింది. కృష్ణ జరిగిందేం విననట్టు డ్రాయింగు రూములో మొహానికి పుస్తకం అడ్డంపెట్టుకుని చదువుతున్నట్టు కూర్చున్నాడు.




''నిర్మలా... నీవు మళ్లీ పెళ్లిచేసుకోవాలి. నీవు ఊ అంటే ఓ మంచిసంబంధం వుంది చెపుతాను'' రెండు రోజుల తరువాత ఓసాయంకాలం డాబామీద ఇద్దరూ కూర్చుని వుండగా అంది లత.

నిర్మల ఒక్కనిముషం తెల్లపోయి- తరువాత విరక్తిగా ''చాలు, ఒక పెళ్లి చేసుకొని అనుభవిస్తున్నాను... ఇంకో పెళ్లికూడానా?'' అంది.''

''అలా అనకు... అందరూ ప్రకాశరావులాగానే వుంటారని ఎందుకనుకోవాలి. మా చిన్నాన్నగారి అబ్బాయి... మొన్న వచ్చాడు చూడు... అతను నీవంటే ఇంటరెస్ట్ చూపుతున్నాడు. నిన్ను నాపెళ్లిలో చూసిందగ్గిరనించి నీగురించి చాలాసార్లు అడిగాడు. మొన్న వచ్చినప్పుడు మళ్లీ అడిగాడు. నేను నవ్వి- ''ఎందుకావిడ సంగతులు'' అంటూ హాస్యం ఆడాను. నేను ముందునించి నిన్ను అతను ఇష్టపడుతున్నాడని గ్రహించాను- కాని, నీ ఉద్దేశమేమిటో అసలు సుధాకర్ ఎందుకు అడుగుతున్నాడో ఆ వివరాలు తెలునుకోకుండా చెప్పడం ఎందుకని వూరుకున్నాను- అసలిపుడు ఎందుకు వచ్చానో తెలుసా? ఉత్తరాల ద్వారా కుదరదు, స్వయంగా సుధాకర్‌తో మాట్లాడాలని పండగ వంకబెట్టి వచ్చాను''

''ఎవరు.. అతను మీ చిన్నాన్నకొడుకన్నావు... అతనా..'' అంది ఆశ్చర్యంగా నిర్మల.

''ఆ... అతనే! మొన్న డాబామీదకి తీసుకొచ్చి అడిగితే... నీవు ఇష్టపడితే పెళ్లిచేసుకుంటానన్నాడు''

''అతనికి నాసంగతి తెలుసా- తెలిసీ అన్నాడా'' ఆశ్చర్యంగా అంది.

''అంతా చెప్పాను. అతనికేం అభ్యంతరంలేదు. సుధాకర్ చాలామంచివాడు. పర్సనల్ మానేజ్‌మెంటు కోర్సుపాసయి పర్సనల్ మేనేజర్‌గా వున్నాడు ఆల్విన్‌కంపెనీలో. తండ్రిలేడు. తల్లివుంది. ఆవిణ్ని తను వప్పిస్తానన్నాడు-'' లత అంతాచెప్పింది.

నిర్మల బుగ్గల్లోకి వెచ్చటి ఆవిరి వచ్చింది. సుధాకర్‌ని పెళ్లిలో ఒకసారి చూసినా గుర్తులేదు. మొన్న వచ్చినపుడు మాత్రం లత పరిచయం చేస్తే చూసి, ఐదునిముషాలు మర్యాద మాటలు మాట్లాడి లోపలికి వెళ్లిపోయింది. సుధాకర్ అంతచక్కగా వున్నాడు. మంచి ఉద్యోగంలో వున్నాడు- అతనికేం ఖర్మ, రెండో పెళ్లిదాన్ని తన్నుచేసుకోడానికి- నిర్మల మొహంలో భావాలు చదివినట్టు ''ఎంతమంది ఈ రోజుల్లో రెండోపెళ్ళి చేసుకోవడం లేదు నిర్మలా.. నీముందు ఎంతోబతుకుంది. ఎన్నాళ్లిలా వంటరిగా ఈ బతుకు...''

''అదిసరే... కాని... నీకు తెలియదా, ప్రకాశ్ విడాకులకి అంగీకరించడంలేదని''-

''ఏడిశాడు. వాడికి ముందేం చెప్పద్దు- పెళ్లి చేసుకోండి- తెలిస్తే ఏంచేస్తాడో చూద్దాం- కోర్టుకెక్కితే విడిపోయి ఆరేళ్లయింది. పెళ్లిచేసుకోడానికి కావాలని పర్మిషన్ ఇవ్వడం లేదు, తను మాత్రం ఇంట్లో ఆడదాన్నిపెట్టుకుని సంసారం చేస్తున్నాడు అని వాదించవచ్చు. చూద్దాం... అసలేం చేస్తాడో..''

లత మాటలతో వాడిపోయిన ఆశ మళ్లీ చిగిర్చింది. ఆకొద్ది క్షణాలలోనే-సుధాకర్... నిజంగా అతనితో పెళ్లయితే తనకంతకంటే

కావాల్సిందేంవుంది. మనిషి చాలా సరదాగా, సౌమ్యంగా వున్నాడు. అలాంటి భర్తనే గదా **కోరుకుంది తాను-** ఒక్కనిముషంలో ఏదో ఆశ కల్గింది. అప్రయత్నంగానే పెళ్లికూతురయినట్టు సిగ్గుపడిపోయింది. "ఏమిటో నాకేం తెలియడం లేదు- ఏంచెయ్యాలో? ప్రకాశరావు ఏంచేస్తాడో తెలిస్తే" భయంగా అంది.

"అన్నింటికీ భయపడితే ఎలా నిర్మలా. కొంత తెగువవుండాలి ఇలాంటి పనులకి"

"నాన్న... నాన్నగారితో చెప్పు... నాకేంతెలీదు.." అంది ఆఖరికి.

"ఆయనతో మాట్లాడతాను. మాట్లాడే ముందు నీ అభిప్రాయం వినాలని చెప్పాను" అంది లత. "కాని వదినా! సుధాకర్ కావాలంటే నామాత్రం పిల్ల దొరకదా, నన్నెందుకు చేసుకుంటానన్నాడు-" బిడియంగా అంది.

"కొన్ని ప్రశ్నలకి జవాబులుండవు నిర్మలా! కొంతమందిని చూడగానే ఎందుకో మనకి తెలియకుండానే ఇష్టం ఏర్పడుతుంది. ఫలానా అని కారణం చెప్పలేం. సుధాకర్ నిన్ను చూడగానే ఎందుకిష్టపడ్డాడో తనకీ తెలియదన్నాడు. నేను మామగారితో మాట్లాడతాను. ఆయన అభిప్రాయం విని సుధాకర్‌ని పిలిపిస్తాను... మాట్లాడవచ్చు" అంది లత.

లత మామగారి గదిలోకెళ్లేసరికి ఆయన అన్యమనస్కంగా ఏదో ఆలోచనలో వున్నారు. ఆయన మొహం కళతప్పివుంది. "మామయ్యా..." లత పిల్చింది.

శివశంకరంగారు ఉలిక్కిపడి ఆశ్చర్యంగా చూశారు. అంత చనువుగా కోడలువచ్చి మాట్లాడలేదు ఎప్పుడూ. "ఏమిటమ్మా" అన్నారు ఆప్యాయంగా.

"నేను నిర్మలపెళ్లి విషయం మాట్లాడాలని వచ్చాను" సూటిగా విషయంలోకి దిగింది.

శివశంకరంగారు ఆశ్చర్యంగా 'నిర్మల పెళ్లా...?' అన్నారు.

"అవునండి- మాకజిన్ బ్రదర్ సుధాకర్ మొన్న వచ్చాడు... మీరు చూశారుగా! అతను మీరు అంతా ఇష్టపడితే నిర్మలని చేసుకుంటానంటున్నాడు"

శివశంకరంగారి మొహంలో తళుక్కున ఒక్కక్షణం ఆనందంమెరిసింది. ఆ కళ్ళల్లో ఒక్కసారిగా వెలుగు తటిల్లతలా మెరిసింది. అంతలోనే మబ్బులుకమ్మినట్టు మొహంలో వెలుగు మాయమయింది. "కాని... ఆ దరిద్రుడు వప్పుకోడంలేదు కదమ్మా! వప్పుకుంటే ఎప్పుడో చేసివుండేవాడిని. ఎవరో ఒకరు ఈపాటికి దొరికేవారు. డబ్బాశ చూపయినా ఏదో సంబంధం వెతికి తెచ్చిచేసేవాడిని"

"మీరతనికి ఎందుకంత భయపడటం? గప్‌చిప్‌గా పెళ్లిచేసేయండి కోర్టుకెక్కుతాడా... చూద్దాం- లేదంటే వాడిమొహాన ఇంతడబ్బుకొట్టి వదిలించుకుందాం వాడిని"

"హు... అదీ అయిందమ్మా... ఆ ఆశపోయింది. చూడు, ఇదిగో... ఇదిచదువు" అంటూ టేబుల్‌మీదనుంచి ఓ రిజిష్టరు ఉత్తరం తీసి లత చేతికిచ్చారు. అది ప్రకాశరావు లాయరు శివశంకరంగారు డబ్బు ఇస్తానన్నదానికి జవాబుగా రాసిన ఉత్తరం. దాన్లో- తన క్లయింటు 'అంగీకారం' ఖరీదు మీరిస్తానన్నదానికి పక్కన ఇంకో సున్నా చేర్చండి. అంటే రెండుకి పక్కన సున్నా చేరిస్తే ఇరవై లక్షలు. ఇరవైలక్షలిస్తే వెంటనే అంగీకరిస్తాడు. అతనికి తెలియకుండా, దొంగతనంగాగాని, మోసంచేసిగాని పెళ్లిచేస్తే దాని పర్యవసానం అనుభవించడానికి సిద్ధంగా వుండండి. మీ సంగతులు మాకు ఎప్పటికప్పుడు అందుతూనే వుంటాయి గనక అలాంటి పిచ్చిపనులుచేసి ఇబ్బందిపడరని ఆశిస్తున్నాం. మా క్లయింట్ మీ అమ్మాయిని ఇప్పటికీ భార్యగానే భావిస్తున్నాడు- ప్రకాశరావు భార్యగానే ఆమె మిగిలేటట్టు చూడటం అతని ధ్యేయం...!

"చూశావా అమ్మా! వాడెంత సాడిస్టో- లక్ష, రెండులక్షలో అయితే తేలిగ్గా ఇస్తాం అని ఏకంగా ఇరవైలక్షలన్నాడు. నా ఆస్థులు అన్నీ అమ్మినా ఇరవైలక్షలు ఇవ్వలేనని తెలిసే అలా బేరంపెట్టాడు. ప్రకాశరావు భార్యగానే అది మిగలాలి అంటే మరో పెళ్లికి అతను అంగీకరించడన్న మాట స్పష్టంచేస్తున్నాడు. లాభంలేదమ్మా... వాడుత్త దరిద్రుడు- పగపట్టిన పాము అయ్యాడు. మనం ఏదన్నా తొందరపడితే బైగమీకింద లేదా అడల్టరీకింద కేసుపెట్టడాని

కి వాడు సిద్ధంగా వున్నాడు. ఇలాంటి స్థితిలో పాపం మీ కజిన్‌కూడా ఇరుక్కోడం ఎందుకమ్మా! అతనంత మంచి హృదయంతో దాని చేయి అందుకోడానికి సిద్ధపడ్డా, ఆ చేయి అందిపుచ్చుకునే అదృష్టం దీనికి లేదమ్మా! నేను ఓడిపోయానమ్మా... నావైపునుంచి అన్ని ప్రయత్నాలూ చేసి ఓడిపోయాను. ఇంక దాని రాత అంతే- ఇలా ఏకాకిలా బతుకీడ్వవలసిందే. అన్నీ వుండి దాని అదృష్టం అలా వుంటే మనం ఏం చెయ్యగలం తల్లీ! నీవు మంచిమనసుతో సహాయపడాలనుకున్నావు గాని అది జరిగేది కాదమ్మా" బాధగా అన్నారు.

"పోనీ ఒకసారి సుధాకర్‌తో కూడా మాట్లాడతాను. అతను రిస్క్ తీసుకోగలనంటే... ఇంతకీ అతను పర్మిషన్ ఇవ్వకపోతే పెళ్లి చేసుకుంటే కేసుంటుందా- ఇన్నాళ్లుగా విడిగావున్నా" సందేహంగా అడిగింది.

"వుంటుందమ్మా- బైగమీకింద, అడల్టరీ కింద కేసుపెట్టవచ్చు. కోర్టు మూలకంగా డైవర్స్ తీసుకోకపోయినా కనీసం మ్యూచువల్ అండర్‌స్టాండింగ్‌తో సెపరేషన్ అయినా అయి వుండకపోతే రెండోవారు పెళ్లి చేసుకోడానికి చట్టం వప్పదు. అది తెలిసే అతను దీనిమీద కక్షసాధించడానికి విడాకులు ఇవ్వకుండా అల్లరిపెడుతున్నాడు. వాడు మాత్రం ఎవర్తినో తెచ్చిపెట్టుకున్నాడు. ఈ దేశంలో మగవాడు ఏంచేసినా చెల్లుతుంది. వాడు చేశాడని నిర్మలా అలా చేస్తే లోకం వూరుకుంటుందా... మొగుణ్ని వదిలినందుకే, చదువుకున్న ఆడవాళ్లే లోకువచేసి మాట్లాడుతున్నారు. ఇంకెవడితోనన్నా పెళ్లి లేకుండా తిరిగితే కనులు పొడిచినట్టు పొడుస్తారు. అందుకే ఆడదాని జీవితం అరిటాకులాంటిదంటారు. ఏంజరిగినా ఆడదానికే నష్టం. లోకంలో నూటికి ఎనభై మంది బాధలుపడ్తున్నా ఆకాపురాలు ఎందుకు చేసుకుంటున్నారో ఇప్పుడర్థం అయింది" నిట్టూర్పుతూ అన్నారు శివశంకరంగారు.

"ఇప్పటికయినా అర్థం అయింది. సంతోషం. కాని ఏంలాభం- దాని బతుకు ఇంక ఇంతేగా" మాటలు విని వచ్చిన శారదాంబ అంది. ఆయన ఈసారిభార్య మీద గట్టిగా అరవలేకపోయారు. మానసికంగా, శారీరకంగా బలహీనమైపోయిన ఆయన వాదించలేను. ఓడిపోయాను అన్నట్టు కళ్లు మూసుకుని వుండిపోయారు. అలాంటిస్థితిలో భర్తని ఎప్పుడూ చూడని శారదాంబ గట్టిగా ఏమనలేకపోయింది. ఎంతో ఉత్సాహంగా మాట్లాడాలని వచ్చిన లత నీరుకారినట్టుఅయి నెమ్మదిగా గదిలోంచి బయటికి వెళ్లిపోయింది. నిర్మలకి అనవసరంగా లేనిపోని ఆశలు కల్పించాను. ముందు మామగారితో మాట్లాడి తరువాత నిర్మలకి చెప్పాల్సిందేమో? నిర్మలకి ఏంచెప్పాలో తెలియక ఆరోజంతా ఆమెని తప్పించుకు తిరిగింది లత. ఎవరూ చెప్పక్కరలేకుండానే అందరి మౌనంచూడగానే నిర్మలకి అర్థం అయింది. అయితే అందరూ అనుకున్నంత బాధపడలేదు నిర్మల. ఆమె ఇలాంటి దెబ్బలకి అలవాటుపడిపోయినట్టు, దెబ్బలు తిని శరీరం, మనసు మొద్దుబారినట్టు ఏ భావనకి లోనుకాలేదు.

"ఇది జరిగేది కాదని నాకు తెలుసు వదినా! నీవెందుకు మధ్యన బాధపడుతున్నావు" అంటూ లతని తనే నవ్వుతూ పలకరించింది మర్నాడు.

లతకి నిర్మలని చూస్తే గొంతు నిండుకుంది. పైకి నవ్వుతూ మాట్లాడుతున్న నిర్మల మనస్సులో నిరాశ గుర్తించి సానుభూతిగా, "సారీ నిర్మలా... అనవసరంగా నీకు ఏవో ఆశలు కల్పించాను" అంది.

"నాకేం ఆశలు, కోరికలు లేవు వదినా! అన్నీ చచ్చిపోయాయి ఎప్పుడో" అంది అదోలా నవ్వి. వాళ్లిద్దరి సంభాషణ వింటున్న శారదాంబ కళ్లు వత్తుకుంటూ వెళ్లిపోయింది.

★ ★ ★

మరో సంవత్సరం అతి మాములుగా గడిచిపోయింది ఆ కుటుంబానికి. శివశంకరంగారు ఈ ఏడాదిలో దాదాపు జబ్బుపడ్డవారిలా అయిపోయారు. మనిషి కుష్ణించిపోయారు. జుట్టు అంతా పూర్తిగా తెల్లబడిపోయింది. అరవై రెండేళ్లకే ఎనభైఏళ్ళవార్థక్యం వచ్చినవారిలా అయిపోయారు. కోర్టుకి వెళ్లడం చాలావరకు మానుకొన్నారు. ప్రాక్టీసు అంతా రఘుకి అప్ప




గించారు. ఎప్పుడన్నా క్లిష్టమైన కేసుంటే తప్ప ఇల్లు కదలడం మానేశారు. ఇంట్లో కూడా అందరితో మాటలు తగ్గించేశారు. అలావాలు కుర్చీలో పడుకుని ఏ పేపరో, ఏ భాగవతరామాయణాలో చదవడం లేదా అలా శూన్యంలోకి చూస్తూ ఆలోచించడం భార్య పిల్చినపుడు వెళ్లి తినిరావడం తప్ప మరో వ్యాపకం లేదు ఆయనకి. మూడో కొడుక్కి కూడా పెళ్లిచేసేస్తే కన్నందుకు తన బాధ్యతలు తీరిపోతాయని అనుకుంటారు ఆయన. మోహన్ బొంబాయిలో ఉద్యోగం చేస్తున్నాడు. సంబంధాలు చాలా వస్తున్నాయి. ఏదో ఒకటి చూసి స్థిరపరచే బాధ్యత రఘుకి, శారదాంబకి అప్పజెప్పేశారు. నిర్మల తన రొటీన్ జీవితానికి అలవాటుపడిపోయినట్లు, బాధపడటానికి అతీతురాలైపోయినట్టు యాంత్రికంగా రోజులు గడుపుతూంది. కాలేజికి వెళ్లడం, ఎప్పుడన్నా మంచి సినిమా వస్తే ఫ్రెండ్స్‌తోగాని, తల్లిదండ్రులతో కాని వెళ్లడం, పుస్తకాలు చదువుకోవడం. కాలక్షేపానికి పి.హెచ్‌డి. చెయ్యాలని నిర్ణయించుకుని రోజంతా పుస్తకాలు రిఫర్‌చేసుకుంటూ, కాగితాలు రాసుకుంటూ కూర్చుంటూంది. ఇంకో ఏడాదిలో డాక్టరేటు తెచ్చుకోవాలని పట్టుదలగా రిసెర్చి వర్క్‌చేస్తూంది. దివ్య ఇద్దరు పిల్లలతో పక్కా గృహిణి అయిపోయింది. నిర్మలతో ఎప్పుడులాగే ఎక్కువ మాట్లాడదుకాని ఆమె గురించి పట్టించుకోడం, అనడం మానేసింది. లతకి ఏడోనెల. అప్పుడప్పుడు నిర్మలకి ఉత్తరాలు రాస్తూంటుంది. సుధాకర్‌కి నెల క్రితం పెళ్లయింది అంటూ రాస్తే ఆ ఉత్తరం పట్టుకు అలా చాలాసేపు కూర్చుండిపోయింది నిర్మల. రోజులు ఎవరికోసం ఆగవన్నట్టు గడుస్తున్నాయి.

ఇంక ఈ గుండెల్లో బాధ నేను మోయలేనన్నట్టు... శివశంకరంగారి అసలే బలహీనమయిన గుండె ఓరోజు నోటీస్ ఇవ్వకుండా ఆగిపోయింది. రాత్రి నిద్రలో ఎప్పుడో ఆగిపోయింది ఆయన గుండె. ఉదయం తండ్రికి కాఫీ పట్టుకొచ్చిన నిర్మల ఆరోజు తండ్రి ఇంకా పడుకుని వుండటంచూసి ఆశ్చర్యంగా, అనుమానంగా దగ్గిరికి వెళ్లి లేపబోయింది. కట్టెలా వున్న తండ్రి శరీరం చూసి కెవ్వుమంది.

★ ★ ★

శివశంకరంగారు పోయి పదమూడోరోజు. రావల్సినబంధువులు అందరూ వచ్చారు. జరగవలసిన తంతు అంతా జరిగింది. కొడుకులు ముగ్గురూ తండ్రి అంత్యక్రియలు ఘనంగా చేసి తమ ధర్మం నెరవేర్చారు. దానాలు, ధర్మాలు పెద్దయెత్తున జరిగాయి. ఏభైఐదేళ్లకే మీద పడిన వైధవ్యంతో శారదాంబ అదుఃఖంనించి కోలుకోలేదు ఇంకా. అందరికంటే నిర్మల దుఃఖానికి అంతులేదు. ఉన్న ఆధారంపోయి దిక్కులేనిదయినట్లు విలపించింది. కొండంత అండగా తనను ఆదుకునే తండ్రి మరిలేడు అనగానే ఆమెని ఆపడం ఎవరి తరం కాలేదు. తన వెనక నిలిచి, ధైర్యంయిచ్చి, మంచయినా చెడయినా తనపక్షాన నిలిచి, తనకోసం అనుక్షణం బాధపడే తండ్రి పోతే తనకింక ఎవరుదిక్కు అన్నట్టు తలబద్దలు కొట్టుకు ఏడ్చింది. ఈలోకాన్ని లెక్కచేయకుండా తనకోసం ఎదిరించి, ఎవరేమన్నా నేనున్నాను నీకు అని తన రెక్కల కింద దాచుకొన్నట్టు దాచుకున్న తండ్రి అంత తొందరగా తనని విడ్చిపోతాడని ఎన్నడూ అనుకోలేదు. ఇంకా కనీసం ఓ పది ఏళ్ళన్నా తండ్రి అండ తనకు వుంటుందనుకున్న నిర్మల ఆహఠాత్ సంఘటనకి తట్టుకోలేకపోయింది. ఒక్కమాటా చెప్పకుండా, ఒక్కసారి ప్రేమగా తనని దగ్గిరకి తీసుకోకుండా, ఎవరూ దిక్కులేదన్నట్టు ఒంటరిగా, పిలిస్తే పలికే దిక్కులేనట్టు తండ్రి అలా చనిపోవడం భరించలేని దుఃఖాన్నిచ్చింది. నిర్మలకి. 'డాడీ... నాకెవరున్నారు ఇంక, నేన్నెవరికి అప్పజెప్పివెళ్లావు... నేనెలా బతకాలి ఇంక... ఎవరి ఆసరాతో బతకాలి' అంటూ కన్నీరు మున్నీరుగా ఏడుస్తుంటే చూడలేకపోయారు అందరూ. అందరి మనసులూ ద్రవించిపోయాయి.

అంత దుఃఖంలోను శారదాంబ నిర్మలని పట్టుకుని, "నేనింకా బతికి వున్నానే. నీతల్లిని నేనున్నానే" అంటూ ఓదార్చవలసివచ్చింది.

కృష్ణ, లత నిర్మలని పొదివిపట్టుకుని- "మేమందరం లేమా నీరూ!" అంటూ ఓదార్చబోయారు.

ఆఖరికి రఘుకూడా నిర్మల దుఃఖంచూసి చలించాడు. 'నీరూ... అలామాట్లాడకు. మేము నీకు శత్రువులంకాదే. నాన్న ఇచ్చిన ప్రేమాభిమానాలు మేం ఇవ్వలేకపోయినా నీకాలోటు రానీయమని నమ్ము' అంటూ కళ్లనీళ్లు పెట్టుకున్నాడు.

ఎవరెంత చెప్పినా నిర్మల ఆపదిరోజులూ కళ్లు వాచిపోయేట్టు తిండితిప్పలు లేకుండా ఏడుస్తూనే వుంది. తండ్రి గది వదిలిరాలేదు. ఆమంచం అంచున తలపెట్టుకు పడుకునే వుండేది రోజంతా. ఏం చెప్పి ఎలా ఓదార్చాలో ఎవరికీ అంతుబట్టలేదు. పదిరోజులు తరువాత ఇంక కన్నీరు ఇంకిపోయినట్టు అలా శూన్యంలోకి చూస్తూండిపోయింది.

పదమూడోరోజు అందరు బంధువులూ వెళ్లిపోయారు. శివశంకరంగారి తమ్ముడు రాధాకృష్ణమాత్రం అందరి కోరికమీద మరోనాలుగు రోజులుండిపోయారు. అన్ని తంతులూ పూర్తయ్యాక ఒకరోజు తీరికగా కూర్చున్నవేళ, "రఘూ... మీనాన్న ఏమన్నా విల్లురాశాడేమో తెలుసా?" అనడిగారు.

"తెలీదు చిన్నాన్నా..."అన్నాడు రఘు.

"ఏమ్మా... నీకేమన్నా చెప్పాడా అన్నయ్య" వదినగారిని అడిగారు ఆయన.

"సరిగా తెలియదయ్యా - రాసివుంటారు బహుశా. ఆమధ్య ఎప్పుడో అన్నట్టుగుర్తు. రాస్తున్నట్టు నాకేంచెప్పలేదు మరి" అంది శారదాంబ.

"రఘూ... ఇనప్పెట్టెతీసి చూడు. విల్లుంటే మంచిదే. లేకపోతే ఈ ఆస్తి అంతా సమంగా అయిదు భాగాలుచేసుకోవాలి. పిల్లలు నలుగురు, మీ అమ్మకి అందరికీ సమంగా చెందుతుంది. తీసి చూడు ఎందుకయినా మంచిది" అన్నాడు రాధాకృష్ణ.

"ఇప్పుడు ఆస్తివిషయాలు ఎందుకు చిన్నాన్నా. నాన్నపోయి పట్టుమని పదిరోజులు కాకుండా ఈ ఆస్తి పంపకాల మాటెందుకు. అయినా అమ్మ ఇంకా వుండగానే ఇపుడు ఈ మాటలు ఎందుకు?"

"అలాకాదు కృష్ణా - మీ నాన్న ఏంరాశాడో చూసుకోడం మంచిది. తరువాత ఎవరిది ఎవరో తిని పోయారన్నట్టు మనస్పర్ధలు పెంచుకోకుండా ముందు చూసుకుంటే మంచిది.




ఇవాళే మీభాగాలు పంచుకువెళ్లమని నేనన డంలేదు. ఏంరాశారో చూసుకుంటే మంచిది" అనుభవంతో అన్నాడు ఆయన.

ఇనప్పెట్టెలో విల్లు కనిపించింది - విల్లు రాసి మూడేళ్లకిందటే రిజిష్టరు చేయించిన ట్టుంది. రాధాకృష్ణ ఆ కాగితాలు తీసుకుని అందరినీ కూర్చోపెట్టి చదివాడు - "ఈ నా ఆస్తిఅంతా నా స్వార్జితం. నా తదనంతరం నా ఆస్తి కిందివిధంగా పంచుకోవాలని నాకోరిక. నిర్మల ఈఇంటి ఆడపడుచు - దురదృష్టవశా త్తు ఆమె కాపురం చెడిందికనక ఆడపిల్లకి నిలవనీడవుండాలి కనక ఈఇల్లు ఆమెకి చెందాలి. నా భార్య బతికినన్నిరోజులు ఈ ఇంట్లో వుండే హక్కువుంటుంది. ఈ ఇల్లుకాక లక్ష రూపాయలు నా కుమార్తె పేర ఫిక్సెడ్ డిపాజిట్లోవేశాను. ఆ వడ్డీ ఆమెకి చెందాలి - నాకొడుకులు ముగ్గురికీ పల్లెలోవున్న ముప్పై ఎకరాలలో తలాపది ఎకరాలు, ఒక్కొక్కరికి లక్షరూపాయల కేష్ - నా భార్యకి కొబ్బరితోట, ఆవిడ బతికినన్ని రోజులు అనుభవించేహ క్కు, లక్షరూపాయల కేష్. ఆవిడ తద నంతరం అది కొడుకులు ముగ్గురికీ చెందు తుంది. నా కూతురు తదనంతరం ఈ ఇల్లు నా మగపిల్లల - మగపిల్లలకి, అంటే నా మనమలందరికి ఉమ్మడిగా చెందుతుంది. నాభార్య ఈ ఇంట్లో నా కూతురిని కనిపెట్టుకుని వుండాలని నాకోరిక. నా విల్లులో రాసినట్టు అందరికీ న్యాయంచేకూర్చే బాధ్యత నా తమ్ము డైన రాధాకృష్ణమీద పెడుతున్నాను"- విల్లు చదివిన రాధాకృష్ణ అందరివైపూ చూశాడు.

"ఈయన అన్నంతపనిచేశారు. ఇల్లు దీని పేర పెట్టేశారు" అనుకుంది శారదాంబ. ఆవిడ కొడుకులు ఏమనుకుంటారోనని భయంగా వాళ్లవంక చూసింది. కొడుకులు ముగ్గురూ మొహాలు చూసుకోవడం గు ర్తించింది. రఘు దివ్యవంక చూశాడు. దివ్య మొహం మాడిపోయింది. రఘు మొహం గంటుపెట్టుకున్నాడు. కృష్ణ, మోహన్ మాట్లాడ కుండా వూరుకున్నారు. లత నిర్మలవంక చూ సింది - నిర్మల అసలు విన్నట్టులేదు - ఎటో చూస్తూ ఏదో ఆలోచిస్తూంది.

"ఏమంటావమ్మా వదినా! ఎవరి భాగాలు వారు ఇప్పుడే పంచుకుంటారా...తరువాత చూసుకుంటారా" రాధాకృష్ణ అడిగాడు.

"ఏమనడానికి నేనెవరినయ్యా! మగపిల్లలు పెద్దవాళ్లయ్యారు. వాళ్లని అడిగి వాళ్లెలాచె బితే అలా చెయ్యండి - అయినా నేనింకా బతికేవున్నాను...నా కళ్లముందే ఇలాఆస్తులు పంచుకుని ఎవరికివారు అయిపోవాల్సిన అగ త్యం ఏమివచ్చింది. ఇప్పుడేం తొందర" అంది శారదాంబ - "రఘూ... ఇప్పుడింటికి నీవు పెద్దవాడివి. బాబాయికి మీరంతా కల్సి ఏదో ఆలోచించి చెప్పండి-"

"నా పెద్దరికం ఎవరుంచారులే అమ్మా! ఉంచితే విల్లు రాశాననిగాని, రాస్తున్నాననిగాని నాకు ఒక్కమాటన్నా చెప్పారా నాన్నగారు" నిష్ఠూరంగా అన్నాడు. ఇంకా ఏదో అనాలనివు న్నా తండ్రిపోయిన పదమూడోరోజే తగవులు ఎందుకు అన్నట్టు వూరుకున్నాడు. కాని దివ్య మాత్రం వూరుకోలేదు. "అంటే, ఇప్పుడింక మీతోవమీరు చూసుకుని ఇంట్లోంచి వెళ్లమని మీ నాన్నగారు రాశారు, కనక మన ఏర్పాట్లలో మనంవుండాలి - గెంటించుకోకముందే ఇల్లు చూడండి వెడదాం. ఎలాగో ఇంట్లోంచి వెళ్లాలి కనక ఎవరికి చెందింది వాళ్లు పట్టుకెళ్లడమే మంచిది" అంది మొహం నల్లగా మాడ్చు కుని.

"దివ్యా... అవేం మాటలు. మిమ్మల్ని ఇంట్లోంచి ఎవరు వెళ్లమన్నారు? మీరెందుకు వెళ్లడం... అలా మాట్లాడకు" శారదాంబ మందలింపుగా అంది.

"ఇంట్లోంచి వెళ్లండి అని స్పష్టంగా రాయాలా - ఇల్లు కూతురుపేర పెట్టారంటే కొడుక్కి అందులో హక్కులేనట్టేగా! సిగ్గులే కుండా ఆడబిడ్డ దయాధర్మంమీద మమ్మల్ని బతకమంటారా?" రెట్టించింది దివ్య.

"అవునమ్మా... నిర్మలతో నిన్నుండమన్నారు గాని, నిర్మల భారం పెద్దకొడుకు నైనా నాకు అప్పగించారా? ఇల్లంతా దాని పేరపెట్టడంలో అర్థం మేమిక్కడ వుండటం ఆయనకిష్టం లేదన్నట్టేగా! దివ్య అన్నట్టు నాకేం గతిలేక ఇక్కడ పడుంటానా? ఏమంటారు బాబాయి... మీ ఉద్దేశం ఏమిటి? పెద్దవాళ్లు మీరు చె

వుంది'' రఘు అన్నాడు.

రాధాకృష్ణగారు ఆలోచనలోపడ్డారు. రఘు చెప్పింది ఒకవిధంగా నిజమే. కొడుకులుండీ ఇల్లు నిర్మల పేరునపెట్టారంటే కొడుకులు నిర్మలని సరిగా చూడరన్న భయమేకాక, నిర్మ లకి ఓ నీడ వుండాలని ఆయన ఉద్దేశం అయివుంటుంది. నిర్మల భవిష్యత్తుమీద ఎంత చింతవున్నా ఆరేడు లక్షలు చేసేంత పెద్దఇల్లు కూతురికి ఒక్కర్తికీ ఇవ్వడం ఆయన కీ సమంజసం అన్పించడంలేదు.

''నేనేం చెప్పగలనురా... మీరు మీరు ఆలో చించుకోవాల్సిన విషయం ఇది. నన్నడిగితే మీ అమ్మ బతికినన్నాళ్లు ఈ ఆస్తులు ఉమ్మ డిగా వుండటమే మంచిదేమో. ఆవిడకి మీ రందరూ సమమే. ఆవిడ కళ్లముందే మీ రంతా ఎవరిదివారు పంచుకుని విడిపోవడం ఆవిడకి బాధాకరమే. నన్నడిగితే ఇప్పుడీ ఆస్తు లమీద మీరు బతకడంలేదు. ఇప్పటికిలా వుండనీయండి. ఇంకా మోహన్ పెళ్లి అదీ వుంది. మీ అమ్మ తదనంతరం చూసుకోవ చ్చు''

''నాన్నగారి ఉద్దేశం అదే అయితే ఈ ఇల్లు నిర్మలకివ్వడం, అమ్మని అక్కడ వుండమ నడం అదీ ఎందుకు రాస్తారు? నాచావు తద నంతరం పంచుకోండి అని రాసేవారు''

''మీకు తెలియదు మామయ్యగారూ! మేము ఇక్కడ వుండటం మామగారికి ఇష్టంలే దు. కూతురిని బాధపెడ్తామని ఆయన ఉద్దేశం అయివుంటుంది. అంచేత ఇన్‌డైరెక్ట్‌గా మమ్మ ల్ని ఇంట్లోంచి వెళ్లమనడానికి అలా రాశారు'' అంది దివ్య కటువుగా.

దివ్య అనడం కటువుగా అన్నా ఆ మాటల్లో నిజం వుందని అందరికీ తట్టింది- ''మేం అంత పనికిరానపుడు మాకేనా అందరి గొడవా కావాలి. నేనీ ఇంట్లో చచ్చినా వుండనింక. ఇన్నాళ్లు మంచికో చెడుకోవున్నాం. మొదటిరో జే వేరింటి కాపురానికి వెళ్లితే ఈరోజు మామగా రు పోగానే ఆడవాళ్లని వదిలేసి పెద్దకొడుకు వెళ్లిపోయాడన్న అపవాదుండేది కాదు - మా మరిదిగారు అదృష్టవంతులు. ఈ బాదర బందీలు, ఈ అపనిందలకి అన్నింటికి దూ రంగావున్నారు. మామయ్యగారూ మీరుండ గానే ఎవరిది వారికిచ్చేసి పంపకాలు చేసె య్యండి'' అంది దివ్య గట్టిగా.

''దివ్యా - ఆయన పోయిపట్టుమని పదిరో జులయినా అవలేదు - ఇప్పుడు ఇంట్లోంచి మీరు వెళ్లవలసిన అవసరం ఏమీలేదు. నేబ తికినన్నాళ్లు ఇక్కడే వుందాం. తరువాత ఎలా గో ఎవరిదారి వారిది. నామాట వినమ్మా...'' అంది శారదాంబ.

రఘు దివ్య వంకచూశాడు - దివ్య కఠి నంగా- ''చూడండీ... ఇంత జరుగుతున్నా, మనం ఇంత చర్చించుకుంటున్నా ఆవిడగా రు ఒక్కమాటయినా అందా! అన్నయ్యా మీరు వెళ్లొద్దు, మనం అందరం కల్సివుందామన్న మాటయినా ఆవిడ అనలేదు. ఇల్లు తనపేర వుంది. వీళ్లంతా పోవల్సిందేనన్నట్టు మాట్లాడ కుండావుంటే మమ్మల్ని ఇంకా ఈ కొంప పట్టు కుని వేలాడమంటారా''

రాధాకృష్ణగారు నిర్మలవంక జవాబు ఏమ న్నా చెప్తుందేమోనన్నట్టు చూశారు. అప్పటికీ నిర్మల ఏమీ మాట్లాడలేదు- ''ఏమ్మా, నీరూ... మాట్లాడవేం...నీ ఉద్దేశం చెప్పమ్మా''

నిర్మల తనని కాదన్నట్టు చూస్తూవూరు కుంది - ''ఇంక ఇంతకంటె ఏంచెప్పాలి? ఆవిడ మౌనం అర్థంకావడంలేదూ! చూ డండి... ఏంతెలీనట్టు ఎలా చూస్తుందో...మామ గారిచేత ఈవిడే కల్లబొల్లి ఏడ్పులుఏడ్చి రాయించుకునుంటుంది''కసిగా అంది దివ్య.

''దివ్యా... దానిమొహం చూడు - అదసలు ఈ మాటలు వింటున్నట్టులేదు - ఈ పదిరోజు లుగా అది అసలు మనలోలేదు...మనం అను కుంటున్నది విన్నట్టులేదు'' దివ్య కూతురిమీద నిందవేస్తూంటే శారదాంబ అంది.

లత నిర్మల దగ్గరికివెళ్లి భుజంమీద చెయ్యి వేసి ''నిర్మలా...నీ ఉద్దేశం చెప్పు'' అంటూ అడిగింది.

''ఏం ఉద్దేశం?'' అంది కలలోంచి మేల్కొ న్నట్టు ఆశ్చర్యంగాచూస్తూ. చూడండి ఆ నటన అన్నట్టు దివ్య రఘువంక చూసింది.

శారదాంబ అన్నట్టు నిర్మల ఈ విషయాలు ఏమీవినలేదని రాధాకృష్ణకి అర్థం అయింది.

దేశంలోని అన్నిప్రాంతాల మెడికల్, టెక్నికల్ ఎడ్యుకేషన్ కోర్సుల పూర్తి
వివరాలు, చిరునామాలతోసహా అపూర్వ గ్రంథం



## విద్యార్థుల భవిష్యత్తును తీర్చిదిద్దే 1001 కోర్సులు

ఈనాడు దినపత్రికలో తొమ్మిది నెలలపాటు ధారావాహికంగా వెలువడి
35 లక్షల పాఠకులను ఆకట్టుకొన్న విలువైన వ్యాసాల సంపుటి.

### శ్రీ వి.యస్. హరినారాయణ్

ఈ పుస్తకంలో ఇంజనీరింగ్ కోర్సులు, మెడికల్, పారా మెడికల్, అగ్రికల్చరల్, వెటర్నరీ, మేనేజ్‌మెంట్, కంప్యూటర్, టీచర్ ట్రైనింగ్, పాలిటెక్నిక్, ఐ.టి.ఐ, కంపెనీ సెక్రటరీ, చార్టర్డ్ ఎక్కౌంటెంట్, కాస్ట్ ఎక్కౌంటెంట్, ఐ.ఎ.ఎస్, ఐ.పి.ఎస్, ఐ.ఎఫ్.ఎస్, పరీక్షల వివరాలు, ఇంటర్మీడియట్, స్కూలుస్థాయి వృత్తి విద్యా కోర్సులు, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫేషన్ టెక్నాలజీ, హోటల్ మేనేజ్‌మెంట్, కరెస్పాండెన్స్ కోర్సులు, స్త్రీలకు ప్రత్యేక విద్యావకాశాలు, వికలాంగులకు విద్యాసౌకర్యాలతోసహా దాదాపు 1000 రకాల కోర్సుల పూర్తి వివరాలు చిరునామాలతోసహా పొందుపరిచారు.

విద్యార్థుల భవిష్యత్తును తీర్చిదిద్దే 1001 కోర్సులు

వెల: రు. 25/- మనియార్డర్ ద్వారా పంపి
పుస్తకాన్ని పొందండి.

**ఈ పుస్తకం చదివితే మీ జీవితం మారిపోగలదు.**

# శ్రీమహాలక్ష్మి

బుక్ ఎంటర్‌ప్రైజెస్,

మ్యూజియంరోడ్, విజయవాడ-520 002

ఆయన శివశంకరంగారి విల్లుగురించి అందరి అభిప్రాయాలూ విడమర్చి చెప్పారు. మధ్యలోనే నిర్మల ఆవేశంగా అడ్డువచ్చింది- "వద్దు - నాకేంవద్దు - నాకేం అక్కరలేదు - ఇప్పటికే ఇంటినపడి తినిపోతున్నానని అందరికీ బాధగావుంది - నాకీ ఇల్లువద్దు. ఆస్తివద్దు. నేను బతకడానికి నాకేదో ఉద్యోగంవుంది. ఇదంతా నాకేంవద్దు...ఎవరికి కావాలో వాళ్లకి చ్చేయండి" విరక్తిగా అంటూ లేచి పోబోయింది.

"కూర్చోమ్మా నిర్మలా...మీ నాన్నరాశాక ఆయన కోరినట్టు జరపాలిగాని, నీవు వద్దన్నంతమాత్రాన వాళ్లది అవుతుందా? మీనాన్న ఆడపిల్లవి, నీకేదో ఆధారం వుండాలని ఆలోచించి రాసివుంటారీ ఆస్తి. ఇప్పుడు పంచుకోడమా, మీ అమ్మ తదనంతరం పంచుకోడమా అన్నది ఇప్పటి ప్రశ్న. నీ ఉద్దేశంచెప్పు"

"అదంతా నాకు తెలియదు. నాకేం ఆస్తిలో భాగం అక్కరలేదని కాగితం రాసిమ్మంటే ఇచ్చేస్తాను. నాకేం వద్దు... వద్దు" అంటూ వడివడిగా అక్కడినుంచి వెళ్లిపోయింది నిర్మల. అంతా మొహాలు చూసుకున్నారు.

"దాని మొహం... ఏదో దుఃఖంలో, బాధలో అంటోంది. చిన్నది దానికేం తెలుసు. రఘూ! నాయనా! నామాట వినండి. ఇప్పటికి ఆస్తి పంపకాలు మానండి. అంతగా అవసరమైతే సంవత్సరీకాల నాడు చూద్దాం. మీరెవరూ ఇల్లు వదిలివెళ్లడానికి వీలులేదు. కన్నతల్లిని చెపుతున్నా... నామాటవినండి. రాధాకృష్ణా, ఇప్పటికి వూరుకో, సంవత్సరీకాలకి ఆలోచిద్దాం" శారదాంబ నిర్ణయించేసి అక్కడనించి లేచిపోయింది.

తరువాత అన్నదమ్ములు ముగ్గురూ చాలాసేపు మాట్లాడుకున్నారు.

ఆరాత్రి కృష్ణ తల్లితో "అమ్మా... నాన్నగారు ఇల్లంతా నీరూ పేరరాసేయడం బాగులేదమ్మా. అన్నయ్య చాలా బాధపడ్తున్నాడు. ఇంత పెద్ద ఇల్లు. ఆరుఏడు లక్షలుచేస్తుంది. అంతా దానికే రాశారు. అన్నయ్య ఈవూర్లో వుండేవాడు, వాడి గురించన్నా ఆలోచించలేదు. ఇంత ఇల్లుంచుకుని అద్దె ఇంట్లో వుండే గతి పట్టిందని బాధపడుతున్నాడు. నీరూ అంటే అభిమానం వుండొచ్చు. కాని న్యాయాన్యాయాలు వద్దా? మీ పెద్దవాళ్లే అసలు అన్నదమ్ములలో, అక్కచెల్లెళ్లలో కలతలకి కారణం అవుతారు- ఇలాంటి అవకతవక రాతలు రాసి. ఇప్పుడుచూడు- నీరూ అంటే ఎవరికీ సానుభూతి వుండదు. ఆస్తంతా రాయించుకుందనే అనుకుంటారు. పైకి అనకపోయినా మనసులో ఆ భావంవుండిపోయి దానిపట్ల అసూయాద్వేషాలు పెరుగుతాయి. ఏమిటో నాన్నగారు ఇలాచేశారు. పోనీ ఆస్తి అంతా నాలుగు భాగాలు సరిగా చెయ్యాల్సింది" అని అసంతృప్తి వెల్లడించాడు.

శారదాంబకి తెలుసు. కొడుకుల అసంతృప్తికి కారణం సరి అయినదే అని. ఆవిడ భర్తతో ఎప్పుడో చెప్పింది. కూతురిపట్ల వెర్రి ప్రేమతో కొడుకులు చెల్లెలిని ద్వేషించే స్థితికి తేవద్దని - కాని ఆయన వినలేదు. "నేనేం చెయ్యను నాయనా! ఆయన నాకేం చెప్పిచేశారా? దాని కాపురం అలా అయిందన్న బాధతో చేసివుంటారు - ఆడపిల్లకి నిలవనీడ వుండాలని రాసివుంటారు" అని సర్దిచెప్పడానికి ప్రయత్నించింది - కాని కొడుకుల మొహాలలో అసంతృప్తి ఆవిడకీ బాధ కలిగించింది.

★ ★ ★

తరువాత సంవత్సరం నిర్మలకి అతిభారంగా గడిచింది. ఇంట్లో ఏదోగొడవ జరగని రోజులేదు. శివశంకరంగారు ఇంట్లో పెద్దదిక్కుగా, యజమానిగా వున్నన్నిరోజులు లోపల ఎలావున్నా, ఏం అనుకున్నా ఎదుటపడి అనడానికి భయపడేది దివ్య. రఘుకీ తండ్రిపట్ల భయం, గౌరవం వుండి ఆయన ఏమనుకుంటారోనని ఎప్పటికప్పుడు దివ్యని వెనకనుంచి కంట్రోలు చేస్తూ, నచ్చచెపుతూ, బతిమిలాడుతూ ఇంట్లో గొడవలు రాకుండా చూసేవాడు. మామగారు పోయాక దివ్య స్వతంత్రురాలైపోయింది. భర్తపోయిన దుఃఖంతో, విరక్తితో శారదాంబ ఇంటిగొడవలు పట్టించుకోకుండా దివ్యపైన వదిలేయటంతో దివ్యదే ఇంట్లో పెత్తనం అయిపోయింది. ఇన్నాళ్ళూ చాటుమాటుగా నిర్మలని ఆడిపోసుకునేది- ఇప్పుడింక నన్నడ్డేవారు ఎవరు అన్నట్లు ప్రతిదానికీ పిల్లి




మీద, ఎలుకమీద పెట్టి ఏదో అనేది- సాధించేది, సణిగేది, అరిచేది. పనిమనుషుల దగ్గర, వంటవాళ్ళదగ్గర నిర్మలని దుయ్యపట్ట డమే పనిగా మారింది.

''అయ్యో... మహాలక్ష్మమ్మగారూ! ఆ కాకరకాయకూర చేశారు. మా ఆడబిడ్డగారు తినరు. అమ్మో ఒక్కపూట ఆవిడకి కూరలేకపోతే భూ ప్రపంచం తలకిందులయిపోతుంది. వదినగారు కావాలని చేయించింది అని నన్నాడిపోసుకుంటారు అందరూ. ఆవిడగారికి ఇంకోకూర ఏదన్నా చెయ్యండి'' అనేది వ్యంగ్యంగా."మహ లక్ష్మమ్మగారు- మాఆయనగారికి ఆలశ్యం అయినా ఫరవాలేదు. ఆవిడగారి కాలేజిటైము కి మాత్రం వంటయిపోవాలి- ఉద్యోగస్తురాలుక దండీ- ఈఇంటి యజమానురాలు- వంటఅది సరిగా టైముకి చెయ్యండి. లేదంటే మీకు ఉద్వాసన జరుగుతుంది'' వ్యంగ్యంగా విసుర్లు. ''ఓసుశీలా ఇన్ని బట్టలు అని నామీద ఎగిరితే ఏంలాభమే- ఈఇంట్లో మహారాణిగారు మూడుపూటలా మూడుచీరలు మారుస్తారు- అయ్యోరాత! మొగుడుమొద్దులు లేకపోయినా పోకులకి ఏంలోటే- నామీద ఎగరకు తల్లీ ఇన్నిబట్టలు ఎలాఉతకాలిఅని, ఆవిడకి చెప్పు. ఉద్యోగస్తురాలుగా ఇంకో పదో, ఇరవయ్యో జీతం ఎక్కువయిస్తుందిలే" పనిమనిషిదగ్గర విసుర్లు.

''ఇంట్లో మనుషులు వస్తున్నా వేళకి వచ్చి తినిపోవటం తప్ప ఇంట్లోవాళ్ళు చస్తున్నా పట్టించుకోదు... ఏం చాకిరి చేయటానికి నేనేం తేరగా వున్నానా? వదినఅనికదూ ఏంచేస్తుంది, చచ్చినట్లు చేసుకుంటుంది అనుకుంటుంది. అదే వాళ్ళఅమ్మచేస్తే సాయంచేయదా''. ఏపూటన్నా వంటవండాల్సివస్తే నానా రాద్ధాంతం జరిగేది యింట్లో- ''ఇదిగో మీకూతురంటే మీకు అపురూపమయితే నెత్తిన ఎక్కించుకోండి. ఆవిడగారికి భయపడ్తూ అడుగులకు మడుగులు వత్తాల్సిన ఖర్మనాకు లేదు'' కోడలి విసుర్లకి శారదాంబ ఎప్పుడన్నా ఏదన్నా అనబోతే ఆవిణ్ణి దులపరించేసి పారేసేది.

''ఇదిగో, ఏమండోయి... ఓఅద్దెకొంపచూసి రెడీగాపెట్టండి- మీచెల్లెలుగారికి ఎప్పుడు కోపం వస్తుందో తెలియదు- వచ్చిందంటే ఆవిడ ఇంట్లోంచి పొమ్మంటే అప్పటికప్పుడు ఇల్లుదొరకదు'' రఘుతో వ్యంగ్యంగా అనేది అందరూ వినేటట్టు.

వదినగారి విసుర్లు, వ్యంగ్యాలు, ఆనోటిదురద అన్నీవింటూ చాలావరకు అనుకోనిలే అన్నట్లు పట్టించుకోకుండా వెళ్ళిపోయేది నిర్మల. ఒకొక్కరోజు మనసు బాగుండనిరోజు, తిక్క, చిరాకువస్తే వదినగారి నోరుమూయించేది ఆమెతోసరిగా దెబ్బలాడి. వదినా ఆడపడుచులు అరుచుకుంటుంటే రఘు తలపట్టుకునేవాడు. శారదాంబ సర్దిచెప్పబోయి ఇద్దరిచేత చివాట్లు తినేది-

''ఇల్లు నీపేర వుందని మిడ్సిపడ్తున్నావు. మేంఏదో ఖర్మకాలి వుండటంలేదు. మీ అమ్మగారు అందరూ బతిమిలాడారని వున్నాం, లేదంటే ఎప్పుడో పోయేవాళ్ళం-'' అనేది దివ్య.

''ఆ... వెళ్ళు... వుండి ఎవర్నీ ఉద్ధరించక్కర్లేదు'' అని నిర్మల. ఇంట్లో ఈ తగవులు, మనస్పర్ధలతో ఎన్నాళ్ళో ఇక్కడ వుండటం జరగదు అని రఘుకి అర్ధంఅయింది. ఇంట్లో శాంతికావాలంటే వేరే వెళ్ళడం మంచిది. సంవత్సరీకాల తరువాత వేరే కాపురం పెట్టాలని నిర్ణయించుకున్నాడు రఘు. ఇంట్లో రోజూ ఈగొడవలతో శారదాంబ ప్రాణం విసిగిపోయింది. కోడలు గుణం తెల్సిన ఆవిడకి ఆ ఇంట్లో సర్దుకుని బతకటం జరిగేపనికాదని, విడిపోతేనే కాస్తప్రాణం హాయిగా వుండి, బంధుత్వం నిలుస్తుంది అన్పించింది.




సంవత్సరీకాలకి అందరూ వచ్చారు. రాధాకృష్ణగారితో విడిగా ఒకపూట తన మనసులో

మాటచెప్పాడు రఘు. ఇంట్లో గొడవలతో మనశ్శాంతి లేదని, ఎవరి వాటాలు వారు పంచుకొని వెళ్ళటంకంటే మార్గంలేదని తనకింక ఈగొడవలు భరించే శక్తిలేదని తేల్చిచెప్పేశాడు. కృష్ణ, మోహన్‌కూడా అదే మంచిదన్నట్లు తేల్చారు. విడిగా శారదాంబతో కూడా ఆయన చర్చించారు. ఆవిడా అదే అభిప్రాయాన్ని బలపరచింది. రాధాకృష్ణగారు విల్లులో ప్రకారం ఎవరి భాగాలు వారికి రిజిష్టరు చేయించడానికి రిజిష్ట్రార్‌ని రమ్మన్నారు.

కాగితాలమీద సంతకాలు జరుగుతుండగా హఠాత్తుగా- "ఆగండి... ఇదిగో ఈఇల్లు నాకవసరంలేదని కాగితం రాసి సంతకంపెట్టాను. నామీద ఎవరూ ఏడవనక్కరలేదు. అదిగో ఆవిడకే పట్టంకట్టండి. ఆవిడనే వుండమనండి ఇంట్లో. నేను వేరే ఇల్లు చూసుకున్నాను. రేపే వెళ్ళిపోతున్నాను" అంటూ కాగితాలు విసిరికొట్టింది నిర్మల.

"అదెలాఅమ్మా... మీనాన్నగారు రాసినట్టు జరగాలిగాని" రాధాకృష్ణ ఏదో అనబోయారు.

"అక్కరలేదు చిన్నాన్నా! ఆయన కూతురిపట్ల సానుభూతితో రాశారు. కాని ఆ సానుభూతి తోడబుట్టినవాళ్ళకే లేనప్పుడు పైయింటినించి వచ్చిన కోడలికెందుకుంటుంది? ఈఇంటి మూలంగా గొడవలు నాకక్కరలేదు. నా ప్రాణం విసిగిపోయింది. రెండు గదుల ఇల్లయినా నాదంటూ వుంటే ప్రశాంతంగా బతుకుతాను"

"నీ దయ, దానం నాకక్కరలేదు నీరూ... తీసుకో ఆ కాగితాలు" రఘు గంభీరంగా అన్నాడు.

"నీరూ... ఆవేశపడకు. తొందరపడి..." రాధాకృష్ణ అన్నారు.

"తొందరపడక పోతే లాభంలేదు చిన్నాన్నా... ఇలాగే పరిస్థితులు కొన్నాళ్ళుంటే పిచ్చెక్కుతుంది నాకు. ఇల్లుఉంచుకొని కొడుకుని తరిమేశారు ఇంట్లోంచి అన్న అపవాదు నాకొద్దు. నే వంటరిదాన్ని... ఎలాగైనా బతకగలను. పిల్లలుకలవాళ్ళు వాళ్ళకి ఇవ్వండి. ఇంకెక్కడ సంతకాలు పెట్టాలో చెప్పండి... ఇవిగో కాగితాలు"

"ఆగండి. నీరూ... నేనింకా బతికున్నాను. ఈఇంట్లో నేబతికినన్నాళ్ళు వుండేహక్కు నాకిచ్చారు మీ నాన్న. నేను స్వంతఇల్లు విడిచి అద్దెకొంపల్లో వుండను" స్థిరంగా అంది శారదాంబ.

"నీవుండమ్మా నీకొడుకు దగ్గిర. నేను వద్దనలేదు" అంది నిర్మల.

"ఇల్లు నీవు వాళ్ళకి రాసిస్తే అప్పుడింక ఈఇల్లు నాకు పరాయిదే అవుతుంది. ఇంత బతుకూ బతికి ఈనాడు కొడుకు, కోడలు దయాధర్మంమీద బతకాలా నేను?"

"అమ్మా..." అన్నాడు రఘు బాధగా. "అమ్మా, నీఇంట్లో నిన్నుండద్దనేటంత దుర్మార్గుడినా? నీకు అవమానం జరుగుతుందా ఈఇంట్లో!"

"నీకు తెలియదు రఘూ- డబ్బు పాపిష్టిది- అది ఉన్నంతసేపే మనిషికి గౌరవం. ఇల్లు నీపేరకాగానే నేను మీ దయాధర్మాలమీద బతుకుతున్న తేలికాభిప్రాయం వచ్చేస్తుంది. ఇప్పుడు దివ్యా, నీరూ విషయంలో నీవేం చెయ్యగలిగావు. రేపు నావిషయమూ అలాగే అవుతుంది. నేబతికిన నాల్గురోజులూ నేనెవరికీ బరువుఅయి బతకడం నాకిష్టంలేదు- భగవంతుడి దయవల్ల, మీ నాన్న దయవల్ల నాకింత ఇచ్చిపోయారు. ఈఇల్లు నేనున్నంతవరకు అనుభవించే హక్కు మీనాన్న నాకిచ్చారు."

"అయితే మరి నీరూ ఒకర్తె ఎలా వుంటుంది" లత అడిగింది.

"అది ఎక్కడికీ వెళ్ళదు. నేను వెళ్ళనీయను. నేనున్నన్నిరోజులూ అది ఈ ఇంట్లోనే వుంటుంది. ఆతపిల్లని అలా వంటరిగా వదలను నేను. నాతోపాటే అదీవుండాలి ఇక్కడ"

"కాని అమ్మా... ఈ వాతావరణంలో, ఈ దెబ్బలాటల్లో నేనుకూడా వుండలేనమ్మా- నీవు వుండాలంటే వుండు. నేను మాత్రం పోతాను ఈ కొంపలోంచి"

"నీవెందుకమ్మా పోవటం... మేమేపోతాం. అదేగా మీఇద్దరి ఉద్దేశం. మీరే వుండండి ఈ ఇంట్లో- ఏమండీ... ఇదే మీకు ఆఖరిసారి చెప్పడం. మీకు భార్య కావల్సివస్తే ఇంకో




పదిరోజుల్లోగా ఈఇంట్లోంచి వెళ్ళాలి... నేనూ అంత గతిలేనిదాన్ని కాదు. ఎవరి దయాధర్మాలు నాకు అక్కరలేదు'' దివ్య ఉక్రోషంగా అని విసురుగా లేచి వెళ్ళిపోయింది.

''రాధాకృష్ణా... నేను పోయాక నీరూ ఇష్టం నీరూది. అది ఇల్లు వుంచుకుంటుందో, ఇచ్చుకుంటుందో అదంతా దానిష్టం: అప్పటివరకు ఆయన రాసిన ప్రకారమే రిజిష్టరు చేయించండి''

''చిన్నాన్నా- అమ్మతరవాత, ఈ ఇంటిమీద హక్కు ముగ్గురన్నలది అని రాయించండి. ఇందులో నాకేం వాటా అక్కరలేదు. నాన్న ఇచ్చిన లక్ష, నా నగలు, నాజీతం నాకు హాయిగా బతకటానికి చాలు. నావల్ల మగపిల్లలకి అన్యాయం జరగక్కరలేదు'' అంది స్థిర నిశ్చయంగా.

రాతకోతలు పూర్తయ్యాయి.

మరుసటి నెలలో రఘువాళ్ళు వేరే ఇంట్లోకి మారారు.

నిర్మలా, శారదాంబా ఆ ఇంట్లో గత ఐదేళ్ళుగా నిర్లిప్తంగా బతుకుతున్నారు. నిర్మలకి డాక్టరేట్ వచ్చింది. యూనివర్సిటీలో అసిస్టెంట్ ప్రొఫెసర్ అయింది. నిర్మలకిప్పుడు ముప్పై ఐదేళ్ళు.

★ ★ ★

నిర్మల చెప్పటం ముగించింది.

విద్య ఆశ్చర్యంగా, ''ఆంటీ... ఇంత కథుందా మీకు? నేనింకా మీరు ఇష్టంలేక పెళ్ళిచేసుకోలేదని, హాయిగా పెళ్ళిచేసుకోకుండా స్వతంత్రంగా బతుకుతున్నారని అనుకొన్నాను. మీకు పెళ్ళయినట్టే ఎవరికీ తెలీదా... ఎవరూ అనలేదే ఎప్పుడూ?'' అంది.

''ఈకథ నాదే అని ఎలాతెలుసుకున్నావు?'' అంది నిర్మల నవ్వుతూ.

''అంత స్టుపిడ్‌నా ఆంటీ నేను... ఇంకొకరి కథఅయితే అన్నిరకాల ఎమోషన్స్ ఇంత బాగా ఎలాచెప్పేవారు. మీరుపడిన బాధ, ఇంకోరి కథయితే ఇంతహృద్యంగా ఎలా చెప్పగలిగేవారు. మీపేరు, మీఅమ్మగారి పేరుతో సహాచెప్తుంటే ఆమాత్రం కూడా తెల్సుకోలేని స్టుపిడ్‌నా! ఇంత వ్యధ మీలో దాచుకొని ఇలా

కేర్‌ఫ్రీగా ఎలా వుండగలుగుతున్నారు ఆంటీ?''

నిర్మల అదోలా నవ్వింది. ''కాలం అన్నిగా యాలు మాన్పుతుంది విద్యా! ముందు ఏడాది వున్నంతబాధ రెండో ఏడాది లేదు. అలాఅలా రోజురోజుకి పరిస్థితికి అలవాటుపడిపోతాం. ఒక స్టేజీవచ్చేసరికి మనసు అనుభూతులకి అతీతంగా అయిపోయింది. నాన్నగారుపో యాక అదోరకం విరక్తి వైరాగ్యం వచ్చేశాయి. నిర్లిప్తత, దేనికీ చలించని అదోరకం జడత్వం వచ్చేసింది. ఆ స్టేజీ దాటిపోయాక జరిగిన దానికి ఏడుస్తూ కూర్చోకుండా ఉన్నంతలో ఆనందంగా బతకటం కంటే చెయ్యగల్గింది ఏమీలేదని అర్థం చేసుకుని మీ స్టూడెంట్స్‌తో కబుర్లు, కొలీగ్స్‌తో నవ్వులు, ఫ్రెండ్స్‌తో షికార్లు తిరగటం, కనిపించిన మంచిచీర కట్టుకొని సినిమాలు చూస్తూ, పార్టీలు ఇస్తూ బతికే యటం నేర్చుకున్నాను. విద్యా... ఇప్పుడు చె ప్పు, నాకథ విన్నాక నీకేమనిపిస్తుంది. నేను నీగురించి ఎందుకింత ఆరాటపడ్తున్నానో అర్థంఅయిందా? తొందరపడొద్దని ఎందుకు సలహా ఇస్తున్నానో అర్థంఅయిందా''- నిర్మల విద్యవంక చూస్తూ అంది.

విద్య రెండు నిమిషాలు తలదించుకొని ఆలోచనలో వుండిపోయింది.

''అయితే ఆంటీ... ఈ కథకి నీతి, భర్త ఎలాంటివాడయినా వదులుకోవద్దని, ఆ కా పురం చెయ్యమని చెప్పడమా మీ ఉద్దేశం'' సూటిగా నిలేసింది విద్య.

''నా ఉద్దేశం అదికాదని నీకూ తెలుసు. కాని చుట్టూ అందరినీ చూస్తుంటే మనదేశంలో పెళ్లిళ్లు చూస్తుంటే నూటికి అయిదన్నా సక్సెస్ ఫుల్ మారేజెస్ ఉన్నాయా అన్న అనుమానం వస్తూంటుంది నాకు. సక్సెస్ అంటే పెళ్లిళ్లు చేసుకొని, పిల్లలనికంటూ సంసారాలు చేసుకో డంకాదు. ఒకరికొకరు కావాలనుకుంటూ, ఒక రిని ఒకరు గౌరవించుకుంటూ, ఒకరి వ్యక్తిత్వా లని, అభిరుచులని ఒకరు మన్నిస్తూ, మన సున మనసై ప్రేమ, అనురాగం, ఆప్యాయత పంచుకుంటూ జీవిస్తున్న భార్యాభర్తలెందరు న్నారంటావు. వంటరితనంతో విసుగెత్తో, ఇల్లూ వాకిలి చూసుకోడానికి ఆడది కావాలనో మగవా డు, తనకోరక్ష, అండకావాలని ఆడది పెళ్లిళ్లు చేసుకుంటారు. మనదేశంలో అసలు ఆడదాని కి వేరే ఛాయిస్‌లేదు అనుకో. పెళ్లి అన్న పదానికి చ్ఛాలా ప్రాముఖ్యతవుంది మన దే శంలో. ఆడది పుట్టడం, పెరగడం అంటే పెళ్లికొరకు, పిల్లలకొరకు అన్న దృక్పథం చిన్న ప్పటినుంచి పెంచి పోషించబడ్తోంది. ఆడపిల్ల అంటే 'ఆడ' పిల్ల అనే భావంతో చూస్తారు. ఆడదాని జీవిత ధ్యేయం పెళ్లి అని చిన్నప్పటి నుంచి ఇంట్లో పెద్దలు ఆమె మనసులో నాటు తారు. ఆమె జీవితంలో అదృష్టమో, దురదృ ష్టమో పెళ్లితో ముడిపడి ఉంటుంది. ఆ వచ్చే భర్త కాస్త సామాన్యుడయితే ఆ ఆడదాని జీవితం ఏదో చిన్నచిన్న ఒడుదుడుకులున్నా సాఫీగా సాగిపోతుంది. అదే ధూర్తుడు, అహంభావి అయితే ఆ స్త్రీ జీవితం నరకంగా మారుతుంది''

''మరి అలా నరకంగా మారినా సర్దుకుని బతకాలనేగా అందరూ చెప్పేది. మీరు అలాగే అంటున్నారుగా'' విద్య మధ్యలో అడిగింది.

''విద్యా! నేను ముందే చెప్పాను... ఏ పురు షుడుగాని, ఏ స్త్రీగాని పెర్‌ఫెక్ట్‌గా ఉండరు. ఏవో లోపాలు, బలహీనతలు ప్రతి వారిలో ఉంటాయి. ఇది మేల్‌డామినేటెడ్ సొసైటీ. ముందే చెప్పినట్టు ఆడదానికి ఈ సమాజంలో ఛాయిస్‌లేదు. ఆడదానిలో బలహీనతలు, లోపాలు ఉంటే అవి ఆ భర్తసహించడు. భర్తకి అనుగుణంగా సర్దుకుని, తనఅహం, వ్యక్తిత్వం అన్నీ చంపుకొని తన అండన పడుండాలని భర్త ఆశిస్తాడు. అదే భర్తలో బలహీనతలని, అహాన్ని ఆడది చచ్చినట్టు భరించాల్సివ స్తుంది మనదేశంలో. మిల్స్ అండ్ బూన్ నవలల్లో, సినిమాల్లో మాదిరి ఏ పురుషుడూ నిజ జీవితంలో ఉండడు. ఆడదాన్ని సున్నిత మైన పువ్వులా సుకుమారంగా లాలించడం, అనురాగంతో ముంచెత్తడం, ప్రేమతో పరవ శింపజేయడం, ఒకరి కౌగిలిలో ఒకరు కరిగిపో వడం, ఒకరి కళ్లలోకి ఒకరు మై మరచి చూసుకోడం ఇవన్నీ కథలలో, సినిమాలలో తప్ప నిజ జీవితంలో. జరగవు. ఆడదాని అదృష్టంకొద్దీ కాస్త సున్నితం, లాలిత్యం

తెల్సిన భర్తయితే కనీసం ముందురోజుల్లోనయినా భార్యని అలరించడానికి ప్రయత్నిస్తాడు. కాస్త శృంగార భావాలున్న మగవాడయితే ఆ కొద్దిక్షణాలయినా భార్యని లాలిస్తాడు. కాని అలాంటి మగవారు నూటికి పదిమందన్నా ఉంటారా? మిగతా మగవారు చాలామంది ఆడది, భార్యఅంటే ఏవిలువా, గౌరవం ఇవ్వనక్కరలేదని, తన అవసరాల కోసం సృష్టించబడిందని అనుకుంటారు. భార్యని శారీరకంగా తప్ప మానసికంగా గెల్చుకోవాలన్న ఆరాటం ఉండదు వాళ్లకి. ఆడది లాలిస్తే, కాస్త అనురాగం చూపిస్తే కరిగి పాదాలమీద వాలి, బానిస అవుతుందనేది గుర్తించలేని మూర్ఖులు మగవాళ్లు. సున్నితం, లాలిత్యం ఏకోశానా లేని పురుషుడితో జీవితం స్త్రీకి నరకమే. కాని వివాహబంధానికి కట్టుబడి ఒళ్లు అప్పగించి పిల్లలని కంటూ, వంటింట్లో చాకిరి చేసుకుంటూ భర్తగారు కాస్త ఆదరంగా మాట్లాడిన క్షణంలో పొంగిపోయి, తిట్టినప్పుడు ఏడుస్తూ ఇంతే జీవితం అనుకొని తృప్తిపడ్తుంది ఈ దేశంలో సగటు స్త్రీ''-

''మీరు చెప్పింది ఇదివరకటి కాలం స్త్రీ సంగతి ఆంటీ... ఈనాడు పురుషుడితో సమంగా చదివి, ఉద్యోగాలు చేస్తున్న స్త్రీ ఇంకాపురుషుడి దయాధర్మాలకి తలవగ్గి బతకాల్సిందేనా అన్న ప్రశ్న ఈనాటి స్త్రీ అడుగుతుంది. మీ అమ్మమ్మ, అమ్మ వేరేదారిలేక భర్తల ఆగడాలు భరించి పడున్నారు ఇంట్లో. అలా ఈ నాటిస్త్రీ ఎలా ఉండగలదు ఆంటీ? చదువు, ఆర్థిక స్తోమతలేని ఆనాటిస్త్రీ వేరేగతిలేక పడుండేది. ఇప్పుడు చదువు ఇచ్చిన నిబ్బరంతో, చదువు ఇచ్చిన వ్యక్తిత్వంతో స్త్రీ ఇదివరకులాగ ఎలా పడివుండగలదు ఆంటీ'' తీవ్రంగా ప్రశ్నించింది విద్య.

''విద్యా... నిజమే! రోజులు మారాయి. ఆడవాళ్లు గడపదాటి బయటికి వచ్చి ఉద్యోగాలు చేసుకునే స్థాయికి వచ్చారు. ఎంత చదివినా, ఎంత పెద్ద ఉద్యోగాలు చేసినా వారింక పురుషుడి అధీనతకి తల ఒగ్గే బతుకుతున్నారు విద్యా. ఆడది ఆర్జనపరురాలైనా తన సంపాదన తను ఖర్చుపెట్టుకునే స్వాతంత్ర్యంలేని వాళ్లున్నారు. ఆడది చదువుకొని ఉద్యోగం చెయ్యడంవల్ల ఆడదానికి ఒరిగిన లాభం ఏంలేదు. ఆడది ఆర్జన పరురాలై భర్తగారికి సాయపడుతూ ఇంకోఇంత బాధ్యతనెత్తినవేసుకోడం మినహా ఈనాటి స్త్రీకి ఒరిగింది ఏమీలేదు. స్థూలంగా ఆలోచిస్తే ఆడదాని పురోభివృద్ధి అంటే వేషభాషల్లోనే వచ్చింది. వచ్చిన మార్పల్లా ఆడది గడపదాటి బయటికి రావడం వరకే. స్త్రీకి పురుషుని మాదిరిగా వ్యక్తి స్వాతంత్ర్యంరాలేదు. అంటే తనకి నచ్చింది ధైర్యంగా చెయ్యగల సాహసం, చేసి విమర్శలకి తట్టుకుని ఎదిరించి నిలబడగలగడం, తన వ్యక్తిత్వాన్ని, ఆత్మాభిమానాన్ని వెల్లడించే అవకాశం ఈనాటి స్త్రీకి ఇంకారాలేదు. పెళ్లికాకముందు తండ్రి, పెళ్లయ్యాక భర్త, ముసలి వయసులో కొడుకు ఇలా జీవితంలో ప్రతి స్టేజిలోనూ ఆమె పురుషుడి అధీనంలోనే ఉంటుంది. ఎంత చదువుకున్నా, సంపాదిస్తున్నా ఇంట్లో చెప్పకుండా, పెర్మిషన్ తీసుకోకుండా కనీసం సినిమాకైనా వెళ్లగలిగిన స్త్రీలు మన మధ్యతరగతి సంసారాల్లో ఎందరున్నారంటావు! ఆడదాన్ని మగవాళ్లందరూ చిత్రహింసలు పెడ్తున్నారని, బానిసల్లా చూస్తున్నారని, గొడ్డుచాకిరి చేయిస్తున్నారని నేననను. కాని ఈనాటికీ భావస్వాతంత్ర్యం లేదు స్త్రీకి. తనకి నచ్చినది చెప్పగలిగే, చెప్పింది చేయగలిగే స్వాతంత్ర్యం ఎంతమంది స్త్రీలకి ఉందంటావు విద్యా. ఇలాంటి పరిస్థితులలో మన అమ్మ, అమ్మమ్మలతరం కంటే మనం సాధించిన ప్రగతి ఏ మాత్రమో నీవే ఆలోచించు. నేనూ చదువుకున్నాను. ఆర్థికంగా స్వతంత్రురాలిని. నా భర్తతో విడిపోయే ధైర్యం చేయగలిగాను కాని నా భర్తలా పెళ్లికాకపోతేపోయింది, నా ఇష్టంవచ్చినట్టు ఉంటాను, నా ఇష్టం వచ్చినవాడితో తిరుగుతాను అనే ధైర్యం, సాహసం నాకున్నాయా? నా భర్తలా నా సుఖంకోసం నాకు నచ్చిన తోవ ఎన్నుకోలేక ఎందుకిలా కుమిలిపోతున్నాను. ఎందుకంటే స్త్రీ స్వతంత్రించి పురుషుడిలా ప్రవర్తించితే ఈ సమాజం ఊరుకోదుకనక. నేను ఒక్కర్తినే సినిమాకయినా వెళ్లగలుగుతున్నానా? వెళ్లనిస్తున్నారా? నాన్న అన్నా అమ్మా ఎవరో ఒకరు తోడుగా ఉండాల్సిందేగదా ఈనాటికయినా

ఆడదానికి. మనం ఇదివరకటితరంకంటే సాధించిన ప్రగతివల్ల స్త్రీకి ఏంలాభం చేకూరుతూంది.

స్త్రీ చదువుకోవడం వల్ల విజ్ఞాన ఆర్జనతప్ప ఆమెకి ఒరిగింది ఏముంది. ఇంట్లో పిల్లలకి చదువు చెప్పుకోడానికి, ఇంటిబయట సంబాళించుకునే బాధ్యత ఆమెమీద పడేసి ఇంకాస్త ఫ్రీ అయ్యాడు ఈనాటి పురుషుడు. స్త్రీ ఉద్యోగం చేసినందువల్లా ఆ ఆర్థిక స్వాతంత్ర్యం ఆమెకన్నా ఇంట్లోవారికే లాభిస్తుంది. భార్య సంపాదనతో ఇంట్లో కంఫర్ట్సు పెంచుకుంటున్నాడు పురుషుడు. వేడినీళ్లకి చన్నీళ్లు తోడయి అతని బరువుకాస్త తగ్గించుకున్నాడు. సంపాదిస్తున్నంత మాత్రాన సర్వస్వాతంత్ర్యంగా ఎంతమంది ఆడవాళ్లున్నారంటావు. మనం చదువుకుని, మనకూ ఓ వ్యక్తిత్వం ఉండాలనుకుని పురుషుడిని ఎదిరించి మనం సాధించింది ఏమిటి? అటు పురుషుడితో సమానంగా బతకలేక, అటు పాత తరం స్త్రీలా భర్తమాట జవదాటని పతివ్రత అని అయినా అన్పించుకోలేక రెండింటికి చెడిన రేవడిలా ఉన్నామనిపిస్తోంది. ఆనాటి స్త్రీ బతుకే ఒక విధంగా నయమేమోనని పిస్తుంది ఒకోసారి. ఆనాటి స్త్రీకి చదువులేదు, అజ్ఞానంలో బతికేది. భర్త ఏంచేసినా పడుండాలని, కొట్టినా తిట్టినా అదే స్వర్గం అనుకుంటూ సహించాలని, తన అదృష్టమో దురదృష్టమో అంతా భర్తతోనే ముడిపడివుంటుంది అని, ఇల్లే స్వర్గం అని, పిల్లలని కనడమే ఘనకార్యం అని, భర్తకి, పిల్లలకి చాకిరి చేసుకుంటూ బతకడమే జీవితపరమావధి అనుకొని, భర్త మంచివాడయితే అదృష్టం అనుకుని మురిసిపోవడం, దుర్మార్గుడైతే తన ఖర్మ అనుకుని అనుభవించడం, భర్త లాలించిన రోజు కరిగిపోయి. తిట్టిననాడు ఏడ్చి అదే బతుకు అనుకునేది. భర్త అంటే తిట్టడానికి, కొట్టడానికి హక్కుంది. ఆడది అదంతా భరించాలి అని నమ్మేది. ఆ అజ్ఞానమే ఆమెకి రక్షఅయి ఏ అనుభూతికీ లోనుకాకుండా బతకగలిగేది. ఈనాటిస్త్రీ చదువుకుని, విజ్ఞానం సంపాదించి, స్త్రీ పురుషులిద్దరూ సమానమన్న సత్యం తెలుసుకొని, ఆ సమానత్వం కాగితాలలోతప్ప కార్యాచరణలో కాదన్న నిజం జీర్ణించుకోలేక, పురుషుడికి తలఒగ్గి బానిసలా బతకలేక, తలఎత్తి ఎదిరించే ధైర్యంలేక, ఎదిరించి పర్యవసానానికి తట్టుకోలేక, అలా అని ఆత్మాభిమానాన్ని చంపుకోలేక, వ్యక్తిత్వాన్ని వదులుకోలేక ఇటు అటుకాకుండా మధ్యస్థంగా నలిగిపోతూంది.''

''మీరు చెప్పింది నాకర్థం అవుతూంది ఆంటీ! కాని ఈ స్థితి ఎన్నాళ్లు? కాస్త చదువుకున్న ఆడవాళ్లయినా ఈ పురుషాహంకారానికి జవాబు చెప్పలేకపోతే ఈ పరిస్థితి ఎప్పటికి మారేను? ఎన్ని యుగాలయినా ఆడది పురుషాధిత్యానికి తలఒగ్గి బతకవలసిందేనా!''

''జవాబు చెప్పి నేను సాధించింది ఏముంది విద్యా? నీవు జవాబు చెప్పి సాధించగలననుకుంటే అది ఉత్తి అపోహ. అసలు ఈ మాత్రం ధైర్యంచేసి ఇల్లుదాటి బయటికి వచ్చే సాహసం నూటికి ఒకరికన్నాలేదు. ఏ ఉద్యమం అయినా ఏ ఒకరి వల్లనోకాదు. తిరుగుబాటు అన్నది సంఘటిత చర్య. నూటికి ఒక ఆడది భర్త దౌర్జన్యాన్ని సహించలేక తిరగబడి ఇల్లు వదిలివస్తే అది 'వార్త' అవుతుంది. అదే నూటికి తొంభై మంది చేస్తే ''ఉద్యమం'' అవుతుంది. ఏ ఒకఆడదో కాపురం వదులుకుని వస్తే నష్టపోయేది ఆ ఆడదేకాని ఆ పురుషుడికి చీమకుట్టినట్లయినా ఉండదు. ఒక ఆడదాని కాపురం కోసం సంఘంలో విప్లవాలు తలెత్తవు. ఆఆడదాని కోరిక సమంజసమని, ఆమె పోరాటం న్యాయ సమ్మతమైనదని జనానికి తట్టేవరకు స్త్రీకి న్యాయం చేకూరదు. స్వాతంత్ర్యం ఇచ్చేది మానేది పురుషుల చేతిలోదికాదు. ఆ సమాన హక్కుకోసం, తన ఉనికి, తన వ్యక్తిత్వం చూపించడానికి స్త్రీలందరూ ముందుకు రావాలి. స్వాతంత్ర్య పోరాటంలో ఒక్క గాంధీగారే అయితే విదేశీయులతో నెగ్గి స్వాతంత్ర్యం సాధించగలిగేవారా! ఆయన వెనక భారతదేశ ప్రజలందరి సంఘటిత బలంఉందని, అంతటి బలంముందు తమ శక్తి చాలదని ఆంగ్లేయులు గ్రహించారు. ఆయన ఒక్కడినే అయితే ఎప్పుడో అణిచేసేవారు. ఎంతటి బలవంతమయిన సర్పమయినా చలిచీమలచేత




పాల బిస్కట్లు–
నవ్వుతూ, తుళ్లుతూ పెరిగే పాపాయిలకు నేస్తం!






బ్రిటానియా

రుచికరమైన, పుష్టికరమైన బిస్కట్లు

LINTAS BIN MB 10 1710 TL

జిక్కి చస్తుంది అని ఎప్పుడో చెప్పారు. ఈ చీమ ఏం చెయ్యగలదు అని కాలరాస్తాడు పురుషుడు ఒకటో రెండో అయితే. అదే వంద లు, వేలు, లక్షలు చీమలు కలిసి చుట్టుము ట్టితే వాటిముందు తలవంచక ఏంచేస్తాడు'' నిర్మల అంది.

''ముందు మన ఆడవాళ్లకి అసలు ధైర్యసా హసాలు లేవు. మనలో మనకే ఒకరిపట్ల ఒకరికి సద్భావం లేదు, ఐకమత్యం లేదు. ఏంచేసినా ముందు విమర్శించేది ఆడవాళ్లే. అయితే ఈ పరిస్థితి ఎలా మారుతుందంటారు?''

''ఈ మార్పు రావడానికి కొన్ని తరాలు పడ్తుంది విద్యా. ఏ మంచి మార్పూ ఒక్కరో జులో రాదు. ఆడది గడపదాటి బయటికి వచ్చి పురుషునితో సమానంగా చదివి, ఉద్యోగాలుచే సే స్టేజికి రావడానికిన్నితరాలు పట్టింది. మన ముందు ముందు తరాల్లో స్త్రీకి అన్యాయాన్ని ఎదుర్కొనే మనోబలం, ఎదుర్కొని లోకాన్ని లెక్కచెయ్యకుండా బతకగలిగే మనస్థైర్యం అలవడచ్చు''

''అంతవరకూ మనం నోరుమూసుకుని ఈ పురుషుల అహాన్ని సహిస్తూ పడివుండాలా?''

''చూడు విద్యా... మనచుట్టూవున్న సమా జంలో, మనుషుల మానసిక స్థితిలో మార్పు రానంతవరకు సహించక తప్పదు. సహించ కుండా ఎదిరించి బయటకొచ్చిన మనలాంటి ఆడవాళ్లకి లాభంకంటె నష్టమే చేకూరు తుంది. మనసులు కలవని, కలతలు, కలహా లున్న కాపురం వదులుకురావడం చాలా సు లువే. వచ్చాక ఆ స్త్రీకి ఏది దారి! పెళ్లిచేసి ఆడపిల్ల బరువు బాధ్యతలనించి చేతులు దులుపుకున్న తల్లిదండ్రులు తిరిగి ఆ ఆడ పిల్లని చేరదీసి, చేయూతనిచ్చేందుకు తయా రుగాలేరు. దానికి ఆర్థికపరిస్థితి ఒక కారణం, మిగతా పిల్లల పెళ్లిళ్లు కొంత కారణం. తమ తరువాత ఆ కూతురి గతి ఏమిటన్న చింత, ఏ కాపురమో ఒక కాపురం, కనీసం ఆడపిల్లకి రక్షణ వుంటుందన్న ఆలోచనతోనే తల్లిదండ్రు లు ఎంత సేపూ, అల్లుడు ఎలాంటివాడైనా కూతురినే సర్దుకుని బతకమని బోధిస్తారు.





మన మధ్యతరగతి సంసారాల్లో కాపురం వదు లుకుని వచ్చిన ఆడపిల్లని ఆదుకునే తల్లి దండ్రులు ఇంచుమించు లేరు. సమాజంలో బతకవలసినవారా కూతురిని దగ్గరికి తీసి విమర్శలకి గురిఅవలేక, ఆ కూతురు భవిష్య త్తుకి ఇంకేదారి వుండదన్న నమ్మకంతో అలా ప్రవర్తిస్తే వాళ్లని మనం తప్పు పట్టలేం విద్యా''

''ఆంటీ... ఈనాటి ఆడపిల్లలు అందరూ చదువుకుంటున్నారు. తమ కాళ్ళమీద తాము బతికే అవకాశాలున్నప్పుడు ఇంతలా భయప డుతూ బతకడంలో అర్థం లేదంటాను---''

''విద్యా... నాకథ అంతా విన్నాక కూడా నీవింక ఇలాగే మాట్లాడుతున్నావా - చూడు విద్యా... బతకడానికి డబ్బు అవసరమేగాని, డబ్బు ఒకటే జీవితం కాదు విద్యా! చదువు వుంది, సంపాదించుకొని నా బతుకు నేను బతకగలననే ఆత్మవిశ్వానం మంచిదే! కాని ఏ అనుభూతులకి నోచుకోని ఆ బతుకు ఎన్నాళ్లు బతకగలం విద్యా...''

''మేడమ్... మీ కథలో మాదిరి అందరి కథలూ అవుతాయని ఎందుకనుకుంటారు. మొదటి పెళ్లి ఫెయిల్ అయితే రెండో పెళ్లి చేసుకుంటోంధి స్త్రీ కూడా. మీ కేసులో అలా అయిందని అందరికీ అలా అవుతుందా?''

''విద్యా... నీకింకా చిన్నతనం. ఆవేశంలో దూరాలోచన చేయలేకపోతున్నావు. ఈ దే శంలో సగటు ఆడపిల్లకి పెళ్లి అవడం ఎంత కష్టంగా వుందో నీకు తెలుసు. అన్నీ వున్నా, చదువు, కొద్దోగొప్పో అందం వున్నా కొంత మందికి పెళ్లిళ్లు కావడంలేదు. మధ్యతరగతి సంసారాల్లో మొదటి పెళ్ళికే మొగుళ్లు దొరక్క బాధపడ్తుంటే--- ఓ పెళ్లయిన ఆడదానికి, కొన్నాళ్లు కాపురంచేసినదానికి పెళ్లి అవడం అంత సులువు అనుకుంటున్నావా? రెండోపె ళ్లి? ఆడదాన్ని... కాపురం చేసిన ఆడదాన్ని పెళ్లాడటానికి ఎంతమంది మగవాళ్లు ముందుకు వస్తారంటావు. వచ్చినా నీవిచ్చే డబ్బుచూసో, నీఉద్యోగానికి ఆశపడో రావాలి. కొత్తమోజులో నాల్గురోజులు పూరుకున్నా, మగ అహంతో నీవు రెండో పెళ్లిదానివని అనుక్షణం గుర్తుచేసి, వ్యంగ్యంగా విసుర్లు విసిరి నీ బతుకు నరకం చేయడానికి సిద్ధపడతాడు ఆ మగమహారాజు. ఎక్కడో నూటికో కోటికో ఏ

పుణ్యపురుషుడో అలాంటి స్త్రీని సానుభూతితో అర్థంచేసుకుని మనఃపూర్వకంగా చేయూతని వ్వడానికి రావచ్చు. కాని నూటికి తొంభైతొమ్మిది మంది మగవాళ్లు తన భార్యని తనకంటె ముందు ఒకడు అనుభవించాడన్న నిజాన్ని మర్చిపోరు... మనల్ని మరిచిపోనీయరు. అలాంటప్పుడు ఆ ఆడది ఈ రెండోపెళ్లి చేసుకుని ఎంత పొరపాటుచేశాను అని ఏడ వాలి. ఆ స్త్రీకి పిల్లలుంటే రెండో పెళ్లిద్వారాలు పూర్తిగా మూసుకుపోతాయి. పెళ్లయి పిల్లలు న్నదాన్ని చేసుకుని ఆ పిల్లల్ని తన పిల్లలుగా భావించగలిగే పుణ్యపురుషులు వుంటారా, వున్నారా అని సందేహం. ఈమధ్య కొందరు స్త్రీలు వైధవ్యం పొందినవారు, విడిపోయినవా రు ధైర్యంచేసి కొందరు రెండోపెళ్లిచేసుకున్నా ఆ పెళ్లిళ్లలో సక్సెస్ అయినవి చాలా తక్కువ. మొదటి మేరేజ్ సక్సెస్ అవడం అరుదయిన పుడు, రెండో పెళ్లి గురించి ఏ ఆశలు పెట్టుకో గలం''

"మీరు మరీ ఎగ్జాజరేట్ చేస్తున్నారని పిస్తూంది ఆంటీ. పరిస్థితులు అంత ఘో రంగా వున్నాయని నేననుకోను'' విద్య నిర్మల మాటలు నమ్మలేక అంది.

"హు... అనుభవంలోకి రానంతవరకు హోప్ వుంటుంది. సరే... నిన్ను రెండో పెళ్లికి నిరుత్సాహపరచడం నా ఉద్దేశంగాదు. అయితే, నీవు ఆ పెళ్లితో సంతోషంగా వుండగ లిగితే నాకంటే సంతోషించేవారు ఎవరూ వుండరు. కాని గాడ్ ఫర్ బిడ్. రేపు నా కేసులాగే నీదీ అయితే! మీ ఆయనా పంతంకొ ద్దీ డైవర్స్ ఇవ్వనంటే... ముందు బతుకంతా వంటరిగా బతకగలిగే ధైర్యం నీకుందా అని అడుగుతున్నాను'' జవాబు చెప్పమన్నట్టు చూ సింది నిర్మల. విద్య తలదించుకుంది.

"నాకు తెల్సు విద్యా... నీకింకా ఇరవై రెండేళ్లు లేవు. మరో పెళ్లికి వీలులేకపోతే ఎన్నాళ్లు ఏ అనుభూతులు, ఏ స్పందనలు లేకుండా ఏ ఎమోషన్స్ లేకుండా, ఓ ధ్యేయం అంటూ లేకుండా బతకగలవు? అనుభ వించిన దాన్ని కనక నీకింతగా చెప్తున్నాను. పెళ్లి అంటే సెక్స్ కోరికల కోసమే కాదు. ఆడదాని జీవితంలో సెక్స్ ఇంపార్టెన్స్ మగవా డి జీవితంలో వున్నంత వుండదు. కోరికలున్నా, అవి తీరకపోయినా మగవాడిలా పెద్ద బాధప డదు స్త్రీ. స్త్రీకి పెళ్లిలో కావల్సింది ప్రేమ, అనురాగం, నేనున్నాను నీకు అన్న భరోసా, రక్షణ. తనకోసం తపించే ఓ వ్యక్తిని కోరు కుంటుంది స్త్రీ''

"మీరు చెప్పినట్టే స్త్రీ కోరుకునే ఆ కనీస కోర్కెలు తీరకపోతే ఇంక ఆ పెళ్లికి అర్థమే మిటి ఆంటీ! ఆ భర్త ఎలాగూ ఏ అనుభూతు లూ పంచిఇవ్వడు. అలాంటి భర్తతో కలిసి బాధలుపడుతూ అక్కడ బతికేకంటే వంట రిబతుకే నయంకాదంటారా''

నిర్మల విద్యకి ఎలా బోధపరచడం అన్న ఆలోచనతో కొట్టుమిట్టాడింది ఒక్కక్షణం. తన జీవితంలో ఏర్పడిన వెలితి, తన జీవితంలో ఏర్పడిన మోనాటనీ... మాటల్లో ఏవిధంగా మలిచి విద్యకి బోధపరచాలి అన్న ఆలోచనతో సతమతమయింది. మాటలకోసం తడుము కుంది.

"విద్యా... నీకో చిన్న ఉదాహరణ చెపుతాను. మన జీవితం కదిలే రైలుబండి అనుకో. రైలు ప్రయాణంలో ఓ గమ్యం వుంటుంది. జీవి తంలో ప్రతి దశలోనూ గమ్యం చేరుకోవాలన్న తాపత్రయం ప్రతి మనిషిలోనూ వుంటుంది. రైలుబండి కదులుతున్నంతసేపు ఎంత రద్దీ, దుమ్ము, ధూళి, చీదర, చెమట కంపు వున్నా అన్నీ భరిస్తూ గమ్యంచేరడంకోసం ఆరాటంగా ఎదురుచూస్తూ వుంటాం. అదే రైలుబండి ఆగిపోయింది అనుకో - ఆ దుమ్ము, చీదర, ఆ ఉక్క, [illegible] వాసన నిమిషం భరించాలన్నా నిమిషమో యుగంలా అన్పిస్తుంది. కదలని రైలు బండిలో ఎయిర్ కండిషన్ కంపార్టు మెంట్‌లో వున్నా మనిషి సుఖంగా కూర్చోలే డు. ఆ ఎయిర్ కండిషన్ చల్లదనం, ఆ కుషన్ల మెత్తదనం, ఆ కర్టెన్ల అందం అన్నీ వున్నా ఆ రైలు కదులుతున్నంత సేపే సుఖాన్ని అనుభవించగలడు. రైలు బండి కదలకపోతే ఆ ఎయిర్ కండిషన్ చల్లదనమూ, ఆ కుషన్ల మెత్తదనమూ ఎంత సేపు చూస్తూ కూర్చోగలడు మనిషి. గమ్యంవైపు చేరుకుంటే అన్నికష్టాలనీ భరిస్తూ

ఓపిగ్గా ప్రయాణం చేయగలం. మనిషి జీవితం అలాంటిదే. జీవితం ప్రవహించే నది లాంటిది. మనిషి ప్రతిదశలోనూ మార్పు, కొత్తదనం వుంటూ రొటీన్‌లైఫ్ నించి, నిర్లిప్తత నించి మనిషిని నడిపిస్తుంది. చిన్నతనంలో ఆటపాటలు, కాస్తపెద్దయ్యాక చదువు సంధ్యలతో బిజీ. ఆ తర్వాత ఉద్యోగం, తరువాత పెళ్లి, ఆ పెళ్లి తరువాత పిల్లలు, పిల్లలు పుట్టాక వాళ్ల గురించి ఆశలు, ఆలోచనలు, చదువులు, ఒడిదుడుకులు, పెళ్లిళ్లు, ఖర్చులు, మనవలు, వారి ముద్దుమురిపాలు, వార్ధక్యం, మరణం... ఇలా ప్రతిదశలోనూ మనిషి జీవితం రోజురోజుకీ నవ్యతతో కూడివుంటుంది. ఒక దశ గడిచి మరో దశలోకి మారిపోతూ మనిషిని ఆలోచించుకోనీయనంత వేగంగా రోజులు దొర్లిపోతూంటాయి. మన చిన్నతనం తీసుకో... ఆటపాటలతో, చదువు సంధ్యలతో రోజులు ఎంత తొందరగా దొర్లిపోతాయి. తరువాత పెళ్లి, సంసారం, పిల్లలు, వారి ఆలనాపాలనా... చదువులు, పెళ్లిళ్లు అంటూ వుంటే నా జీవితం ఇంత మొరోజ్‌గా వుండేదికాదు. కాపురం, సంసారం అంటూ వుంటే కష్టాలు, కన్నీళ్లు, కలతలు వున్నా రోజులు గడిచిపోయేవి ఎలాగో అలాగ. కాపురం అంటూ వుంటే ఆ భర్త మంచివాడని సంతోషించడమో, చెడ్డవాడని దుఃఖించడమో, ఆ భర్త గురించి ఆడిపోసుకోడమో - పిల్లలు పుడితే ఆ పిల్లలని చూసుకుని దుఃఖం మర్చిపోవడం, మీ కోసం బతుకుతున్నానర్రా అంటూ ఆత్మవంచన చేసుకుంటూ ఆ పిల్లల బాధ్యతల బరువుతో రోజులు దొర్లిస్తూ... పిల్లలకి పెళ్లిళ్లు చేసుకుని, మనవలని చూసి సంతోషిస్తూ ఏదోలా రోజులు దొర్లించేదాన్నేమో! నేను ముందే చెప్పినట్టు నాకు డబ్బుంది కనక దర్జాగా ఎయిర్-కండిషన్ పెట్టెలో ఎక్కగలిగాను కాని కదలని రైలులో ఎంతకని ఆ ఎయిర్ కండిషన్ ఇచ్చే సుఖాన్ని అనుభవిస్తూ కూర్చోగలను. కదిలే రైలయితే ఆగే స్టేషన్లు, వచ్చేపోయే ప్రయాణీకులు, వెనక్కిపరిగెత్తే చెట్లుచేమలు, మనతో ప్రయాణించే చందమామ, మనల్ని దాటుకుపోయే రైలుబండ్లు ఇలా ఎన్నోరకాలుగా కాలక్షేపం వుంటుంది. గమ్యం చేరుతున్నాం అన్న ఆశ, ఆత్రుత, ఆరాటం, ఆనందం వుంటుంది. మనిషి మార్పు అన్నది లేకపోతే పిచ్చెక్కిపోతాడు. నా సంగతే చూడు. పెళ్లివరకు సవ్యంగా వెళ్లిన నా ప్రయాణం తరువాత పట్టాలు తప్పిన రైలుబండి అయిపోయి ప్రయాణం ఆగిపోయింది. రోజూ ఒకటే దినచర్య మనిషికి ఎంత విసుగునిస్తుంది. అదే కాలేజీ, అదే పాఠాలు, అదే తిండి, అదే నిద్ర, అవే పుస్తకాలు చదవడం- రోజూ ఒకటే రొటీన్‌తో పదిహేనేళ్లకే ఎంత విసిగిపోయానో నీకెలా చెప్పను. ఎవరికోసం బతకాలి. ఎవరికోసం సంపాదించాలి. ఎవరి ఆనందం కోసం అలంకరించుకోవాలి. నాకెవరున్నారు, ఎందుకీ బతుకు అన్న వైరాగ్యం పెళ్లి అయిన ఐదారేళ్లకేవచ్చేసింది. అదే అందరిలా కాపురం చేసుకుంటుంటే, ఆ కాపురంలో సుఖం లేకపోయినా నా ఇల్లు, నా సంసారం అనుకొంటూ చాకిరిచేసుకుంటూ, పిల్లల్ని కంటూ, వాళ్లని పెద్ద చేసుకుంటూ, వాళ్ల కోసం బతుకుతూ... ఏదోరకంగా రోజులు మార్పుతో గడిచిపోయేవి. ఏ మార్పు, ఏ అనుభూతులూ లేని ఈ బతుకుకంటే ఆ బతుకే నయమేమోనని పిస్తుంది ఇప్పుడు. మార్పులేని జీవితం కంటె కష్టాలు కన్నీళ్లు వున్న జీవితమే బెటర్ ఏమో! చదువుంది, డబ్బుంది, సుఖాలు అన్నీ వున్నాయి. కాని బతుకులో రమ్యత, అనుభూతి లేవు విద్యా నా జీవితంలో. నీ వయసులో, వయసువేడిలో నేనూ ఆవేశంగా ఆ మొగుడు లేకపోతేనేం, ఉద్యోగం వుంది, హాయిగా బతుకుతాను అనుకున్నాను. కాని ఈ పదిహేనేళ్లలో నాలో మార్పు నాకే ఆశ్చర్యంగా వుంది. అంత ఆవేశం, ఆ వేడి, ఆధాటి అన్నీ ఏమయిపోయాయి? ఇప్పుడు నీకింతగా చెప్తున్నాను అంటే, నాలా నీవూ బాధపడకూడదన్న ఆలోచన నాకు కల్గిందంటే ఈ మొనాటనస్ జీవితంకంటే ఆ జీవితమే బాగుండేదేమోనన్న ఆలోచన నాలో కల్గడమే కారణం ఏమో! నేచేసిన పనికి పశ్చాత్తాపపడటం ఏమో ఇది! విద్యా... మనిషికి చిన్నతనంలో తల్లిదండ్రి, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, వయసువచ్చాక భార్యా పిల్లలో, భర్తా పిల్లలో ఎవరో ఒకరు మనం కావాలనుకునే వారుండాలి. మన ఇల్లు,




మన పిల్లలు అన్నది లేకపోతే ఆ మనిషి మనుగడకి అర్థం కన్పించక విసిగిపోతాడు. విద్యా... ఒక సంగతి చెప్పనా! నాన్న నన్నెంత బాగా చూసినా పెళ్ళికాగానే పుట్టి పెరిగిన ఈ ఇల్లు నాకు పరాయిదిలా కన్పించేది. ఈ ఇంట్లో నేనో గెస్టులా మొహమాటపడుతూ బతికేదాన్ని. అదే నా భర్త ఎంత దుర్మార్గుడైనా, నన్నెంత హింసించినా అది నా ఇల్లు అన్న తృప్తి, అదో రకం హక్కు వుంటుంది అక్కడ. ఒకసారి పెళ్ళికాగానే మనలో మార్పు మనకే ఆశ్చర్యంగా వుంటుంది. విద్యా! రెక్కలు వచ్చిన పక్షి, గూడువదిలి తనకో జంటని చూసుకుని మరో గూడు నిర్మించుకుంటుందే. మనం మనుషులం! 'మనది', 'నాది' అన్న ఆలోచన లేకపోతే బతకడం కష్టం. కష్టమో, సుఖమో నీ ఇల్లంటూ నీకు వుండాలి. నీ పుట్టింట్లో పట్టుపరువులు వున్నా ఆ ఇల్లువరాయి దనిపిస్తుంది. ఏదో గెస్టులా ఎన్నాళ్ళుండటం ఇక్కడ అని మొహమాటంగా వుంటుంది. ఏం చేస్తే ఏం తప్పో, ఎవరేం అనుకుంటారోనని బిడియంగా వుంటుంది అడుగడుగునా. విద్యా... అనుభవించినవారికే తెలుస్తుంది ఈ తేడా. నీవు వచ్చి వట్టుమని పదిరోజులు అవలేదు కనక నీకేం అన్పించక పోవచ్చు. నీ తల్లి, తండ్రి నిన్నెంత ప్రేమించినా రేపు ఈ ప్రేమ, ఈ సానుభూతి నీపట్ల వుంటుందన్న నమ్మకంలేదు. కాపురం వదిలిన ఆడపిల్ల కన్నతల్లికే తక్కువ అవుతుంది. ఈనాడు నిన్ను సపోర్ట్ చేస్తున్న నీ అన్నలు రేపు పెళ్ళాలు రాగానే నిన్ను విమర్శిస్తారు. నీ తల్లి, తండ్రి బతికినన్నాళ్ళు కష్టమైనా నిష్ఠూరమైనా కన్నారు కనక నీ బాధ్యత తీసుకుంటారు. వారి తరువాత నీ అన్నలకి నీ సంగతేం కావాలి! నీ ముందున్న ఏభై ఏళ్ళ జీవితాన్ని వంటరిగా గడపగలగడం అంతే మాటలుకాదు విద్యా! బాగా తొందరపడకుండా, అన్ని కోణాలనించి ఆలోచించిగాని ఏ నిర్ణయానికీ రావద్దని నా సలహా. నీ శ్రేయోభిలాషిగా తొందరపడద్దని, ఆవేశంలో తప్పటడుగు వేయొద్దని చెబుతున్నాను!

"ఆంటీ... ఆ భర్త నిరాదరణ, ఆ హరాస్మెంట్, ఆ అత్తమామల అధార్టీభరిస్తూ బతక

డమే మంచిదంటారా... కాపురం వదలకుండా కష్టమో, నిష్ఠూరమో అక్కడే పడుండటం మంచిదని మీ సలహానా'' విద్య గొంతులో కాస్త తిరస్కారం, హేళన ధ్వనించింది.

అది నిర్మల దృష్టిని దాటిపోలేదు. కాని ఆమె కోపం తెచ్చుకోలేదు. విద్య చిన్నపిల్ల. ఆవేశంతో ఆలోచిస్తూంది. ఆ స్థితిలో వున్న తనూ అప్పుడు అలానే అనుకుంది. వయసు తెచ్చిన అనుభవంతో ఇప్పుడు ఆలోచిస్తూంటే, తను తొందరపడిందన్న నిజం ఈ పదిహేనేళ్లలో ముల్లులా గుచ్చుకొంటూనే వుంది తనని. భర్తని కాస్త మార్చడానికి ప్రయత్నించాల్సిందేమో! తనవైపునించి తనేం చేసింది అతనికి అనుగుణంగా మారడానికి అన్నఆలోచన చాలా ఆలశ్యంగా వచ్చింది. అందుకే విద్యకింతగా చెప్పడం అనుకుంది నిర్మల.

''విద్యా... నీకేం చెప్పాను- మేరేజ్ అంటే నథింగ్‌బట్ జస్ట్ ఏన్ ఎడ్జస్ట్‌మెంట్. ఒక తల్లి కడుపున పుట్టిన నలుగురూ ఒకలావుండరే. ఒక ఇంటపుట్టి పెరిగినా మనస్తత్వాలు కలియవే. అలాంటిది ఇరవైఏళ్ళు, పాతికేళ్ళు వేరే వేరే చోట బతికి హఠాత్తుగా పెళ్ళి పేరుతో ఇద్దరు మనుషులు కలిసి ఒక ఇంట్లో బతకడం అంటే మాటలుకాదు. అలా బతకడానికి ఎన్నో చిన్న చిన్న కోరికలు చంపుకోవాలి. ఎన్నో త్యాగాలు చెయ్యాలి. ఒకరికోసం ఒకరు కొన్ని వదులు కోవాలి. అహాలు చంపుకోవాలి. స్వార్థాన్ని జయించాలి. ఇద్దరిని కలిసి ముడివేసి, ఒక కప్పు కింద బతకమన్నప్పుడు ఆ ఇద్దరి ఆలోచనలు ఒకలా వుండకపోవచ్చు. అభిప్రాయభేదాలు వస్తాయి. మనస్పర్థలు వస్తాయి. కలతలు, కలహాలు తప్పవు. ఒక ఇంట్లో ఎక్కువకాలం ఎవరైనా సరే...నీ తల్లికాని, చెల్లిగాని, అన్నగాని కల్సివుంటే అనేకరకాల అభిప్రాయ భేదాలు వస్తాయి. కన్యగా ఎక్కువకాలం మిగిలిపోతే కన్నతల్లితోనే కలహాలు తప్పవు. తల్లి అంటే తప్పుపట్టని మనం అత్తఅంటే సహించం. అన్న చెల్లి విసుర్లు విసిరితే ఉడుక్కు సహించే మనం అదే ఏ మరిదో, తోడికోడలో, ఆడబడుచో అంటే అవమానం జరిగినట్లు కొట్టుకుపోతాం! ఇరవైఏళ్ళు మనం తండ్రి చాటుగా పెరిగినపుడు ఆయన పెద్దవాడిగా ఏదన్నా మందలిస్తే సహించగలిగిన మనం, మరో ఏభైఏళ్ళు భర్త పరిరక్షణలో బతకాల్సిన, మనం మనకంటే పెద్దవాడుగా భర్త మందలిస్తే, తప్పుపడితే ఎందుకలా గిజగిజలాడిపోతాం? అష్టకష్టాలు పడిపోతున్నట్టు ఎందుకు భావిస్తాం. తల్లితండ్రి అన్నదమ్ములతో రక్త సంబంధం వుంది. భర్త, అత్తమామలు కొత్తగా జీవితంలో ప్రవేశించినవారు, రక్తపాశం లేనివారు. అలాంటివారు ఏదన్నా అంటే వీళ్ళెవరు అనిపిస్తుంది. పుట్టిన ఇరవై ఏళ్ళు తల్లిదండ్రుల అదుపాజ్ఞలలో పెరిగిన మనం పెళ్లి కాగానే ఒక్కసారి ఏదో స్వేచ్ఛ పొందినట్టు ఫీలవుతాం. నా ఇల్లు, నా మొగుడు, నా సంసారం - నా మొగుడు నామాట వింటాడు, నా ఇంట్లో నా ఇష్టం చెల్లుతుంది- అనుకుని ఏవో ఊహిస్తాం. దానికి విరుద్ధంగా ఆ భర్త మనల్ని కేర్ చెయ్యకపోతే, మన మీద జులుంచలాయిస్తే మన కలలన్నీ కల్లలయినట్టు తల్లడిల్లిపోయి, ఆ భర్త దుర్మార్గుడుగా కనిపించి అలాంటి భర్త దొరికాడని తిట్టుకుంటాం. మనల్ని గౌరవించలేదని, మన అభిప్రాయాలకి విలువ ఇవ్వలేదని కించపడ్తాం. దాంతో మనస్పర్థలు మొదలు అవుతాయి. కాని ఇప్పుడు అనుభవంతో చెబుతున్నమాట ఏమిటంటే భర్తలని మనక్కావలసినట్టు మల్చుకోవడం ఆడదాని చేతిలో వుంటుంది అనిపిస్తూంది. కాస్త సౌమ్యుడైన భర్త అయితే మనకు కావల్సినట్టు మోల్డ్ చేసుకోవడం సులువు! అదే కాస్త కోపిష్ఠి, ధూర్తుడు, అహంకారి అయితే మనకు కావాల్సినరీతిలో మలుచుకోడానికి టైము పడుతుంది. బంకమన్నుని నీకు కావల్సిన ఆకారంలో మల్చుకోడానికి అట్టే టైము పట్టదు. అదే నల్లరాయిని మలచడానికి చాలా టైము పడ్తుంది. ఆ రాయిని మనకు కావల్సిన ఆకారంలో తీర్చిదిద్దడానికి ఉలి, శానం, చేతిలో శక్తి మెదడులో ఆలోచన వుండాలి. బంకమన్ను అయితే చేతులతో సులువుగా మలచవచ్చు. ఎలాంటి మగవాడయినా, ఎంత ధూర్తుడైనా కాస్త యుక్తి ఉపయోగిస్తే లొంగక మానడు. మొదట్లోనే ఆ భర్తని మనకి అనుగుణంగా మార్చాలన్న ఆరాటంలో,

యావలో తొందరపడి తప్పటడుగు వేయకూడదు మనం. ముందుగా మనం అతనికి లొంగినట్టు నటించి అతని అహాన్ని చల్లార్చాలి. తిట్టినా కోప్పడినా అతి శాంతమూర్తిలా తల దించుకుని భరిస్తే, కొన్నాళ్ళకి, అయ్యో పాపం నేనేమన్నా వూరుకొంటుంది అన్న సానుభూతి సంపాదించుకుంటాం. అన్నింటికంటే ముఖ్యం తొలిరోజుల్లో సెక్స్‌పట్ల ప్రతిమగవాడికి వీక్‌నెస్ వుంటుంది. ఆ వీక్‌నెస్‌ని ఆడది కేష్ చేసుకోగలిగితే మన గుప్పిట్లో చిక్కినట్టే. అతనో హీరో అన్నట్టు, అతనో శృంగారపురుషుడన్నట్టు, అతనితోడిదే లోకం అన్నట్టు, తన భాగ్యం కొద్దీ అతను దొరికేడన్నట్టు మాటలలో చేతలలో చూపిస్తే లొంగిపోని పురుషుడుండడు. కొత్తరోజుల్లో మన మీద పూర్తిగా అతను అన్నింటికీ ఆధారపడేట్టు చేసుకోవాలి. చేతికి టూత్‌బ్రష్ అందించి, షేవింగ్‌సెట్ సిద్ధంచేసి, బాత్‌రూములో తువ్వాలు పెట్టి, వీపు రుద్ది, తలంటి, నోటికి ముద్దలందించి కన్నతల్లి చిన్నపిల్లాడిని సాకినట్టు సాకితే చంటివాడు తల్లిమీద ఆధారపడ్డట్టు మన మీద ఆధారపడిపోతాడు పురుషుడు. కొత్తలో ఒక ఏడాదిపాటు అతనికి మనం లొంగితే, లొంగినట్టు నటిస్తే మిగతా జీవితం అంతా మనకి అతను లొంగిపోతాడు''

''ఆంటీ.... ఇవన్నీ ఇంత బాగా తెల్సిన మీరు.... ఎందుకు అమలుపరచలేదు''

నవ్వింది నిర్మల- ''ఇవన్నీ అప్పుడు తెలిస్తే నేనీనాడు ఎందుకిలా వుంటాను విద్యా! నేచెప్పానుగా! ఏవో ఊహించుకుని, ఏవో చూసి, చదివి నా భర్త ఇలావుండాలనుకుని వెళ్ళిన నేను దానికి పూర్తిగా విరుద్ధంగా జరిగేసరికి నా కలలు కరిగిపోయాయి. అల్లారుముద్దుగా పెరిగిన నేను నన్ను కాదన్న అతన్ని క్షమించలేకపోయాను. అతనికి లొంగిపడివుండటమా అన్న అహంకారంతో, నాకేం డబ్బుంది, ఆదరించే తల్లిదండ్రులు వున్నారన్న అజ్ఞానంతో అతన్ని ఏవిధంగానూ మార్చాలని కొంతైనా ప్రవర్తించలేదు. కొన్నాళ్ళు శాంతంగా, ఓపికపడితే అతనే దారికి వస్తాడు అని కూడా ఆలోచించలేదు. ఆ వయసు వేడిలో అనుభవశూన్యంగా ప్రవర్తించాను- అని ఇప్పుడు అనుకుంటున్నాను. భర్తలని తప్పుపట్టే ముందు మనల్ని మనం సరిదిద్దుకుంటే మంచిది. ఎంత క్రూరుడైన భర్త అయినా ఏదో ఒక చిన్న ప్లస్ పాయింట్ వుండక మానదు మనిషిలో. అది వెలికితీయడానికి ప్రయత్నించాలిగాని మైనస్ పాయింట్లే పదేపదే చెప్పి అవతలివారిని రెచ్చగొడితే జరిగేది ఏమీ వుండదు విద్యా! చూడు నీ విషయం- మీ ఆయనకి తల్లిదండ్రులంటే భక్తి. అలాంటప్పుడు, మన మధ్య మీ అమ్మ నాన్న ఎవరు అంటే ఎలాంటివారికైనా కోపం వస్తుంది. అదే నీవు తెలివిగా 'అవునండి మీ అమ్మా నాన్నగారు ఎంత మంచివారు. వాళ్ళకి తెలియకుండా ఎలా చేస్తాం. ఇవాళే వాళ్ళకి రాయండి- మనం సామానులు కొనుక్కుంటాం' అని అన్నావనుకో, ఆ మానవుడు ఎంతో సంతోషిస్తాడు. నాల్గుసార్లు తల్లిదండ్రులతో ఏ పని చెప్పందే చెయ్యడు. అయిదోసారి వాళ్ళకి చెప్పకుండానే నీ ఇష్టప్రకారమే చేస్తాడు. తన భార్య తనకి అన్నింట్లో సహకారం ఇస్తుందన్న సంబరంతో 'మా నాన్నకి చెప్పకుండా నిన్ను మీ ఇంటికి పంపను' అంటే మనసులో మండిపోతున్నా కోపం తెచ్చుకోకుండా, 'ప్లీజ్... ఇవాళే మీ నాన్నగారికి రాయండి- ఫోనన్నా చెయ్యండి' అంటే ఎంత సంబరపడిపోతాడు. నీలాంటిదాన్ని సంతోషపెట్టడానికి వాళ్ళవాళ్ళందరినీ కాదని నీ పాదాక్రాంతుడయ్యే స్టేజికి వస్తాడు...''

''ఆంటీ, మీరు ప్రాక్టికల్‌గా ఆలోచించడంలేదు. నేను మనిషిని కానా దేవతనా! నాకేం ఫీలింగ్స్ వుండవా, కోపం తాపం వుండవా నేనేం మానవాతీతురాలినా అలా మాట్లాడడానికి. నాకేం ఆత్మాభిమానం వుండదా అంతలా లొంగిపోవడానికి. ఇదంతా వినడానికి బాగుంది. చెయ్యడం ఎంత కష్టమో....'' మూతి ముడిచి అంది విద్య.

''చాలా కష్టం విద్యా.... నే చెప్పింది ఆచరణలో పెట్టాలంటే చాలా కష్టం అని నాకు తెల్సు. కాని తెలివైన భార్య అయితే అహం కొన్నాళ్ళు చంపుకుని అలాచేసి భర్తని దారిలోకి తెచ్చి గుప్పిటిలో పెట్టుకుంటుంది. మన లాంటివాళ్ళు అయితే వడ్డించిన విస్తరిని తన్నుకుంటూ లేచిపోతే మన అహం, గర్వం మనకే శత్రువు అవుతుంది. విద్యా, చేతులుకా



లాక ఆకులు పట్టుకోవద్దని నాగోల- ఎందు కింతలా చెబుతున్నానో అన్నది ఆలోచించవేం'' అన్ని రకాలుగా చెప్పి విద్యని నమ్మించలేకపోతున్నందుకు అసహాయత నించి విసుగు వచ్చింది నిర్మలకి.

''అలా అయితే ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు చెప్పండి. నాథా నీవే నాకు శరణం అంటూ వెళ్లి అతని కాళ్లుపట్టుకొని క్షమించమని అడగమంటారా? హు!'' దురుసుగా అంది విద్య.

''నిన్నేం కాళ్లు పట్టుకోమనడంలేదు. క్షమాపణా కోరమనడం లేదు. చూడు, ముందర నీ ఎమ్మే పూర్తిచెయ్యి. ఏది ఎలా వచ్చినా ముందు నీవు నీ కాళ్లమీద ఆర్థికంగా నిలబడే అర్హత సంపాదించుకో. మీ ఆయన ఫారెన్‌నించి వచ్చేలోగా నీ చదువు పూర్తిచెయ్యి. ఈలోగా ఆయన రమ్మని ఉత్తరం రాస్తే నా చదువు ఇంకా ఐదారునెలల్లో అయిపోతుంది, ఇలాంటి స్టేజిలో మానడం నాకిష్టంలేదు అని సౌమ్యంగా రాయి. కోపంగా ఆయన ఉత్తరం రాస్తే జవాబివ్వకు. నీ చదువు అయ్యేవరకు ఓపికపట్టు. ఈలోగా అతనూ భార్య ఇంట్లోంచి వెళితే ఆ అవమానం, వెల్తి గ్రహించుకుంటాడు. అప్పుడు కాస్త తగ్గి దారికి రావచ్చు. నీ పరీక్షలయ్యాక, అతను ఫారెన్‌నించి వచ్చాడని తెలిశాక పిలవకపోయినా నీఅంతట నీవు వెళ్లి అతనికి ఒక ఛాన్సు ఇచ్చిచూడు. ఆ వెళ్లినప్పుడు మాటల్లో, ప్రవర్తనలో సౌమ్యత కనబరుచు. అతనేమన్నా కొన్ని రోజులు మాట్లాడక ఊరుకో''

''తిట్టినా, కొట్టినా, అవమానిస్తున్నా సహించమంటారా?'' తీవ్రంగా అంది విద్య.

''కొన్నాళ్లు మాత్రం సహించు. కనీసం సహించినట్టు నటించు. ఎందుకంటే ఎక్కడో మరీ క్రూరుడు, సాడిస్ట్ అయితే తప్ప భార్య తగ్గిపోగానే హింసించడం మానేస్తాడు. భార్యని లొంగదీసుకున్నానన్న తృప్తితో, ఆనందంతో, గర్వంతో నీ జోలికి రావడం తగ్గిస్తాడు. నేను చెప్పినట్టు కొన్నాళ్లు అతనన్న దానికి అవునని చూడు. అలా ప్రవర్తిస్తే దారికి వచ్చేదిలేనిదీ నెలా రెండు నెలలు పరీక్షించి చూడు. నీవు కొంచెం మారితే, అతన్ని మార్చగలనన్న నమ్మకం కలిగితే అతనికి అనుగుణంగా నీవు కొన్నాళ్లు మారాలి. నూటికి తొంభైమంది మగవారు ప్రేమకి, అనురాగానికి లొంగుతారు. నీవెంతంటే నీవెంత అని ఎదిరించే భార్యని ఎదుర్కొంటాడుకాని లొంగి, ప్రేమ, అనురాగాలు చూపే భార్యకి త్వరలోనే లొంగిపోతాడు అని నా నమ్మకం. అన్నివిధాల ఓ రెండు నెలలు నేర్పుగా, ఓర్పుగా అతన్ని మార్చడానికి ప్రయత్నించు''

''అప్పటికీ అతను మారకపోతే... ఈలోగా నాకే కడుపోవస్తే శాస్వతంగా అక్కడే సమాధి అయిపోవాలి నేను''

''విద్యా... స్టుపిడ్‌లా మాట్లాడకు. ఈరోజుల్లో నీవు అక్కరలేదనుకుంటే గర్భంరాదు. నీ భర్త ప్రవర్తన సరిగా అయ్యేవరకు, అతను మారేవరకు ప్రెగ్నెంట్ అవకుండా జాగ్రత్తపడు. అతనికి మార్పు వచ్చేది లేనిది రెండు మూడు నెలల్లో తేలిపోతుంది. అప్పుడే చూడచ్చు, అప్పుడే నిర్ణయించుకోవచ్చు ఏం చెయ్యొచ్చన్న విషయం. ఈలోగా తొందరపడి హేస్టీస్టెప్స్ తీసుకోవద్దు-''

''ఏమో ఆంటీ... మీరెంత చెప్పినా ఆయన మారతారని నాకనిపించడంలేదు. ఆయనలో ఏ కోశానా సరసం, సెన్సాఫ్ హ్యూమర్ లేదు. అలాంటివారితో ఎలా బతకడం''

''విద్యా... నీకో సంగతి చెప్పనా- మా అన్నయ్య, దివ్య మొదట్లో ఎలావుండేవారో తెలుసా? రఘు ఆవిడమాట జవదాటేవాడుకాదు. ఇరవై నాలుగు గంటలూ దివ్య అంటూ ఆమె నామస్మరణే! ఆమె కూచుంటే అందం, నిల్చుంటే మోజు, పాడితే ఆరాధన, మాట్లాడితే మైమరపు! చుట్టూ ప్రపంచాన్నే మరిచి ఆవిడని ఆరాధించాడు... అలరించాడు. వాళ్లని చూస్తుంటే ఏం జంట, ఎంత అదృష్టం అని అసూయపడేదాన్ని. ప్రేమంటే ఇదే, భర్తంటే ఇలా వుండాలి అనుకునేదాన్ని. కాని ఆ ప్రేమలు, మైమరపులు, ఆరాధనలు ఎన్నాళ్లున్నాయి? పట్టుమని ఏడాదిలేవు. అంతలా ఒకరికోసం ఒకరు బతికినట్టుండేవాళ్లు ఏడాది గడిచేసరికి వాదనలు, మూతిముడుపులు, అర్చుకోడాలు, భోజనాలు మానడాలు, దెబ్బలా




టలు, ఒకరినొకరు ఎత్తిపొడుపులు. ఒక రెండేళ్లు గడిచేసరికి వాళ్లేనా వీళ్లు అనేటట్టు మారిపోయారు. ఈ ప్రేమలు అన్నీ పెళ్లి అయ్యేవరకే విద్యా! ఆడది తన స్వంతం అయిపోగానే ఏ ప్రత్యేకతా కనబడదు మగాడికి. ఆమెతో కాపురం ఆరునెలలు చేసేసరికి పాతబడిపోయి కాపురం రొటీన్ అయిపోతుంది. శృంగార భావాలు, రొమాన్సులకి చోటు ఎక్కడ? ఈలోగా పిల్లలు పుట్టుకొస్తారు. సంసార బాధ్యతలు పైన పడతాయి. వాళ్లూ అందరు భార్యాభర్తల మాదిరి మామూలు రొటీన్‌కి అలవాటుపడిపోతారు. పిల్లలు పుట్టాక వాళ్ల ఆలనాపాలనా, చదువు సంధ్యల గొడవల్లో పడిపోతారు. విద్యా... నీవన్నట్టు మనిషి సౌమ్యుడు, సెన్సాఫ్ హ్యూమర్ వున్నవాడయితే బతుకులో నిర్లిప్తత, నిరాశవుండదు. రోజులు ఆనందంగా గడిచిపోతాయి. అది లేని మగవాడితో ప్రతిక్షణం, ప్రతిరోజు ఎడ్జస్ట్ అవడం అన్నంత సుళువు కాదని నాకు తెలుసు. కాని ఈ వంటరి జీవితంకంటె, ఏ ఎమోషన్స్, ఏ స్పందనలూ లేని వంటరిబతుకు కంటే ఆ జీవితమే నయం ఏమో అనిపిస్తుంది నా అనుభవంతో. కనీసం పిల్లలకోసం బతుకుతున్నామన్న తృప్తితోనయినా బతకవచ్చునని నా ఉద్దేశం. అంచేత మీరు వాళ్లకి ఇప్పుడేం రాయద్దు, చెప్పద్దు. అతను వచ్చాక ఓ రెండు మూడునెలలు నీవైపునించి అన్ని ప్రయత్నాలు చేసి చూడు. అప్పటికీ అతను మారకపోతే, మారాడని నమ్మకం కలుగకపోతే సౌమ్యంగా విడిపోవడానికి ప్రయత్నించండి. నీవెంత, చూసుకో రేపే నా కూతురికి మళ్లీ పెళ్లి చేస్తాను అంటే ఆ మగవాడి అహం దెబ్బతిని పగ సాధిస్తాడు. చట్టబద్దంగా విడిపోయేవరకు మంచిగా, సౌమ్యంగా పని సానుకూల బడేట్టు చూడమని నా సలహా. అతను విడాకులకి అంగీకరించినా ముందుగానే నీ కొక వార్నింగ్ . రెండో పెళ్లికి నీకు మొగుడు దొరక్కపోవచ్చు. దొరికినా నీ మొదటి పెళ్లికంటే ఈ పెళ్లి సక్సెస్ అవుతుందన్న గ్యారంటీ వుండదు. అన్ని రిస్కులూ తీసుకోగలిగితేనే అతనితో తెగతెంపులు చేసుకోడానికి సిద్దపడు'' నిర్మల స్థిరంగా అంది.

విద్య మొహం నల్లమబ్బులు కమ్మినట్లయింది.

''ఆంటీ... మీరు నాకు చాలా పిరికిమందు పోశారు. నిన్నటివరకు ఎన్నెన్నో అనుకున్నాను. ఇప్పుడు మీ మాటలు వింటుంటే భవిష్యత్ గురించి భయంగా వుంది. మనసులు కలవని భర్తతో కాపురం నాకేం ఖర్మ! విడిపోతాను, హాయిగా బతుకుతాను అనుకున్న నా నిర్ణయాలన్నీ తలకిందులు చేశాయి మీ మాటలు. చదువుండి, ఆర్థిక స్తోమతవున్న మనమే ఇంత వెనుకంజ వేస్తుంటే ఇంక ఆర్థిక స్వాతంత్ర్యంలేని ఆడవాళ్లగతి ఏమిటి? ఎన్ని తరాలు మారినా మన బతుకు ఇలా మగవాడి ముందు తలవంచి బతకవల్సిందేనా??''

''ఇదివరకే చెప్పానుగా విద్యా... స్త్రీకి వ్యక్తి స్వాతంత్ర్యం, భావస్వాతంత్ర్యం- పురుషునితో సమానంగా స్వేచ్ఛ... ఆ స్వేచ్ఛని పొందిన స్త్రీని విమర్శించని సమాజం వచ్చేవరకు మనం ఇలాగే వుండాలి విద్యా... ఇంకో సంగతి కూడా ఆలోచించాలి మనం- మనకంటే అన్ని విధాల విదేశ వనితలు పురోగమనం సాధించారు. మనకంటే ముందుగా వారు పురుషునితో సమానమైన హక్కులు, స్వేచ్ఛ పొందారు అమెరికాలాంటి దేశాల్లో. వాళ్లు చదువుకుని, ఆర్థిక స్వాతంత్ర్యం సంపాదించుకొని పురుషునిపై ఆధారపడకుండా బతుకుతున్నారు. మనసులు కలవని భర్తతో, హింసించే భర్తతో విడిపోయి హాయిగా బతికే అవకాశం సంపాదించుకున్నారు వాళ్లు. కాని ఇప్పుడు వారి ఆలోచనల్లో, భావాల్లో మార్పు వస్తోంది. ఇప్పుడు వాళ్లూ కుటుంబ జీవనంకోసం ఆరాటపడుతున్నారంటే వారు పొందిన స్వేచ్ఛలో వుండాల్సినంత ఆనందం లేదని గుర్తించారో... లేదంటే వారూ వంటరి జీవితంతో విసుగెత్తారో- లేక పెళ్లిమీద పెళ్లి చేసుకొన్నా కోరుకున్న ఆనందం దొరకకో, లేదా తమ మధ్య పిల్లలు నలిగిపోతున్నారన్న బాధో.. పిల్లల భవిష్యత్తు దెబ్బతిని విశృంఖలంగా తయారైపోతున్నారనో మొత్తంమీద నాగరిక దేశాల్లో కూడా మళ్లీ కుటుంబ జీవనానికే ప్రాముఖ్యతనిస్తున్నారని చదువుతున్నాం. దీన్ని బట్టి చూస్తే 'పెళ్లి' అన్న రెండు అక్షరాలకి జీవితంలో చాలా ప్రాముఖ్యం వుందనిపిస్తుంది. శారీరకంగా బలహీనురాలైన స్త్రీ

తను పురుషుని పరిరక్షణలో వుండటమే మంచిదని ఆలోచిస్తున్నట్టు కన్పిస్తుంది. మన దేశంలోనూ విడిపోయిన భార్యాభర్తలని చూస్తే వాళ్ళు ఎన్నో సమస్యలతో నలిగిపోతున్నట్టు కనిపిస్తోంది. వీటన్నింటిని చూస్తే మేరీడ్ లైఫ్‌లో ఏవో కొన్ని కష్టాలున్నా ఆ లైఫ్‌లో సెక్యూరిటీ ఉందని ఆ వైపే మొగ్గుతున్నారేమో అందరూ. లేకపోతే రోజూ ఇన్ని వేల మంది, ఇన్ని లక్షలమంది ఈ బంధాన్ని తగిలించుకొని, కష్టమైనా సుఖమైనా ఆ జీవితాన్నే ఎందుకు కొనసాగిస్తున్నారంటావు? వంటరి జీవితంలో భవిష్యత్తు అంధకారం కనక, ఏమొగుడో మొగుడు, కొంతయినా బతకాలన్న యావ వుంటుంది ఆ బతుకులో అన్న ఆశతోనే ఇన్నివేల మంది తిట్టుకుంటూనే, కొట్టుకుంటూనే కాపురాలు చేస్తున్నారేమోనని పిస్తుంది నాకు. నీకు ఇంతగా ఎందుకు చెప్పానంటే మంచి చెడ్డలు ఆలోచించే వయసుంది నీకు. నా కథ విన్నాక ఏది మంచో చెడో నీవాలోచించగలవన్న నమ్మకంతో ఇంతగా చెపుతున్నాను. ఆపైన నీ ఇష్టం విద్యా'' అంది నిర్మల భారంగా నిట్టూర్చి.

విద్య చాలాసేపు మాట్లాడలేదు. ఆలోచనల్లో పడ్డట్టు ఉండిపోయింది.

''మరి నేను వెడతాను విద్యా! చాలాసేపయింది వచ్చి. బాగా ఆలోచించుకో... తొందరపడకు'' అంటూ భుజంతట్టి లేచింది నిర్మల.

''సరే ఆంటీ... మీరన్నట్టు ఈ చదువు ఆపను. తర్వాత మీరు చెప్పినట్టే అతనికి ఒక ఛాన్సు ఇస్తాను. అప్పటికీ మారకపోతే అతని ఖర్మ, నా ఖర్మ తేలుతుందిగా'' అంది విద్య అదోలా నవ్వి.

''జీవితం నడిచే రైలుబండి అయితేనే మనిషి మనుగడకి అర్థం వుంటుంది విద్యా! జీవితం చేజారిపోతే ఆ తరువాత అంతకు మించిన శిక్ష మరొకటి వుండదు'' అంది నిర్మల భారంగా.

★ ★ ★

మరోవారం తరువాత ఓ ఉత్తరం పట్టుకుని వచ్చింది విద్య. ''ఏమిటి విద్యా... మీ ఆయన ఉత్తరమా? వస్తావా లేదా అని అల్టిమేటమ్ ఇచ్చారా...?'' విద్య చేతిలో ఉత్తరంచూసి నవ్వుతూ అంది నిర్మల.

''ఆ... అల్టిమేటంలాంటిదే... ఇచ్చింది ఆయనకాదు- ఆయనగారి తండ్రి. మీ అమ్మాయి వెళ్ళి రెండు నెలలయింది. ఆ అమ్మాయి కాపురం కావాలనుకుంటే వెంటనే పంపే ఏర్పాటుచెయ్యండి అని రాశారు. ఇదిగో చదివిచూడండి'' అంది విద్య అదోరకం విరక్తి, నిస్పృహ, చిరాకునిండిన గొంతుతో.

విద్యమొహంలో భావం అర్థంచేసుకొంది నిర్మల.

కవర్... టైప్పుచేసిన ఉత్తరం. అంటే ముందు జాగ్రత్తతో కాపీ వుంచుకున్నారన్న మాట అనుకొంది నిర్మల. విద్య తండ్రికి వియ్యంకుడు రాసిన ఉత్తరం అది. బిజినెస్ టైప్‌లో డియర్ మిస్టర్ అన్న సంబోధనతో- 'మీ అమ్మాయి మా అబ్బాయి దగ్గిరనుంచి చెప్పకుండా చెయ్యకుండా వచ్చేసి రెండు నెలలు అవుతూంది. మీ అమ్మాయికి భర్త, కాపురం కావాలనుకుంటే పదిరోజుల్లోగా రావాలి. కాని పరిస్థితుల్లో ఆ అమ్మాయికి కాపురం అక్కరలేదన్నది మాకు స్పష్టం అవుతోంది. ఆ తరువాత జరిగేదానికి మేమెంతమాత్రం బాధ్యులంకాదని ఇందుమూలంగా తెలియపరుస్తున్నాం' అన్న నాలుగు లైన్ల ఉత్తరం అది. ఉత్తరం మడతపెట్టి నిర్మల నిట్టూర్చింది... ''అయితే మీవాళ్ళు ఏం అంటున్నారు దీని గురించి?''

''ఏం అంటారు. నాన్నగారు ఏంచెయ్యాలో తోచక తలపట్టుకున్నారు. అమ్మమాత్రం 'అయ్యయ్యో, మీరోసారి వెళ్ళిమాట్లాడిరండి. రెండుమూడు నెలల్లో పరీక్షలయ్యాక, వాళ్ళ అబ్బాయి ఫారిన్‌నుంచి వచ్చాక వస్తుందని చెప్పండి. మెల్లగా నచ్చచెప్పండి, అంటోంది'

చిన్నన్నయ్య అయితే 'ఏం అక్కరలేదు. ఏం... వాడి బాబుచేత ఎందుకు రాయించడం, పెళ్ళాం కావల్సివస్తే వాడే రాయచ్చుగా. దీన్నిబట్టి తెలియడంలేదా వాడెలాంటివాడో అంటూ ఎగిరాడు''

విద్య మొహం వాడివుంది. ఈ గొడవలతో ఆ అమ్మాయి మనసెంత నలిగిపోతూందో అర్థం చేసుకుంది. ''నీవేమంటావు విద్యా! నీ అభిప్రాయం ఏమిటి?'' సౌమ్యంగా అంది.

 

విద్య దూకుడుగా తలెత్తింది... "ఐయామ్ ఫీలింగ్ డిజ్‌గస్టెడ్ విత్‌ఆల్‌దిస్. అయామ్ ఫీలింగ్ మిజరబుల్... ఈ వెధవ పెళ్ళి- ఈ వెధవ మొగుడు నాకొద్దు అని అనాలని, అరవాలనివుంది. వారంరోజుల ముందయితే అనడానికి అరక్షణం ఆలోచించేదాన్ని కాదు. కాని మీరు చెప్పింది విన్నాక ఏం చెయ్యాలో తోచక నాకు పిచ్చెక్కిపోతూంది ఆలోచనలతో. ఆంటీ... అనవసరంగా మీరు నాకెందుకు మీ కథ చెప్పారు. నాకెందుకు పిరికి మందుపోశారు?" విద్య మొహం ఎర్రబడింది. కళ్ళల్లో నీరు చిప్పిల్లగా చేతులతో మొహం దాచుకొంది బాధతో... విరక్తితో.

"విద్యా... ఇటు చూడు నీవు నిజంగా అలా ఫీలవుతూంటే, ఈ సంబంధం తెంపుకోవాలంటే ఏ ఉత్తరం రాయకుండావుంటేచాలు... దానంతటదే తెగిపోతుంది. ఆ తెగిపోవడం పూర్తిగా తెగిపోతే సంతోషమే. అటుఇటు కాకుండా ఇటో ముక్క, అటో ముక్క పూర్తిగా తెగకుండా మధ్యలో దారం సగం తెగి వుండిపోతేనే చిక్కు. అతన్నీ పట్టుకుని వేలాడలేక, వదలలేక త్రిశంకుస్వర్గంలో వేలాడినట్లవుతుంది నీ బతుకు అని అంతగా చెప్పాను నీకు. నీకు మనస్ఫూర్తిగా ఈ కాపురంమీద ఇంటరెస్టు లేకపోతే వెంటనే అతనికి రాసి పంతాలు పట్టింపులుపెరిగి, జారుముడి పీటముడిగా బిగుసుకుపోయేలోగా సామ్యంగా కోర్టు ద్వారా విడిపోవడానికి ప్రయత్నించు. జవాబు రాయకుండా అవతలివారిని రెచ్చగొడితే జరిగే ఫలితం నీకు తెలుసు. అంతలో నేనేదో చెప్పానని నీవు బాధపడి బుర్రబద్దలు కొట్టుకోనక్కరలేదు. నీవు నాకు కావల్సిందానివని అలా జరగచ్చు, నీ భవిష్యత్తు జాగ్రత్త అని సూచించాను. నా కథలాగ నీకథ జరగాలనిలేదు. నీవదృష్టవంతురాలివయితే ఈ సంబంధం తెగతెంపులు చేసుకున్నాక ఇంకో సహృదయుడు దొరుకుతాడేమో ప్రయత్నించిచూడు. ఈ జూదంలో గెలుపు, ఓటమి రెండూ వుంటాయనుకుని ప్రయత్నించు" నిర్మల కాస్త నిష్ఠూరంగా అంది.

ఆమె కంఠంలో తీవ్రత గుర్తించి విద్య కళ్ళు తుడుచుకుని తలెత్తి నిర్మలవంక చూసింది. "సారీ ఆంటీ... నాకు ఈ గొడవలతో పిచ్చెక్కిపోతూంది. ఆ కోపంలో ఏదో అన్నాను. మీరు చెప్పిన కథ అంతా మావాళ్ళకి చెప్పాను. అందుకే వాళ్ళూ తొందరపడి ఏ నిర్ణయానికి రాలేకపోతున్నారు. అంతకు ముందయితే నాన్న అరక్షణం ఆలోచించకుండా జవాబు రాసేసేవారు. మీరు చెప్పండి ఆంటీ, ఇప్పుడేం చెయ్యమంటారు? ఉత్తరానికి జవాబివ్వాలా వద్దా... ఇస్తే ఏమని ఇవ్వాలి. మీ సలహా అడిగిరమ్మన్నారు అమ్మానాన్న"

"నన్నడిగితే మీ నాన్నగారు ఆ ఉత్తరాన్ని సీరియస్‌గా తీసుకోనట్టు, 'అమ్మాయికి పరీక్షలింక మూడు నెలలున్నాయి. ఎలాగైనా ఎమ్మే కంప్లీట్‌చేయాలని పట్టుదలగావుంది. పరీక్షలయ్యాక వస్తుంది, అంటూ మీరూ జవాబు నాలుగు లైన్లతో రాయండి. అంతకంటే ఇంకేదీ ఎత్తొద్దు. అతని పేర నీవూ అలాగే నాలుగు లైన్లురాసి పడేయి. అతనితో కాంటాక్టు తెంపుకున్నట్టు వుండకుండా నెలకో రెండు నెలలకో ఓ ఉత్తరం రాస్తుండు... ఇది నా సలహా"

విద్య ఒక్కక్షణం ఆలోచించి "సరే... అలాగే రాయమంటాను నాన్నగారిని" అందిలేస్తూ.




మరోవారం తరువాత మరో ఉత్తరం పట్టుకొని వచ్చింది విద్య. ఈసారి ఉత్తరం మరింత ఘాటుగా వచ్చింది. అదీ టైపు చేయబడిందే! 'మీ అమ్మాయికి చదవాలనివుంటే ప్రైవేటుగా చదవచ్చు. కాపురం వదులుకొని చదవడానికి మా అబ్బాయి ఇష్టపడటంలేదు. కాబట్టి అమ్మాయిని వెంటనే పంపవలసిందని, ఈసారి వారంరోజులలోగా రాకపోతే తమ

కుమారుడితో ఏ సంబంధం వుండదని అర్థం చేసుకోగలరనీ!

"ఈసారి ఏం చెయ్యమంటారు ఆంటీ! సారీ... నా సంగతులతో మిమ్మల్ని విసిగిస్తున్నానేమో! మీరు ఈ విషయంలో ఎలాగో ఇన్వాల్వ్ అయ్యారుగనుక నా అడ్వైజర్‌మీరే" ఈసారి తేలిగ్గా నవ్వుతూ అంది విద్య. "ఆంటీ 'టైమ్ ఈజ్‌ది ఓన్లీ హీలర్' అన్నది ఎంత నిజం. దెబ్బమీద దెబ్బపడితే కొన్నాళ్ళకి మొద్దుబారి నొప్పి తెలీనట్లు గతరెండు నెలలుగా ఆలోచించి ఆలోచించి' వినివిని, బాధపడిపడి ఈసారెందుకో ఏదో విరక్తి వైరాగ్యం వచ్చాయి నాలో. ఏదో నిర్లక్ష్యం, ఏం జరిగితే అదే జరుగుతుందిలే అన్న నిర్లిప్త ధోరణి వచ్చేసింది"

"అది సరే, మీ ఆయనకి ఉత్తరం రాశావా? ఆయన దగ్గరనుంచి ఏం జవాబులేదా?" నిర్మల అడిగింది.

"ఊహు ఏంరాలేదు... ఆ మహానుభావుడికి ఉత్తరం రాయాలంటే తండ్రిగారు పర్మిషన్ ఇవ్వలేదేమో. పితృవాక్య పరిపాలకుడుగదా" విద్య హేళనగా అంది.

"సరే... ఈ ఉత్తరానికి జవాబివ్వకుండా వూరుకోండి. ఇంతకీ మీ ఆయన ఫారెన్ ఎప్పుడు వెళ్ళేది ఏమన్నా తెలిసిందా?"

"ఊహు... ఆయన ఒరిజినల్ ప్లాన్ ప్రకారం ఈ నెల ఇరవైన వెళ్ళాలి"

"నీవొక పనిచేయి. ఏంతెలీనట్టు 'మీరెప్పుడు వెళ్తున్నారో రాస్తే బొంబాయివచ్చి మీకు సెండాఫ్ ఇవ్వాలనివుంది. ప్లీజ్... రాయండి' అని రాయి... చూద్దాం ఏం అంటాడో"

"అమ్మో... ఇప్పుడెళితే నన్ను పీకపిసికి చంపేస్తారేమో ఆ కోపంతో... మళ్ళీ ఇక్కడికి పంపించకపోతే... బాబోయ్ నేవెళ్ళను" భయంగాఅంది.

"డోన్ట్ బి సిల్లీ విద్యా.. ముందసలు అతన్ని ఉత్తరంరాయనీ. రాస్తే ఒకపూట బొంబాయి గనుక వెళ్ళొచ్చావంటే ఇంకో ఆరు నెలలు తోసేయవచ్చు, అతను తిరిగి వచ్చేవరకు"

విద్య అయిష్టంగా మొహంపెట్టింది.

నిర్మల అది చూసి నవ్వింది. "ఏమిటిలా ఆముదం తాగినట్టు మొహం పెట్టావు. బీస్పోర్టివ్ విద్యా... ఇంత చిన్నచిన్న సర్దుబాట్లు, త్యాగాలు చేయలేకపోతే జీవితం ఇంకోరితో ఎలా పంచుకుంటావు? ఇంకో ఏభై ఏళ్ళ జీవితాన్ని ఇంకోరితో పంచుకోవాలంటే ఎన్ని త్యాగాలు, ఎన్ని ఎడ్జెస్టుమెంటులు కావాలో తెలుసా. నామాటవిని అతనికి రాయి. ఏ మొగుడన్నా దేశం వదిలి ఆరు నెలలు వెళుతున్నప్పుడు, పెళ్ళాంపట్ల ప్రేమలేకపోయినా ఆడదాని పొందుకోరన్నా భార్య కావాలనుకుంటాడు. అందులో రెండు నెలలనుంచి నీకు దూరంగా వున్నాడు. కనక కాస్త కరగచ్చు అతను"

"ఆయన జవాబు రాయకపోతే...?"

నిర్మల ఒక్క క్షణం ఆలోచించి "నీకక్కడ తెల్సినవాళ్ళెవ్వరూ లేరా? నీ ఫ్రెండ్సు, బంధువులు, ఇన్‌ఫర్‌మేషన్ ఇవ్వగలిగినవారు ఎవరూలేరా?"

విద్య ఒక్క క్షణం ఆలోచించి, "మాకు దూరపు బంధువు అయిన ఆంటీవున్నారు. అసలు ఈ సంబంధంగురించి చెప్పినది ఆవిడే. వాళ్ల ఇంటికి ఆయన తరచూవెళ్లే వారుట పెళ్లికిముందు. పెళ్లి అయ్యాక ఈయన వరస చూసి ఆవిడ నాతరపున మాట్లాడి ఆయన్ని మందలించిందని, ఆయన వాళ్లింటికి వెళ్లడం మానేశారు. ఆవిడ పాపం తనా సంబంధం సజస్ట్‌చేసినందుకు బాధపడి, నా మారీడ్ లైఫ్ ముందునుంచి అలా అయిందని నొచ్చుకునేది. నే వెళ్లేముందు ఆవిడకి చెప్పి వచ్చాను. 'సారీ అమ్మా, అతని లాంటి మూర్ఖుడు అనుకోలేదు. ఏదో మంచి చదువు, ఉద్యోగంవుందని, డబ్బు ఆస్తివున్న వాళ్లు అనిసజస్ట్ చేశాం, అని ఎంతో బాధపడింది"

"ఆవిడకి నీవువెంటనే ఉత్తరంరాయి. ఫోనుంటే కాంటాక్టుచెయ్యి...అతనెప్పుడు వెడుతున్నది, బొంబాయి ఎప్పుడు చేరేది, ఏ ఫ్లైట్లో వెడుతున్నది, అక్కడ ఏహోటల్లో వుండేది- అన్నీ కూపీలాగి నీకురాయమని రిక్వెస్టుచెయ్యి. ఆవిడ అర్థంచేసుకుంటుందిలే. నీ సంగతి అంతా తెల్సిన ఆవిడ కనక నీపని సులువు అవుతుంది. వెంటనే ఫోనుచెయ్యి.




విద్యా... సందేహించకు ఒక్కరోజు అతన్ని కలియడంతో నీభవిష్యత్తులో విచారించేరోజు రాకపోవచ్చు''

''విచారించాల్సిన రోజు రావచ్చుగదా - పోయినదాన్ని మళ్ళీకలుపుకుంటే జన్మంతా ఏడుస్తూ నన్ను తిట్టుకోవలసి రావచ్చేమో... సారీ! కోప్పడకండి ఆంటీ! ఫోను చేస్తాను ఇవాళ...చూద్దాం ఈ ఛాన్సూఇచ్చి'' అంది విద్యా నవ్వి.

★ ★ ★

బొంబాయి ఎయిర్‌పోర్టులో అడుగుపెట్టిన ప్రభాకర్ గుమ్మందగ్గర నిలబడి చెయ్యిఊపిన విద్యని చూసి తెల్లపోయాడు. అతనెప్పుడూ కలలోకూడా ఎదురుచూడలేదు విద్యని అక్కడ చూడగలనని. 'విద్య ఇక్కడెందుకు వుంది. ఎందుకు వచ్చింది. ఎవరికోసం వుంది. తన కోసం అయితే తనీ ఫ్లైట్లో వెళ్తున్నట్టు ఎలా తెలుసు' అరక్షణంలో అతనిలో లక్ష ప్రశ్నలు తలెత్తాయి. అతనికి తెలియకుండానే విద్యని చూడగానే ఒక్క సెకను అతని మొహంలో వెలుగువచ్చింది. ఆశ్చర్యానందాలు అరక్షణం అతని మొహంలో కదలాడాయి. అది విద్య దృష్టిని దాటిపోలేదు.

విద్య ప్రభాకర్‌ని చూసి రెండడుగులు ముందుకువేసి 'హలో' అంది నవ్వి.

ప్రభాకర్ మొహం టచ్‌మినాట్‌ని ముట్టుకోగానే ముడుచుకుపోయినట్టు ముడుచుకుంది. విద్యవైపు తీవ్రంగాచూసి తనని కాదన్నట్టు మొహం ముడుచుకుని చకచక అడుగులు వేసి లగేజ్‌కౌంటర్ వైపువెళ్ళాడు.

విద్య అతనివెంట నడుస్తూ- ''అదేమిటి... పలకరిస్తే మిమ్మల్ని కాదన్నట్టు వెళ్ళిపోతారేం?'' మనసులో కోపం, అవమానం కలిగినా వీలయినంతవరకు ఆ భావాలు కనబడకుండా లేని నవ్వు తెచ్చుకుని అంది.

ప్రభాకర్ మొహం చిట్లించి, ''నీతో మాట్లాడాల్సిన అవసరంనాకులేదు'' అన్నాడు.

''అదేమిటి... కట్టుకున్న పెళ్లాం విదేశాలు వెడుతున్న మొగుడికి సెండాఫ్ ఇవ్వడానికివస్తే మాటలవసరం లేదంటారేం? ఆరు నెలల దాకారారుగదా అని కష్టపడి ఇంతదూరం వస్తే

ఇదేం ట్రీట్‌మెంట్?''

"నిన్నెవడు రమ్మన్నాడసలు? ఎందుకొచ్చావు, ఎలా వచ్చావు? మొగుడు, కాపురం అక్కరలేనిదానికి మొగుడెక్కడికి వెడితే ఏంకావాలి? నీతో నాకు మాటలనవసరం! నీలాంటి పొగరుబోతుదానితో, నీలాంటి...నీలాంటి దానితో...నాకేం సంబంధంలేదు'' మొహం ఎర్రపరుచుకుని మాటలు తడబడగా కోపంగా అన్నాడు.

"ష్...ఎందుకలా అరుస్తారు. ఇది ఇల్లనుకున్నారా? పదండి... లగేజి సంగతిచూసి ఏదన్నా హోటల్‌కి వెళ్లిమాట్లాడుదాం. మీ ఫ్లైట్ తెల్లవారుజామునగదా! ఈలోగా మనం మాట్లాడుకోవచ్చు''

"నీతో నాకు మాటలనవసరం అని చెప్పాను. నీకూ, నాకూ ఏంసంబంధంలేదు'' తీవ్రంగా అన్నాడు.

"లేదంటే పోవడానికి, వద్దనుకున్నంత మాత్రాన సులువుగా తెగిపోవడానికి ఇదేం బొమ్మలపెళ్లి కాదు. మీరు నేను అక్కరలేదనుకుంటే, మీకూ నాకూ సంబంధంలేదనుకుంటే ఆ తతంగం అంతా కోర్టుద్వారా జరగాలి. అప్పటివరకు మీకు నేను భార్యని, మీరు నాకు మొగుడు'' విద్యకూడా కాస్త తీవ్రంగానే అంది.

ప్రభాకర్ చురచురచూశాడు. నాతో ఏంమాట్లాడాలి ఇక్కడే చెప్పు'' కోపంగా అన్నాడు. "కోర్టుద్వారా విడిపోవడానికి వస్తే నాతో మాటలక్కరలేదు. లాయరుద్వారా నోటీసుపంపు. ఉత్తరాలకి జవాబివ్వడం ఇష్టంలేనివాళ్లతో నాకేం సంబంధం వుంచుకోవాల్సిన అవసరంలేదు''

"ఉత్తరం మీరు రాస్తే తప్పకుండా జవాబు వచ్చేది. పెళ్లానికి ఉత్తరం రాయడానికి కూడా తండ్రి పర్మిషన్‌కోరే భర్తకి ఏ ఆడదీ జవాబివ్వదు - మీ నాన్నగారురాస్తే నాకూ మా నాన్నగారున్నారు కనక ఆయన జవాబిచ్చారు. ఉత్తరం రాస్తే జవాబివ్వనిది మీరుగాని నేనుకాదు. నేను ఉత్తరం రాసినా, జవాబివ్వకపోయినా మీరెప్పుడు వెడుతున్నదీ వీళ్లద్వారా వాళ్లద్వారా ఆరాతీసి వచ్చింది నేను. ఎందుకొచ్చాను... నా మొగుడుకనక వద్దనుకున్నా అంత సులువుగా ఈ సంబంధం పోదుగనక వచ్చాను. అర్థమైందా - ఇంకా నాతో మాటలాడాలని అనుకోకపోతే నేను వెడతాను...ఇలాంటి మొగుడితో నాకూ సంబంధం అక్కరలేదు'' తీవ్రంగా అంది.

ప్రభాకర్ మొహం బెట్టు సడలింది - ఏదో చెప్పబోయేంతలో కన్వేయర్ బెల్టుమీద తన లగేజి కనిపించి పెట్టెలు రెండూ తీసుకుని ముందుకు నడిచాడు. టాక్సీకోసం వెయిట్‌చేసినంతసేపూ ఏం మాట్లాడలేదు - విద్య ఓపిగ్గా అతనివంకచూస్తూ కోపం కంట్రోలుచేసుకుంటూ నిల్చుంది. టాక్సీ దొరకగానే విద్య ముందుగా తలుపుతీసి ఎక్కికూర్చుంది. ప్రభాకర్ విద్యవంక మింగేసేనట్టుచూసి టాక్సీడ్రయివరు ముందు సీను అవుతుందన్న భయంతో ఇంకేం మాట్లాడకుండా సూట్‌కేసులు రెండూపెట్టి తనూ ఎక్కాడు - టాక్సీకి హోటలుపేరుచెప్పాడు. టాక్సీదిగి, హోటల్ రూమ్‌కి వెళ్లేవరకు ఇద్దరిలో ఎవరూ మాట్లాడలేదు. హోటల్ రూమ్‌లోకి వెళ్లాక విద్యే చొరవగా బెల్లునొక్కి బాయ్‌ని పిలిచి కాఫీకి ఆర్డరిచ్చింది. ప్రభాకర్ బాత్‌రూంలోకి వెళ్లివచ్చి కుర్చీలో కూర్చుని టేబిల్‌మీది పేపర్ అందుకుని చదవడం మొదలుపెట్టాడు, విద్య ఆ గదిలో లేనట్టే.

విద్యకి ఎంత ఆపుకుందామన్నా ఆగని కోపంవచ్చింది. ఛర్రున అతని చేతిలోని పేపర్ లాగేసి పక్కనపడేసింది "ఏమిటి మీఉద్దేశం? నేనంత దూరంనుంచి వస్తే, ఏమిటిలా ట్రీట్‌చెయ్యడంలో మీఉద్దేశం... ఏమిటి?''

"మొగుడు, కాపురం అక్కరలేని భార్యతో మాట్లాడవలసిన అవసరం నాకులేదు. రెండు మూడునెలలయివెళ్లి, ఇన్నాళ్లు ఎందుకు రాలేదోముందు సంజాయిషీ ఇయ్యి - తరువాత మిగతా విషయాలు'' బింకంగా అన్నాడు.

"నేనెందుకు వెళ్లానో మీకు తెలుసు. నేనెందుకు రాలేదోకూడా మీ కుతెలుసు. తెలియకపోతే తెలియచెప్తూ ఉత్తరం రాశాను. నా అన్న పెళ్లికి వెళ్లడంతప్పా. దానికి కూడా మీ నాన్నగారి పర్మిషన్ కావాలా - నాకు మొగుడున్నాడు, ఆ మొగుడి అధికారం కాకుండా వీళ్లువాళ్లు నామీద జులుం చలాయిస్తే నేను




సహించను'' కొంచెం తీవ్రంగానే అంది విద్య.

''వాళ్ళూవీళ్ళూ ఎవరు... మాఅమ్మ నాన్న...నీ వాళ్ళు నీకు ఎంతో నావాళ్ళూ నాకు అంతే! ఇంటికి పెద్దవాళ్ళు సలహా ఇస్తారు. మంచీచెడ్డా చెప్తారు. వినకుండా నీవెవరు, నీవెంత అనే పొగరు నేను సహించను'' కోపంగా అన్నాడు.

''పెద్దవాళ్ళు మంచిచెడ్డా చెప్తే తప్పకుండా వింటాను... సలహా ఇస్తే ఆచరిస్తాను. అంతేగాని కోడలని జులుం చలాయించి, క్రుకెడ్‌గా దీన్ని అణగదొక్కి గుప్పిటలో పెట్టుకోవాలి అనుకుంటే నేను సహించను. అయినా ఎవరంత వాళ్ళు వాళ్ళయ్యాక, కొడుక్కు పెళ్ళయ్యాక, ప్రతిచిన్న విషయంలో జోక్యం కలిగించుకుని, వాళ్ళ విషయాల్లో వేలుపెట్టే పెద్దరికం అది పెద్దరికంకాదు - నిజంగా పెద్దవాళ్ళయితే వాళ్ళ గౌరవం వాళ్ళు నిలుపుకుంటే చిన్నవాళ్ళు గౌరవిస్తారు. అంతేగాని కూరకి, చీరకి, కుర్చీకి అన్నింటికి వాళ్ళ అధికారమే కావాలంటే నేనేకాదు ఏభార్యా సహించదు. అది మీరర్థం చేసుకోండి - మీరు కట్టుకున్న భార్య గౌరవం, అభిమానం కాపాడటం మీ ధర్మం. అది లేకపోగా మీవాళ్ళచేత నన్ను అవమానపరుస్తుంటే సహించడానికి నేనేం చీమునెత్తురులేని దాన్నికాదు''

''అంత అభిమానం, పౌరుషంవున్న దానివి పాపం కాళ్ళబేరానికి ఎందుకువచ్చావు? వెళ్ళు వెళ్ళు.. ఆత్మాభిమానం కాపాడుకుంటూ పుట్టింట్లో కూర్చో. ఆడదానివి నీకే అంత ఆత్మాభిమానం, పౌరుషంవుంటే మగాణ్ని నాకెంత వుండాలి'' వ్యంగ్యంగా ఎత్తిపొడిచాడు.

''ఓహో... ఆత్మాభిమానం, పౌరుషాలు మగవారి సొత్తుగాబోలు. ఆడదానికి అవి వుండకూడదన్నమాట''

''నీలాంటి ఇస్కో అంటే ఇస్కో అనేదానితో నాకు మాటలనవసరం. ఇక్కడకొచ్చి దెబ్బలాడవలసిన అవసరంలేదు. నాకు టైములేదు. నీవెళ్ళచ్చు ఇక్కడినించి. మాట్లాడవలసింది వుంటే కోర్టులో మాట్లాడుకుందాం'' నిర్లక్ష్యంగా, వ్యంగ్యంగా దులపరించాడు.

''కోర్టు కోర్టు అంటూ నన్నేం బెదిరించక్కరలేదు. కోర్టు, విడాకులు అంటే బెదిరి మీ కాళ్ళమీదపడి నాథా రక్షించు అనడానికి నేనేం చదువు సంధ్యలేని ఆడదాన్నికాదు. మీకు పెళ్ళాం అక్కరలేకపోతే నాకు మొగుడూ అక్కరలేదనగలను. నన్ను అనవసరంగా బెదిరించకండి'' తను వచ్చిన పర్పసే వేరు. అతనితో దెబ్బలాడాలని రాలేదు. అతనితో సామరస్యంకోసం వచ్చింది. ఆంటీ చెప్పిందంతా ఆక్షణంలో ఆచరణలోపెట్టాలంటే ఎంతకష్టమో అర్థమైంది- కోపం, ఆవేశం అదుపులోపెట్టాలని ప్రయత్నించి విఫలురాలైంది.

''నేనేం బెదిరించలేదు. కయ్యానికి కాలుదువ్వింది మీరు. అన్నపెళ్ళికి వెళ్ళిందానివి రెండునెలలు రాకుండా పుట్టింట్లో ఎందుకు కూర్చున్నావు కాపురం కావాల్సినదానివయితే'' సవాల్‌చేశాడు.

''ఇప్పటికి వందసార్లు చెప్పాను, ఇన్నాళ్ళు చదివినచదువు ఇంకో ఆరునెలలకోసం పాడుచేసుకోవడం నాకిష్టంలేదని. నా చేతిలో డిగ్రీ వుండాలని నా కోరిక. పెళ్ళికిముందే ఆ షరతు పెట్టాను. పరీక్షలయ్యేవరకు రానని చెప్పాను- ఉత్తరంరాశాను. ఇంకా ఎన్నిసార్లు చెప్పాలీ విషయం''

''పెళ్ళయ్యాక నాభార్య చదవాల్సిందీ లేనిదీ నిర్ణయించాల్సింది నేను. పరీక్షకి ప్రైవేటుగా చదవచ్చు అని చెప్పాను. నామాట అంటే అంత లక్ష్యంలేనిదాన్ని నేను సహించను. అంతగా చదవాలనివుంటే మా ఇంట్లో వుండి చదవాలని చెప్పాను. పెళ్ళయ్యాక ఆడదానిస్థానం అత్తింట్లోగాని పుట్టింట్లోకాదు''

''రెండుమూడు నెలలకోసం ఈ రెండేళ్ళు నష్టపోవాలా నేను? యూనివర్శిటీలు వేరు. మళ్ళీ సీటు అదీ మనంఅడగ్గానే ఇచ్చేస్తారా? ఈ హడావిడిలో ఈ ఏడాది నాకు వేస్టవుతుందన్నది కూడా చదువుకున్న మీకు అర్థంగాదా? ఏం... ఆడదాని చదువంటే అంత లోకువా మీకు- ఆడవాళ్ళు చదువుకుని ఉద్యోగాలుచేస్తున్నా ఇంత లోకువకట్టి, అణగదొక్కి, అథార్టీ చెలాయించి గుప్పిటలో పెట్టుకోవాలనుకుంటున్నారే. ఆ చదువు లేకపోతే. నా చేతిలో ఓ డిగ్రీ లేకపోతే మీలాంటి మొగుళ్ళు

ఇంకెంత హీనంగా చూస్తారో నాకు తెలుసుక నక. ఫ్యూచర్‌లో ఏదియేమైనా నా బతుకుతెరువుకి లోటుండరాదని నా చేతిలో డిగ్రీ వుండాల [illegible]షం తప్పా? ఒక నాలుగైదు నెలలకోసం ఇంత రాద్ధాంతంచేస్తారా?'' తీవ్రంగా అంది విద్య.

''ఉద్యోగం లేకుండానే ఇంత పొగరు నీకు, నీ చేతిలో నాలుగు డబ్బులుంటే ఇంక నీవేం కాపురంచేస్తావు'' వ్యంగ్యంగా ఎత్తిపొడిచాడు.

''ఆడదానిచేత కాపురం చేయించడానికి కావల్సింది [illegible] చదువు సంధ్యలు, ఉద్యోగాలు [illegible] కూర్చోపెట్టడంకాదు... ఆడది కాపురం చేయాలనుకోడానికి కావల్సింది కట్టుకున్నవాడి ఆదరణ, ప్రేమ, అభిమానం. అవి మగాడు ఇచ్చినరోజు నీ భర్త నీవాడే, నీకు అన్నింటా అండగా తోడునీడయి నిలుస్తాడు అన్న భరోసా భర్త ఇచ్చిననాడు ఆడది సర్వస్వం వదులుకుని ఆ కాపురం సంతోషంగా చేస్తుంది. కాపురానికి కావల్సిన పునాదులు. ప్రేమానురాగాలనే సిమెంటుతో; ఆదరణ, ఆప్యాయత అనే ఇటుకలతో కడితే ఆ కాపురం పదికాలాలపాటు పటిష్టంగా నిలుస్తుంది. పునాదులే గట్టికాకపోతే ఆ కాపురం నాలుగురోజులు నిలపదు. పునాదులులేని ఇల్లు పట్టుకుని ఏక్షణాన కూలిపోతుందో అని భయపడుతూ, బెంగపడుతూ కాపురం చెయ్యాలంటే — ఆ ఆడది అనుక్షణం ఆ ఇల్లు కూలిపోతే నాకేది దారి అనుకుని ఇంకో తలదాల్చుకునే చోటుకోసం వెదుక్కుంటుంది. ఏ ఇల్లు దొరక్కపోతే, ఏ ఇంట్లోనూ తనకి ఆశ్రయం దొరక్కపోతే ఎలా ఏం చెయ్యాలి, భవిష్యత్తేమిటి అనే బెంగతో, ఆ భవిష్యత్తు గురించి చింతతో వుంటుంది''

''లెక్చర్లుదంచకు, నీ వకాబ్లరీ నా దగ్గిరలేదు. సిమెంటు, ఇటుకలు ఆహాహా... కాపురానికి కావల్సింది సిమెంటు, ఇటుకలు అయితే గట్టిగా పునాదులు వేసిన రెండు బంగ్లాలున్నాయి మాకు'' వ్యంగ్యంగా అన్నాడు.

విద్య నిరసనగా అతనివంక చూసింది. ''అంతేలెండి... మీలాంటివాళ్ళకి ఇలాంటి మాటలకి అర్థాలు తెలియవు. మీకు తెల్సింది బంగళాలు, కార్లు, నగలు, లక్షలు! వీటన్నింటినీ మించిన సంపత్తి అనురాగం అనే ధనం ఒకటుందని మీలాంటి వారికి తెలియవు. ఆ అనురాగం, ఆప్యాయత లోపించిన వారు ఎన్నిలక్షలు, ఎన్ని బంగళాలు వున్నా ఏమీలేని బికారి అని మీకర్థంకాదు''

''ఈ ఉపన్యాసాలు చాలించు- ఇంతకీ తమరు ఎందుకువచ్చినట్టు? అసలు నేనిలావస్తున్నట్టు ఎలా తెలుసుకున్నావు. ఎలా కాపీ లాగావు...ఇలా దొంగలా''

''ఈ రెండునెలల్లో భార్య విలువ కొద్దిగా అయినా అర్థం అయివుంటుందన్న ఆశతో వచ్చాను. ఆరునెలలు మళ్ళీ కనబడరుకనక ఓ ఆరుగంటలైనా మీతో గడపాలని వచ్చాను. కాని మీకిలాంటి ఫైనర్ సెంటిమెంట్స్ అర్థంకావని ఇదివరకే తెల్సినా, ఏమూలో కొద్దిగా ఆశమిగిలి వచ్చాను. కట్టుకున్న మొగుడుకనుక మిమ్మల్ని కలవడానికి నాకెవరూ పర్మిషన్ ఇవ్వక్కరలేదు. దొంగతనంగా కలవాల్సిన గతి నాకేంలేదు. రావాలన్న మనసుందికనక ఎవరి ద్వారానో తెల్సుకుని వచ్చాను. నామొగుడుకి విదేశాలువెడుతూ వెళ్ళేముందు పెళ్ళాంమొహం చూడాలనిపించకపోయినా నేను వివాహబంధాన్ని గౌరవించి వచ్చాను. ఏం... ఇంకా ఏమన్నా అడగాల్సిందివుందా? సంజాయిషీ ఇవ్వాల్సింది ఏమన్నావుందా?'' చాలా తీవ్రంగా అంది విద్య లేచి నిలబడి.

ప్రభాకర్ మొహంలో బింకం కాస్త సడలింది.

''మీలో ఏదన్నా మార్పు వచ్చివుంటుంది అన్న ఆశతో వచ్చాను. ఆ ఆశ అడియాస అయింది. కట్టుకున్న భార్యమీద ఏమాత్రం ప్రేమవున్నా నేను రాగానే సంతోషించేవారు. అది మీలో కనబడలేదు. ఇంకా నేను వుండటం అనవసరం... వెళ్తున్నాను'' విద్య విసురుగా గుమ్మందగ్గరికి వెళ్ళింది.

ప్రభాకర్ మొహంలో అలజడి, గాభరా విద్య దృష్టిని దాటిపోలేదు. చటుక్కునలేచి గుమ్మందగ్గరకి వెళ్ళాడు. ''ఎక్కడికి వెళతావు ఈ వేళపుడు?''

''ఎక్కడికో, ఏదో హోటలుకి వెళతాను.




డబ్బుపారేస్తే లక్షహొటల్సు''

"ఈ రాత్రప్పుడు ఆడదానివి వంటరిగా హొటలుకెళ్ళి వుంటావా?"

"ఏం చేస్తాం... మొగుడుండి లేనివాడయితే ఆడది వంటరిగా ధైర్యంగా బతకడం నేర్చుకోవాలి. ఒకరోజుకి, ఒకరాత్రికి భయపడితే ఎలా? నాజీవితం అంతా వంటరిగా గడపవలసి వుంటుందేమో! ఇప్పటినుంచి అలవాటుపడితే మంచిదేగదా. వెడతాను... మళ్ళీ అలశ్యం అయితే ట్రాన్స్‌పోర్టు ప్రోబ్లమ్- గుడ్‌బై'' తలుపు తీసింది విద్య.

"ఆగాగు... ఎక్కడికి వెడతావు?'' గాభరాగా తలుపుకి అడ్డం వచ్చాడు ప్రభాకర్. 'చాల్లే నాటకాలు లోపలికిరా' చేయిపట్టి మోటుగా లాగాడు.

విద్య విదిలించుకుంటున్నట్టు నటించింది. "ఇదిగో ముందు లోపలికిరా... ఇలావచ్చి ముందీ సంగతి చెప్పు. సరే, నీపరీక్షలయ్యే వరకు వూరుకుంటాను. తరువాత వెంటనే బయలుదేరి మా ఇంటికి వెడతావా? నేను వచ్చేవరకు అక్కడ బుద్ధిగా వుంటానంటే జరిగిందంతా మరచిపోయి నిన్ను క్షమిస్తాను''

విద్య ముందు తగ్గిపోవడం నామోషీ అన్పించి లోకువవుతానేమోనన్న భయంతో అలా అన్నాడు- కాని నిజం చెప్పాలంటే విద్యని చూడగానే అతనికి తెలియకుండానే అతని బంధం సడలింది. విద్య అప్పటికంటే ఇప్పుడు మంచిరంగు వచ్చి నాజూకుగా, అందంగా కన్పించింది. కొత్త భార్యతో పట్టుమని రెండునెలలయినా కాపురం చెయ్యలేదు. రెండునెలల నుంచి స్త్రీ పొందు కోరుతుంది. అతని మనసు. రుచితెల్సిన ఆ అనుభవం కోసం అతని శరీరం ఆరాటపడ్తూంది. అది పైకి తెలిసిపోతే విద్య దగ్గిర లోకువయిపోతానేమోనన్న భయం ఒకపక్క, మరీ గట్టిగా మాట్లాడికేకలేస్తే విద్య వెళ్లిపోతుందేమోనన్న భయం ఓ వైపు వున్నా, అతని మనసు శరీరం రెండూ కల్సి అతన్ని ఓడిపోయేట్టు చేశాయి. పైకి ఏదో షరతులు పెట్టినా, విద్య ఊ అనకపోయినా లొంగిపోవడానికి సిద్ధంగా వున్నాడు. విద్య పొందుకోసం అతని శరీరం తొందరపెడ్తూంటే ఆరాటంగా ఏదో అన్నాడు. తనచేయి పట్టుకు లాగినపుడు అతని మొహంలో కనబడిన కోరిక విద్యకి స్పష్టంగా తెల్సింది. అతని చేయి వదిలించుకుంటున్నట్టే కాసేపు పెనుగులాడి, "వదలండి నన్ను... నేనేం వాగ్దానాలు చెయ్యను, చెయ్యలేను. మీరు ప్రేమతో శాసిస్తే నరకానికి వెళ్ళమన్నా వెడతాను కాని ఇలా కాదు- నాకు నాభర్త ప్రేమ అభిమానం ఆదరణ దొరికిననాడు మీరేం చెప్పక్కరలేకుండానే అన్నీ చేస్తాను. నన్ను వెళ్లనీయండి''

"ఊ..చాల్లే బెట్టు. రాలోపలికి ముందు. ఈరాత్రి వంటరిగా ఏదో హొటలికి వెళ్లి వుంటావా... చాల్చాలు రాముందు'' అంటూ విద్యను లోపలికి లాగి తలుపువేసి ఆమెను కౌగిలిలో బంధించాడు ఆరాటంగా.

★ ★ ★

"చూశావా... నే చెప్పలేదూ! మగాడి బలహీనతని మనం క్యాష్ చేసుకోవాలని. ఆ సమయంలోనే నొక్కి పట్టాలి- దానికి లొంగని మగాడుండడు''

విద్య బొంబాయి నించి వచ్చి జరిగిందంతా చెప్పింది నవ్వుతూ- "ఆంటీ... ఆయన సంగతి చూస్తే భలే నవ్వు వచ్చింది. ఆయనకి పెళ్లాంకావాలి ఆక్షణంలో. ఆడది కావాలి. ఇంకో ఆడదాని దగ్గిరకెళ్లే సాహసం ఆయనకు లేదు. పరువుకోసం, ఎవరేం అనుకుంటారో అంటారో అనే పిరికితనం వున్నవాడు పరాయి ఆడదాని దగ్గిరకి వెళ్లలేడు. ఆయన ఎలాంటివారయినా, గుడ్డిలో మెల్ల అన్నట్టు ఇలాంటి అలవాట్లు లేవు. ఆ చొరవలేదు ఆయనలో. అంచేత పాపం ఆవురావురుమని వున్నారేమో నన్ను ఆక్షణం వదలడం ఇష్టంలేదు ఆయనకి. అలా అని లొంగిపోతే నేను లోకువ కడ్తానేమోనని భయం. ఆయన మొహం చూడాలి అప్పుడు- ముప్పుతిప్పలు పెట్టి, పాతవన్నీ ఎత్తి దెప్పి, సంజాయిషీలు అడిగి ఆఖరికి లొంగినట్టు నటించాను'' విద్య నవ్వుతూ అంది.

"ఆ కాస్తా అయ్యాక మళ్లీ సాధింపు మొదలుపెట్టారా? షరతులు ఏమన్నా పెట్టాడా మళ్ళీ?''

"ఆ! పరీక్షలు అయ్యాక మా ఇంటికి




వెళ్లాలి సుమా... మా అమ్మా నాన్నవాళ్లకి నీమీద చాలా కోపంగా వుంది. నేను వచ్చేసరికి నీవక్కడ వుండి పాచప్ చెయ్యాలి'' అని అన్నారు.

''మీరు లేకుండా నేనక్కడ వుండను బాబూ! నాకక్కడ ఏమిటోలా వుంటుంది. మీరువచ్చాక వస్తాను. నాకు భయంబాబూ... మీ నాన్నగారంటే'' అంటూ గొణిగాను.

''ఏం... నిన్నేం రాళ్లెత్తమన్నారా అక్కడ? నీవు పెడసరం జవాబులు చెప్పకుండా బుద్ధిగా వుంటే ఎవరేం అంటారు?''

''అబ్బ... చూద్దాం లెద్దురూ! ఇంకా మూడు నెలలుందిగా నా పరీక్షలవడానికి. ఈ మంచి మూడులో ఆ గొడవలు అన్నీ ఎత్తకండి. ఆరు నెలలు వెళ్లిపోతున్నారు. ఇప్పుడు పెళ్లాంతో మాట్లాడవలసినవి ఇవా? మీకసలు రొమాన్సు అన్నదితెలీదు'' అన్నాను.

''అబ్బో... ఫరవాలేదు తెలివయినదానివే. ఏదీ కమిట్ అవకుండా నెమ్మదిగా పనిజరిపావు. ఇంకో మూడునెలల పర్మిషన్ దొరికిందిగా. పరీక్షలయ్యాక నెమ్మదిగా చూడచ్చు- ఈ లోపల ఇంకేం మనసులో పెట్టుకోకుండా చదువుమీద కాన్‌సన్‌ట్రేట్ చెయ్యి'' అంది నిర్మల నవ్వుతూ.

★ ★ ★

విద్యశ్రద్ధగా చదివి అన్ని సబ్జెక్టులూ బాగానే రాసింది. పరీక్షలు ముగిసిన నాలుగు రోజుల తర్వాత --

''ఆంటీ... మావారి నించి ప్రేమలేఖ వచ్చింది... చూస్తారా?'' ఓ మధ్యాహ్నంపూట ఉత్తరం పట్టుకుని వచ్చింది విద్య.

''నిజంగానా.... ప్రేమలేఖ అయితే నాకెందుకులే చూపించడం- తీపి గుర్తుగా దాచుకో''

''ఆ మనిషికి ప్రేమలేఖ రాయడం కూడా వస్తే ఇంకేం? ఇదిగో...చదవండి మీకే తెలుస్తుంది. ఆయనలో ఏ కోశానా రొమాన్సు, సున్నితం, ఎమోషన్సు గట్రా ఏమన్నా వున్నాయేమో, ఈ ఉత్తరంలో ప్రతిఅక్షరం వెనకా ఏమన్నా వెతికితే కనిపిస్తాయేమో చూడండి. ఇలాంటి మనిషితో ఇంకో ఏభైఏళ్ళు ఎలా బతకాలో ఆలోచిస్తే భయం వేస్తోంది.

నిర్మల ఉత్తరం అందుకుని తెరిచింది-

''డియర్ విద్యా... ఈపాటికి నీ పరీక్షలయి వుంటాయి. నీ పరీక్షలవగానే నీవు బయలుదేరి మా'వూరు వెళ్ళవలసింది. నేను వచ్చేవరకూ నీవక్కడ వుండాలి. మా నాన్నగారికి కూడా రాశాను నీవు వచ్చి వుంటావని. నేను కూడా క్షేమం- నా కోర్సు ఇంకో రెండు నెలల్లో పూర్తి అవుతుంది. ప్రస్తుతం అంతచలిలేదు, ఇంతే సంగతులు- నీవు వెంటనే బయలుదేరి వెళ్ళవలెను''.

''హు... విదేశాల్లో వున్న మొగుడు కొత్త పెళ్ళానికి రాసిన ఉత్తరం- ఏ మాత్రం సరసంతో వున్నా ఇలా పొడిగా రాస్తాడా! ఆయనకి నేను వాళ్ళింటికి వెళ్లడం కావాలి అంతే! దానికోసం ఈ రెండు లైన్లన్నా రాశారు. లేదంటే అదీ రాసేవారు కాదు'' ఉక్రోషంగా అంది.

ఆ అమ్మాయి మనసు ఎంత హర్ట్ అయిందో నిర్మలకి అర్థం అయింది. తను విద్యకి ఒక ఛాన్సు ఇచ్చి చూడమని తప్పు సలహా ఇవ్వలేదుగదా అని మధనపడింది. విద్య అన్నట్టు, ఇలాంటి మనుషులు మారతారా అసలు?

''విద్యా.... ఈ ఇనుము కరగడానికి చాలా టైము పట్టేట్టు వుంది. కాల్చి, సమ్మెటలతో కొట్టి సాగదీస్తేగాని మనకి కావల్సిన ఆకారంరాదు విద్యా! చాలా శ్రమే... ఒప్పుకుంటున్నాను. కాని అంత సులువుగా ఓడిపోవడం నాకిష్టంలేదు. ఎలాగో సగందాకా వచ్చావు- ఇంకాస్త ఓపికపట్టు, నీకు కావల్సిన ఆకృతిలో మార్చుకోవచ్చునేమో ప్రయత్నించు. అతను ఫారిన్ నించి వచ్చాక ఓ నెలో రెండు నెలలో కాపురం చేసి చూడు. అప్పటికీ మార్చుకోలేననిపిస్తే నీవు ఎన్నుకున్న దారివుండనే వుంది. సారీ విద్యా... ఇతను మరీ ఇంత మూర్ఖుడు అనుకోలేదు''

''ఇంతకీ ఇప్పుడు నన్ను అక్కడికి వెళ్ళమని చెప్పరుగదా. అక్కడికిమాత్రం చచ్చినా వెళ్ళను నేను ఆయన లేకుండా. ఆ ఇంట్లో వుండాలంటే కంపరంగా వుంటుంది నాకు''

''ఇప్పుడు వద్దులే- ఉత్తరానికి మాత్రం ఆ విషయం ఎత్తకుండా మిగతా సంగతులు

అన్నీ రాసి పడేయి. నీవు కాస్త ప్రేమ కురిపించి - ఉత్తరం అంటే ఇలా రాయాలి మూర్ఖుడా అని తెలియజెప్పు. అతను వచ్చాక ఏవో సాకులు చెప్పచ్చు. నాకు జ్వరం వచ్చింది-తగ్గాక వెడదాం అనుకుంటే, వరసగా అందరం మంచాలు పట్టాం- రిజల్ట్సు వస్తున్నాయని వెయిట్ చేశాను- మా పిన్నికూతురు పెళ్ళి వచ్చింది ఈలోగా.... మా అమ్మా నాన్న తీర్థయాత్రలకి వెడుతూ ఇంట్లో ఎవరూ లేరని వుండమంటే వుండిపోయాను అంటూ ఏవో సాకులు చెబుదువుగానిలే. ఇంకో రెండు మూడు నెలలు ఏదో సాకులు చెబుతూ ఉత్తరాలు మాత్రం రాసిపడేస్తూవుండు. తరువాత సంగతి ఆలోచిద్దాం'' భుజంతడుతూ అంది. విద్య మొహంలో కళ లోపించి, చిన్నబోయినట్టుంది. కొత్తగా పెళ్ళి చేసుకుని, హాయిగా ఆనందంగా వుండాల్సిన రోజుల్లో ఈ కలతలు, టెన్షన్స్ అవి ఆ అమ్మాయి మీద ఎంత పనిచేస్తున్నాయో అర్థంఅయి నిట్టూర్చింది నిర్మల.

★ ★ ★

రెండు నెలలు ఏ మార్పు లేకుండా గడిచిపోయాయి. విద్య పదిహేను ఇరవై రోజులకో ఉత్తరం రాసి పడేస్తూంది మామూలు సంగతులతో. అతనినించి మళ్ళీ ఉత్తరం రాలేదు విద్యకి. తను అత్తవారింటికి వెళ్ళనందుకు అతనికి కోపం వచ్చిందని గ్రహించింది విద్య. ఈ నెలలో రావాలి అతను. ఎప్పుడొస్తాడో.... ఎలా ఎదుర్కోవాలో అని మనసులో బెరుకుగా, బెంగగా అనీజీగా వుంది విద్యకి. నిర్మల ధైర్యం, ప్రోత్సాహం లేకపోతే ఈ గొడవంతా నాకొద్దు బాబూ, ఈ టెన్షన్స్ కంటే నా భవిష్యత్తు నాశనమై నేను వంటరిగా వున్నా సంతోషమే. ఎప్పటిమాటో దేముడెరుగు ప్రస్తుతం ఈ టెన్షన్ నేను భరించలేను - అని రోజూ అనుకునేది. ఆమెలో దిగజారిపోతున్న ధైర్యాన్ని అనుక్షణం ఎగదీస్తూ నిర్మల సలహాలు ఇచ్చి ధైర్యం చెప్పబట్టి విద్య ఆ పరిస్థితిని ఆ మాత్రం తట్టుకుని నిలబడగల్గింది.

''చూశారా ఆంటీ... ఆయన ఇండియా వచ్చేశారుట. నాకో ఉత్తరం అన్నా రాయలేదు. మీరెప్పుడు వచ్చేది వస్తే బొంబాయి వచ్చి రిసీవ్ చేసుకుంటాను అని రాసినా రాయలేదు. అప్పుడే వచ్చి పదిరోజులు అయిందిట. ఆయన అన్నదాని ప్రకారం ఈనెలాఖరుకి రావాలికాని ముందుగా వచ్చేశారు. నాకు ఆయన ఉత్తరం రాయలేదు. ఆ వూర్లో నేను చెప్పిన ఆంటీకి ఫోనుచేసి ఆయన ఇండియా ఎప్పుడు వస్తున్నది తెల్సుకుని రాయమంటే, ఆవిడ ఆశ్చర్యంగా 'అదేమిటి... ప్రభాకర్ వచ్చేశాడు నీకు తెలియదా? పదిరోజులయిందే అప్పుడే' అంది. 'మావారికి కనిపించాడట, ఎప్పుడొచ్చావని పలకరిస్తే పదిరోజులయింది అన్నాడట. విద్య వచ్చిందా అంటే జవాబివ్వకుండా వూరుకున్నాడట'

అంటూ ఫోనులో మాట్లాడింది ఆవిడ - చూశారా ఆంటీ, ఆయన తత్వం. నేనంత రాసినా ఆయన నాకు ఇండియావచ్చినదైనా రాయలేదు. ఆయన మాటవినలేదని కోపం...'' ఆవేశంగా, ఆదుర్దాగా వగరుస్తూ అంది.

''సరే.... వచ్చేశాడుగా. నీవు ఏం జరగనట్టు బయలుదేరి వెళ్లు. ఎందుకెళ్లలేదని నిలేస్తే ఉత్తరాల్లో రాసిన సాకులుచెప్పు - కాస్త సౌమ్యంగా. నిజం చెప్పాలంటే మీరు లేకుండా అక్కడికి వెళ్లాలంటే భయంవేసిందండి. ఇప్పుడు మీరు వచ్చారుగా కావలిస్తే వెళ్లొద్దాంపదండి అంటూ నచ్చచెప్పు''

''ఆంటీ... నాకు భయంగావుంది. చూడండి నాపళ్ళు ఎలా కొట్టుకుంటున్నాయో. నాకొద్దు ఆంటీ ఈ కాపురం. ప్లీజ్... నాకింక పోరాడే ఓపికలేదు. నన్ను వదిలేయండి ఆంటీ. నాకు ఏదో చెప్పి పిరికిమందుపోయకండి. నేను వెళ్లలేను... వెళ్లలేను. ఈ బాధలు నాకొద్దు... వద్దు!'' హఠాత్తుగా విద్య చిన్నపిల్లలా ఏడవడం మొదలుపెట్టింది-

నిర్మల ఏం మాట్లాడాలో అర్థంకాక ఏడుస్తున్న విద్యవంక చూస్తూండిపోయింది. ఇంతలా బెదిరిపోయి, భయపడి ఏడుస్తున్న విద్య ఏం కాపురం చెయ్యగలదు? ఎన్నాళ్లు ధైర్యంగా పరిస్థితులని ఎదుర్కోగలదు? తనవసరంగా ఈ గొడవని ఇంతదూరం లాక్కొచ్చిందా? వాళ్లూ వాళ్లూ ఏదో డిసైడ్ చేసుకునేవారేమో




తనుమధ్యలో కల్పించుకోకపోతే? ఇంత ఇష్టంలేని పిల్లచేత ఏం కాపురం చేయించగల రు ఎవరన్నా? కాని ఇంతదూరం తీసుకొచ్చి, ఇన్నాళ్లు ధైర్యంచెప్పి తీరా సమయం వచ్చేస రికి తనూ వెనక్కి లాగితే ఇంకేం ప్రయోజనం? విద్యకి ఈ ఒక్కసారి ధైర్యం చెప్పివంపితే ఏదో ఒకటి తేలిపోతుంది- ''చూడువిద్యా... చదు వుకున్నదానివి, ఏమిటింత అధైర్యపడ్తున్నావు! ఈసారి వెళ్లి పదిరోజులుండి ఇటో అటో తేల్చు కుని వచ్చేయి-ఏం చంపడుగదా! అంత భయపడటానికి ఏముంది! ఒక్కపది పదిహే ను రోజులు ఓపికపట్టి శాంతంగా, సౌమ్యంగా వ్యవహరించి, అతనిమాట కాదనకుండా, అత ను ఏమన్నాడూ అంటూ అంగీకరిస్తూ గడి పిచూడు. నీవు లొంగగానే అతను మారిపోతే మంచిదే. కొన్నాళ్లు నీవు లొంగినట్టు నటించి ఆతరువాత అతన్ని గుప్పిటలో క్రమంగా బిగించవచ్చు. నీవు మంచిగావున్నా, అతనితో అన్నింటా సహకరించినా మారకపోతే ఇంక అతని ఖర్మ. ఒక్కనెలరోజులు వెళ్లివుండు. విద్యా... మంచికో చెడ్డకో నేను నీ జీవితంలో పాత్రనయ్యాను. ఆరునెలలనించి ఈ బంధంతెగిపోకుండా నీకు ధైర్యాన్నిచ్చాను. ఇన్నాళ్లు నీవనుభవించిన టెన్షన్, ఇన్నాళ్ల ఆరాటం, ఇన్నాళ్లు పడినశ్రమ వృధాపోనీ యకు. కష్టపడి ఏడాదంతా చదివి పరీక్షకి కూర్చోకపోతే ఏంలాభం విద్యా? ఆ పరీక్షలో నెగ్గావు పట్టుదలతో- ఇపుడిది ఇంకా నీకు పెద్ద పరీక్ష. నీవు ఓడిపోవడం నాకిష్టంలేదు విద్యా! నాకోసమైనా, నిన్నిందులో దింపి నీకు సలహా ఇచ్చినందుకైనా ఒక్కసారి వెళ్లిరా- నీ కాపురం నిలబెట్టానన్న తృప్తి ఆనందం నాకు దక్కు తుందేమో! అందుకోసమన్నా నాతో సహక రించి వెళ్లు'' భుజంతట్టి అంది.

విద్య కళ్లుతుడుచుకుని, ''ఆంటీ-ఒంట రిగా వెళ్లాలంటే భయంగావుంది. అమ్మని తీసుకెళ్లనా?''

''వద్దొద్దు... ఆ పనిమాత్రం చెయ్యకు. మీవాళ్లని చూసి అతనికి తిక్కరేగుతుంది. వాళ్లముందు తగ్గిపోవడానికి ఇష్టపడక మరింత బిగుసుకు పోతాడు. నీవు ఒక్కర్తివే వెళ్లాలి. ఇది నీ అంతట నీవు పరిష్కరించుకోవల్సిన సమస్య. ప్లీజ్... లే, ధైర్యంతెచ్చుకో. వెళ్లి ఈ పరీక్షరాసి

పాసయిరావాలి. ఇది నాకోరిక, అభ్యర్థన. నీవు రేపేవెళ్లాలి... వెళ్తున్నావు'' అంటూ విద్యని లేవదీసి, ఆమె కన్నీరు తుడిచి భుజంచుట్టూ చెయ్యివేసి గేటుదాకా సాగనంపింది నిర్మల.

★ ★ ★

ఉదయమే రైలుదిగి ఇంటికివెళ్లింది. బెల్ కొట్టగానే తలుపుతీశాడు నిద్రకళ్లతోనే, పనిమనిషి అనుకుని. విద్యని చూడగానే అతని మత్తు అంతా దిగిపోయింది. విసురుగా తలుపు మూయబోయేంతలో అది గ్రహించి విద్య సూట్‌కేసు తలుపుమధ్య ముందుపెట్టి తలుపుకాస్త బలంగాతోసి లోపలికి వెళ్లి సూట్‌కేస్ గదిలోపెట్టింది.

''ఎందుకొచ్చావు... ఎందుకొచ్చావు ఇక్కడికి? వెళ్లవతలికి! నీకు నాకు సంబంధం ఏంలేదు ఇంక'' మాటలు తడబడగా కోపంగా అరిచాడు.

''ఏమిటి పాతపాటఎప్పుడూ... ఎందుకొచ్చావేమిటి? నా మొగుడు దగ్గరకి నేనొచ్చాను, నా ఇంటికి నేను వచ్చాను'' విద్య నిర్లక్ష్యంగా నవ్వి అంది.

''నీ మొగుడు, నీ ఇల్లు'' పళ్లబిగువున కటువుగా అన్నాడు. ''నీకు మొగుడు, ఇల్లు అన్నభావనవుంటే ఆ మొగుడు మాటఅంటే అంత నిర్లక్ష్యమా? నీకు ముందేచెప్పాను, నా మాటమీద గౌరవంవుంటే నేను చెప్పినట్టు చేసేదానివి. నా మాటంటే లెక్కలేనిది నాకు పెళ్లాంగా అక్కరలేదు. గో ఎవే ఫ్రమ్ హియర్''

''మీకు మీమాటేగాని ఇతర్లు చెప్పేది వినరు. పరీక్షలవగానే వెళ్దాం అనుకునేసరికి నాకు టైఫాయిడ్ - ఇరవై రోజులు గడిచిపోయాయి. తరువాత మా అమ్మ బాత్‌రూములో కాలుజారి పడి కాలువిరిగినంతయి నెలరోజులు నడవలేకపోయింది. ఇంట్లో ఆడవాళ్లెవరూ లేకుండా వదిలి ఎలావెళ్లను. ఆతరువాత మానాన్నగారికి ఒకరోజు గుండెల్లో నొప్పివచ్చి హడావిడి అయి హాస్పిటల్లో చేర్చాం - ఆహడావిడి కొన్నాళ్లు. ఇలా ఎప్పటికప్పుడు ఏదో ఆటంకం వచ్చింది - నేనసలు నిన్న బయలుదేరి మీ ఇంటికి వెళ్లాలనుకున్నాను. మీరు రావడానికింక పదిరోజులుందిగదా, ఆ పదిరోజులు అక్కడుందా మనుకున్నాను. కాని మీరిలా ముందుగా వచ్చేస్తారని నాకేంతెలుసు. నిన్న ఆంటీ ఫోనులో చెప్పగానే ఆ టిక్కెట్టు మార్చుకుని ఈ టికెట్టు కొనుక్కుని పరిగెత్తి వచ్చాను. మీకు చెప్పకుండా వచ్చేసి ప్లెజెంట్ సర్‌ప్రైజ్ ఇవ్వాలని వస్తే మీరెప్పుడూ ఇంతే! నా ఆనందంమీద నీళ్లు చిలకరిస్తేగాని మీకు తృప్తిగా వుండదు. నేనెంత ఆరాటంగా పరిగెత్తి వచ్చానో తెలుసా?''

ప్రభాకర్ మగఅహం ఆ జవాబుతో కాస్త తృప్తిపడింది - కాని తగ్గిపోవడం నామోషి అన్పించింది. ''నీమాటలు నమ్మేంత వెర్రివాడినికాను. నీ కల్లబొల్లి కబుర్లకి పడను నేను''

''నమ్మకండి. అయినా నిజం చెప్పినా అర్థంచేసుకోకపోతే నేనేం చేస్తాను''

ప్రభాకర్ నోరుతెరిచి ఏదో అనబోయేంతలో పనిమనిషి లక్ష్మి తలుపు తీసుకుని లోపలికి వచ్చింది.

విద్యని చూడగానే చాటంత మొహంచేసుకుని... ''అమ్మయ్య, ఎన్నాళ్లకి వచ్చారమ్మగోరూ! ఏటండి, ఎల్లడం ఎల్లడం ఇన్నాళ్లెల్లిపోనారు. బాబు ఎంత ఇబ్బందిపడ్తున్నాడమ్మా భోజనానికి! ఇంటి ఇల్లాలులేకపోతే ఇల్లేటమ్మా వల్లకాడుగాని. సూడండి... ఇట్లా మీరొచ్చారు, ఎంత కళొచ్చింది ఇంటికి. అయ్యగారూ అమ్మగారినీపాలి ఎల్లనీయకండి అసలు'' చనువుగా గలగల మాట్లాడింది సంబరంగా.

ప్రభాకర్ మొహంముడుచుకుని పనిమనిషి ముందు ఏం మాట్లాడాలో తెలియక బాత్‌రూములో దూరాడు. విద్య చనువుగా పనిమనిషి వెనక వంటింట్లోకి వెళ్లింది. లక్ష్మి పాలపాకెట్టు కత్తిరించి పాలుగిన్నెలోపోసి స్టవ్‌మీద పెట్టింది. ''అయ్యగారికి నేనే కలిపేసి ఇస్తానండి రోజూ! అయ్యగారికి కాఫీ కలుపుకోడం కూడా తెలీదండి. టిఫిన్ హొటలుకాడ నించి తెచ్చేదాన్ని. భోజనం ఎక్కడెక్కడ తినేవారో తెలీదండి. ఇంక మీరొచ్చినారు నాకు హాయి'' నవ్వింది.

విద్య వాష్‌బేసిన్ దగ్గిరమొహం కడుక్కు వచ్చేసరికి లక్ష్మి ఫిల్టర్‌లో నీళ్లుపోసి, పాలుకాచి పెట్టింది. ''అయ్యగోరికి మీచేత్తో కలిపి

ఇయ్యండమ్మా ఇయ్యాల'' ముసిముసినవ్వు లు నవ్వింది లక్ష్మి.

విద్యనవ్వి ''అలాగేలే - నీవు వెళ్లి ఇల్లు అది ఊడ్చు. తరువాత బట్టలుతుకుదువుగాని నేను స్నానంచేశాక'' అంది.

విద్యకాఫీ కలిపి రెండుకప్పుల్లో పోసి గదిలో కి తీసుకెళ్లింది. ప్రభాకర్ పేపరు మొహానికి అడ్డంపెట్టుకు కూర్చున్నాడు - 'ఇదిగో కాఫీ తాగండి' అంది చనువుగా.

'అక్కడపెట్టు' విసురుగా అన్నా నెమ్మదిగా అన్నాడు పనిమనిషి వింటుందని.

''ఊహు... నేనందించినది మీరందుకుంటే ఎంత రుచిగా వుంటుందో తాగిచూడండి'' అంటూ పేపరు లాగిపక్కన పడేసి అతని కళ్లల్లోకి నవ్వుతూ చూస్తూ కప్పు అందించింది.

ప్రభాకర్ గుర్రుమని చూస్తూ కప్పు లాక్కు న్నట్టే అందుకున్నాడు. విద్య నవ్వుతూ అక్కడే మంచంమీద కూర్చుని కాఫీ తాగడం మొద లుపెట్టింది.

''ఏమిటి మీ ఫారిన్ ట్రిప్ విశేషాలు? ఏమేం ప్రదేశాలు చూశారు... చుట్టుపక్కలన్నీ వెళ్లొ చ్చారాలేదా? ఏం మనుమలండీబాబూ... ఓ పిక్చర్‌కార్డ్ అన్నా పెళ్లానికి పంపించాలని పించలేదా?''

ప్రభాకర్ మింగేసేట్టు చూశాడు విద్యని - పనిమనిషివుంది లేకపోతే నీపనిపట్టేవాణ్ణి అన్నట్టు పళ్లు కొరుక్కున్నాడు. విద్య అది గమనించి మనసులో మండిపడినా అది పైకి కనిపించనీయకుండా ''ఈ పూటకి బయటికె ళ్లి భోంచేద్దామా... లేకపోతే ఆదివారమేగా, సామాన్లు తీసుకొస్తే వండుతాను. పాపం ఇంటి భోజనంతిని ఎన్నాళ్లయిందో... వంట ఎంత సేపు? పదండి అలా వెళ్లి కాస్త కాస్త సామాను, కొంచెం కూరలు తెచ్చుకునివద్దాం''

''నీవేం వండక్కరలేదు, నాకు క్యారియర్ వస్తుంది'' పెడసరంగా అన్నాడు.

''మీకు క్యారియర్ వస్తుంది సరే, నన్నుప స్తుండమన్నారా ఏమిటి? అలా మాట్లాడుతారే మిటి? పోనీలెండి నేనే వెళ్లి తీసుకొస్తాను సామా న్లు, లక్ష్మిని తీసుకొని-'' మనసులో ఉక్రోషం, కోపం తన్నుకొస్తున్నా అతిబలవంతంగా ఫీ లింగ్స్ అదిమిపెట్టి అంది విద్య

ఊఁ ఆ అనకుండా వూరుకున్నాడు.

లక్ష్మిని తీసుకొని బజారువెళ్లి నాలుగు రోజు లకి సరిపడ కూరలు, బియ్యం పప్పులు అవికొంది.

ఇంటికెళ్లి లక్ష్మి సాయంతో వంటపూర్తి చేసింది విద్య. ప్రభాకర్‌కి ఏమేం ఇష్టమో జ్ఞాపకానికి తెచ్చుకుని చాలా శ్రద్ధగా వండింది. లక్ష్మి పని అయిపోయాక వెళ్లింది - ఇద్దరికీ వడ్డించి ప్రభాకర్‌ని పిలిచింది విద్య.

''నిన్నెవరు వండమన్నారు - హోటల్లో భోంచే స్తానని చెప్పానుగా'' లక్ష్మి వెళ్లిపోయిందని తెలిసి కటువుగా అన్నాడు.

''ఇంట్లో నేనుండగా హోటలు భోజనం ఎందుకు. ఇన్నాళ్లు తిన్నారు చాల్లెండి - రండి రండి వడ్డించేశాను. అన్నీ చల్లారిపోతు న్నాయి. మీకిష్టమని వంకాయ కొత్తిమిరి కారం పెట్టి వండాను. ముక్కల పులుసు చేశాను--'' అతని ధోరణికి తినకపోతే గోటుహెల్ అనాలని పించినా అతికష్టంమీద తనని తను అదు పులో పెట్టుకుంటూ అంది.

''ముందీ సంగతి చెప్పు... నీకసలు నాతో కాపురం చేసే ఉద్దేశం వుందా లేదా--''

''వుంది కాబట్టే వచ్చాను. అది మళ్లీ వేరేచె ప్పాలా'' అణిచినా అణగని కోపంతో వాడిగా అంది విద్య.

''అయితే ఒక సంగతి గుర్తుంచుకో - నీవు ఇక్కడ వుండాలంటే నా ఇష్టం వచ్చినట్టు వుండాలి. నీ ఇష్టం వచ్చినట్లుండడానికి నేను వప్పుకోను - ఈ ఇంట్లో నా మాటకి ఎదురు తిరిగితే సహించను. నన్ను నావాళ్లని గౌర వించని వాళ్లకి నా దగ్గరచోటులేదు-'' విద్య బొంబాయి రావడం, ఆ తరువాత ఉత్తరాలు రాయడం, మళ్లీ ఇక్కడికి రావడంతో విద్య కాళ్ల బేరానికి వచ్చిందని మనసులో సంతోషించి, ఆమె ఏంఅన్నా కోపం తెచ్చుకుని పొగరుగా జవాబివ్వకపోవడంతో, ఇదే సమయం విద్య మీద అధికారం చెలాయించి తన ఆధిక్యత చూపాలనుకున్నాడు.

విద్య ప్రభాకర్‌వంక సూటిగా చూసింది. ''చూడండి... మీరు నాకు భర్త - నామీద మీకు

అధికారం వుంది - కాని ప్రేమతో విషం తాగించగలరు కాని తిట్టికొట్టి అమృతం అన్నా తాగించలేరన్న సామెత తెలుసుగదా - కట్టుకున్న భార్య తన మాట వినేట్టు చేసుకోడం మగాడిపని - ప్రేమగా లాలనగా చెప్తే వినని భార్య వుండదు - నన్ను ఇలా అలా అని శాసించేముందు అది మీరు గుర్తిస్తే మంచిది--'' వెళ్లునకొట్టినట్టే అంది.

ప్రభాకర్ మొహం కోపంతో ఎర్రబడింది- ''అంటే... అంటే ఏమిటి నీ ఉద్దేశం...'' రెచ్చిపోతూ ఎగిరాడు.

''ఇదే...ఇదే నేను చెప్పదలచింది - భార్య ఆరునెలల తరువాత జరిగిందంతా మరిచి కాపురానికివచ్చి ప్రేమగా అన్నంవండి భర్తకి పెట్టాలని పిలిచినపుడు మాట్లాడవలసింది దికాదు అని మీకు తెల్సివుంటే నేను మీ మాట వినకపోవడం అంటూ వుండదు - అన్నం చల్లారిపోతుంది - తిన్న తరువాత రోజంతా వుంది దెబ్బలాటకి. రండి ముందు భోజనానికి...'' విద్య వాదన పెంచకుండా వంటింట్లోకి వెళ్లిపోయింది.

విద్యవంక గుర్రుగాచూసి -ఏమనుకున్నాడో గాని ప్రభాకర్ లేచి వెళ్లి కంచం ముందు కూర్చున్నాడు. నిజంగానే ఆరునెలల తరువాత ఇంటి భోజనం, వేడివేడిగా కమ్మగా తింటూంటే తాత్కాలికంగా కోపం ఉపశమించింది. భోజనం పూర్తయ్యేసరికి 'పాపం విద్య మారిపోయింది. తనకిష్టమని అన్నీ చేసింది. తను తొందరపడ్డాడేమో' అన్న భావం మెదిలింది.

''ఈసారి కిందటిసారిలా కాదులెండి- వంటలన్నీ నేర్చుకున్నాను ఈ ఆరునెలల్లో. ఇంతకీ నావంట ఎలావుంది? బాగుందా... అబ్బ ఏంమొగుడండి బాబూ! ఆప్యాయంగా పెళ్లాం వండిపెడితే, ఒక్కమాట బాగుంది అనడానికి కూడా మనసొప్పలేదన్నమాట--''

ప్రభాకర్ కాస్త సిగ్గుపడి మొహం తిప్పుకున్నాడు - బాగుంది అనాలనిపించినా అనలేకపోయాడు.

''ఏం ఘనకార్యం సాధించావని పొగడమంటావు. మొగుడికి వండిపెట్టడం వూరికి ఉపకారంలా పొగడమంటావా'' ఓ వంకరనవ్వు నవ్వి అన్నాడు, చేయికడగడానికి లేచి వెడుతూ.

'అంతేలే... నీలాంటి మృగాలకి ఇంతకంటె ఏం అర్థం అవుతుంది' మనసులో మాట పైకి అనకుండా విశ్వప్రయత్నంమీద ఆపుకుంది విద్య. భోజనాలు ముగిసి పడకగదిలోకి వెడుతూ, ఇక్కడ మరో సీను- ప్రతిరోజు ప్రతిగంట, ప్రతినిమిషం ఎంతకని నటించగలను... ఓ నెలరోజులంటే... అబ్బ నాతరమా, అనిపించింది ఒక్కరోజుకే విద్యకి. తను తగ్గిపోయి జవాబివ్వకపోవడంతో ప్రభాకర్ పొగరు అహంకారం కాస్త తగ్గినట్టే అనిపించింది. అతనిప్పుడు ఎలాంటిస్థితిలో వున్నది కొద్దిగా అర్థం అయింది విద్యకి. విద్య ముందు తగ్గిపోవడం నామోషి- అలా అని ఏమన్నా మరీ అంటే విద్య వెళ్లిపోతుందేమోనన్న భయం అతని కీవుంది. అంచేత ఇటు అటు ఊగిసలాడుతూ బింకంగా వున్నాడు. నాల్గురోజులు పోతే దారికి రాకపోదన్న ఆశాభావం కలిగింది విద్యకి.

ఆ గదిలో వున్నది ఒకే మంచం. తాను పడుకోడానికి వేరేపక్కకూడాలేదు. నిజానికి నవదంపతులకి ఇంకో మంచంతో పనిలేదు. కాని తాను కాపురంచేసిన రెండునెలల్లో ఏవారంపదిరోజులు ఆపక్కమీద పడుకుందో... ఈసారన్నా తన ప్రయత్నం విజయవంతమవుతుందో లేదో! లక్ష్మి తెచ్చిఇచ్చిన మల్లెపూలు పెట్టుకుని, తెల్లచీర కట్టుకుని, పాలగ్లాసుతో గదిలోకి వచ్చిన విద్యని చూసి ప్రభాకర్ మొహంలో ఆశ్చర్యానందాలతోపాటు లజ్జకూడా కనిపించింది. చూపులు మరల్చుకుని చూడనట్టే వుండిపోయినా అతనిమనసు, శరీరం రెండూ విద్యని దగ్గరకిలాక్కోవాలని ఆరాటపడుతున్నాయి. విద్యవచ్చి మంచం మీద కూర్చుంది పాలగ్లాసు పక్కనపెట్టి. చనువుగా అతనిమీద వాలుతూ అతని చేతిలో పుస్తకం లాగేసి కొంటెగా చూసింది.

''ఈసారి చాలా వేషాలు నేర్చుకుని వచ్చావే! ఎవరిదగ్గర పాఠాలు నేర్చుకున్నావు?'' క్రుకెడ్‌గా నవ్వుతూ అన్నాడు ప్రభా






# తల్పగిరి కాలనీలో

**6** మాసములలో సొంత గృహమును పొందుగోరువారు రూ॥ 30,000/-లు ముందుగా చెల్లించిన మిగిలిన పైకము మీకు అనువైన రీతిలో వాయిదాల పద్ధతిలో చెల్లించుటకు లోను ఏర్పాటు చేయబడును.

కేవలం నెలకు రు. 500/-లు మాత్రమే వాయిదాల పద్ధతిలో చెల్లించి, సొంత గృహమును పొందుటకు నెల్లూరు పట్టణములో చక్కని అవకాశం.

నెల్లూరు - మద్రాసు G.N.T. రోడ్డు కుడిప్రక్కన, ఆటోనగర్‌వద్ద స్వామి అయ్యప్ప దేవాలయము సమీపంలో, టౌన్‌కు ఆనుకొని "లే అవుట్" చేయడమైనది.

1. $33\frac{1}{3}$ అంకణములు /267 చ. గల ప్లాటులో $5\frac{1}{2}$ అంకణములు /400 చ.అ. సింగిల్ బెడ్ రూం గృహము కేవలం రు. 55,000/-మాత్రమే.
2. వాయిదాల పద్ధతిలో గృహము పొందగోరువారు ముందుగా 15,000/- చెల్లించి మిగిలిన పైకము నెలకు రు. 500/-ల చొ॥న 120 నెలలు చెల్లించవలెను.
3. డ్రైనేజ్, రోడ్లు, కరెంటు వసతులు కల్పించబడును. ప్రతి ఇంటికి ఒక బావి త్రవ్వి నీటి వసతి ఏర్పాటు చేయబడును.
4. కేవలం ప్లాటు మాత్రమే కొనుగోలుచేయుటకు కూడా అవకాశం కలదు.
5. మొదటి గ్రూపులోచేరిన 50 మందికి 18 మాసములలో గృహ నిర్మాణము పూర్తిచేయబడును.
6. ప్లాటు కొనుగోలు చేయువారికి మొదటి వాయిదా రు. 5,000/- చెల్లించిన, మిగిలిన పైకం వాయిదాల పద్ధతిలో చెల్లించుటకు లోను ఏర్పాటు చేయబడును.
7. ప్లాటు కొనుగోలు చేయువారు రు. 500/- లేదా గృహనిర్మాణ స్కీములో చేరువారు రు. 1000/- టోకను అడ్వాన్సు చెల్లించి వచ్చిన ప్లాటును వెంటనే రిజర్వు చేసుకొనవచ్చును.
8. ప్రతి ఆదివారము ఉదయం 8 గం. నుండి 12.30 గంటల వరకు స్థల సందర్శనము కొరకు మా ఆఫీసునుండి ఉచిత వాహన సౌకర్యం ఏర్పాటుచేయబడును.

వివరములకు :

ఫోన్ : **6729**

## J.L.నారాయణ & కంపెనీ

14/291, ఊర్వశి కాంప్లెక్స్ - కాపువీధి - నెల్లూరు

OM ADS. NLR.

కర్.

''ఈబుద్ధిముందే వుంటే ఎంతబాగుండేది. చేతులు కాలాకగాని మీ ఆడవాళ్లకి బుద్ధిరాదు- మొగుణ్ని ఎదిరించితే ఫలితం ఏమిటో ఈ ఆరునెలల్లో బాగా తెల్సినట్టుంది నీకు'' వ్యంగ్యంగా ఎత్తిపొడిచాడు.

విద్య అతని గుండెలమీద నించి తలెత్తి అతని వంకసూటిగా, నిర్భయంగా చూసింది. ''చూడండి... మీరింక ఈ ఎత్తిపొడుపులు, హేళనలు, సాధింపులు అవి మానేసి సామరస్యంగా మాట్లాడటం మంచిది. మన వివాహ బంధాన్ని, కుటుంబగౌరవాలని మన్నించి సంధికోసం మీదగ్గిరకి వచ్చాను. అంతమాత్రాన నాకేం గతిలేదని, బతకలేక కాళ్లబేరానికి వచ్చాననే అపోహమీరు తొలగించుకుంటే మంచిది. భార్యాభర్తలమధ్య అవగాహన, అనురాగం పెంపొందించడానికి మీవంతు ప్రయత్నం మీరు చేస్తే ఈ కాపురం కుదుటపడుతుంది. నాప్రయత్నం నేను చేసి ఈ కాపురం నిలబెట్టాలని వచ్చాను. మీరు సహకారం ఇవ్వకపోతే, ఇయ్యదలచకపోతే నేను నావైపునించి ఎంత ప్రయత్నించినా లాభం వుండదు. మీరు బాగా ఆలోచించి ఈకాపురం కావాలంటే నన్ను అడుగడుగునా సాధించడం మానండి. లేదామీరిలాగే వుండదలిస్తే మీఖర్మ. నాదారిన నేను పోతాను. పెళ్లి, మొగుడు కాకపోతే ఆడది బతకలేదనే రోజులు కావివి. చదువుంది. ఏదో ఉద్యోగం చేసుకుంటాను. మనం ఇంక గుడిసెలవాళ్లమాదిరి అరుచుకోడం మానేసి ఇద్దరం కోర్టుద్వారా విడిపోదాం. అంతేగాని ఈ కలతలు, కలహాలు ఇంక నేను భరించను. నేను మీతో సహజీవనం కోసం నాఆత్మాభిమానం, పౌరుషం అన్నీ వదులుకుని వచ్చాను. మీరూ అది వదులుకోకపోతే నన్ను వదులుకోండి. నన్ను భార్యగా గౌరవించి, అభిమానిస్తే భర్తగా మిమ్మల్ని గౌరవించి మీమాటమన్నిస్తాను. నామీద అధికారం చలాయించి ఏకాలుకిందో చెప్పులాగే అణిచిపెట్టాలని చూస్తే మాత్రం నేను సహించను. సంసారానికి భార్యాభర్త రెండు బండిచక్రాలు. ఇందులో ఎక్కువ తక్కువలు లేవు. అది మీరు గ్రహించి భార్యగా నాస్థానం నాకివ్వండి. ఇదే మీకు ఆఖరిసారి చెప్పడం- మీపద్ధతి మార్చుకోనంటే ఇంకా ఇక్కడ నేను వుండటం వృధా. రేపే వెళ్లిపోతాను. ఈబంధం యింకా లాగిలాగి పీటముడి వేయకముందే ముళ్లు విప్పుకుని ఎవరిదారి వాళ్లు చూసుకుందాం... ఏమంటారు?'' విద్య స్థిరంగా ఆవేశం ఆగ్రహంలేకుండా చెప్పింది.

విద్య మాటలు వింటున్నంతసేపు ప్రభాకర్ మొహంలో ఆందోళన, కళ్లల్లో అలజడి బెదురు కనిపించింది. విద్య మాటలతో జడిసి నిజంగానే మనస్సులో బెదిరాడు. పెళ్లాం మొగుణ్ని వదిలివెడితే ఎదుర్కోవలసిన ప్రశ్నలు, మాటలు, అవమానాలు, సమస్యలు ఈ ఆరునెలల్లో బాగానే అర్ధం అయ్యాయి అతనికి. అతను ఏం జవాబివ్వాలా అని ఆలోచించేలోపల విద్యే మళ్లీ అంది.

''కాని ఒక్కసంగతి మాత్రం గుర్తుంచుకోండి. ఈపెళ్లాం కాకపోతే మరొత్తి వస్తుంది. నాకేం మగవాడిని అన్న అహంకారం మాత్రం వదులుకోండి. ఈ కాలం ఆడపిల్లలు చదువుకున్నవారు, మంచిచెడ్డలు బేరీజు వేయగలరు. ఒక పెళ్లాన్ని వదిలిన మగాణ్ని కారణాలు తెల్సుకోకుండా ఏ ఆడపిల్లా పెళ్లాడదు. గతిలేక పెళ్లాడినా మీ జులుంని నేనేకాదు ఈనాటి ఏ ఆడపిల్లా సహించి పడుండదని గుర్తుంచుకోండి''

ఆదెబ్బతో పూర్తిగా బెదిరాడు ప్రభాకర్- ''నీవు సరిగ్గా వుంటానంటే నేనెందుకు దెబ్బలాడతాను. నీవు పొగరుగా జవాబిస్తే మాత్రం సహించనన్నాను అంతే!'' తడబడ్తూ బింకంగా అన్నాడు.

''కొత్తగా పెళ్లయివచ్చిన ఏ ఆడపిల్లన్నా పొగరుగా జవాబిచ్చింది అంటే అది ఆభర్త లోపం. భార్యని ఆకట్టుకోడం చాతకాని, భార్య మనసుగెలుచుకోలేని వాడన్న మాట. ప్రేమతో కట్టిపడేసుకోడం చాతనయిన మగాడికి ఆడది మనఃపూర్వకంగా బానిస అవుతుంది. ఇదే ఆఖరిసారి అవాలి మనమధ్య ఈమాటలు- ఇంక ఈ విషయం సాగదీస్తే వూరుకోను'' విద్య విసురుగా లేచి నిలబడింది.

ప్రభాకర్ గాభరాగా విద్యచీరకొంగు పట్టుకు లాగాడు. విద్య వచ్చి మంచంమీద పడింది.




'ఎక్కడికి లేచావు?' అన్నాడు ప్రభాకర్.

"మీకు ఆలోచించుకోడానికి ఈ రాత్రి టైము ఇస్తున్నాను. ఆ ఆలోచన పూర్తి అయ్యే వరకు మిమ్మల్ని వంటరిగా వుండనివ్వడం మంచి దని... ఆగదిలో పడుకుంటాను నేను" బెట్టుచేస్తూ అంది.

'చాల్లే వేషాలు... ఆగదిలో పడుకుంటావేం" అంటూ విద్యని మోటుగా కౌగిలిలో బంధించాడు.

"ఆడది శారీరకంగా మోటుతనం సహించ గలదుగాని మానసికంగా మోటుతనం సహించదు. ప్రేమగా చెంపదెబ్బవేసినా భరిస్తుంది"

"నన్ను దెప్పడం, సాధించడం మానమని చెప్పి నీవేంచేస్తున్నావు?" నిష్ఠూరంగా అన్నాడు.

"ఇలా దెప్పుతుంటే ఎలావుంటుందో రుచి చూస్తారని..."

విద్యనింక మాట్లాడనివ్వకుండా నోరుమూశాడు పెదాలతో...

★ ★ ★

ఓ వారంరోజులు తొందరగానే చెప్పుకోదగ్గ విశేషం లేకుండానే గడిచింది. ప్రభాకర్ వగరు, పొగరు ఆవారంరోజులలో చాలా తగ్గించకల్గింది విద్య. అతని పనులన్నీ చేస్తూ- ఆఫీసుకి వెళ్లేవరకు వెంటవెంటవుండి, టిఫిన్లు వంటలు ఇష్టమైనవి వండి, రాత్రి అతన్ని కాదన కుండా సంతోషపెడ్తూ రకరకాలుగా వీలయిన ప్పుడల్లా అతన్ని మాటలతో మార్చాలని ప్రయత్నిస్తూ తొంభైశాతం అతన్ని గెల్చుకోగలిగింది విద్య. తనలో అంత శాంతం, సహనం వున్నాయా అని తానే ఆశ్చర్యపోయింది విద్య. తానేనా ఇంతలా వదిగి వుండటం నేర్చుకుంది- తనమీద నిర్మల మాటల ప్రభావం ఇంతలా పనిచేసిందా, తాను ఈకాపురం వదులుకొంటే భవిష్యత్తులో బాధపడాలని ఇంతలా మారిపోయిందా- తనకోపం, అహంకారం ఎలా అణిగిపోయాయి. బహుశా ప్రభాకర్ అహంకారం ప్రదర్శించకపోబట్టి తనకీ ప్రదర్శించే అవకాశం కలగలేదేమో! ఇదంతా అతని మీద ప్రేమకొద్దీ చేసిందా- అతనిమీద తనకింకా అసలు ప్రేమ భావం, ఇతనులేకపోతే వుండలేనన్న భావంగాని, ఇతనితోడిదే లోకం అన్నమైమరుపు, పరవశంగాని కలగలేదు- అలాగని ఇదివరకులా ద్వేషించి, అసహ్యించుకోడంలేదు. ఏదో ఒకరకం పంతం- ఈపరీక్షలో నెగ్గాలన్న పట్టుదల తనచేత ఇదంతా చేయిస్తూంది- ఇలా ప్రవర్తిస్తే ప్రభాకర్ లొంగివస్తాడాలేదా అన్నది తేల్చుకోవాలన్న కుతూహలం మించి తనలో ఇంకేంలేదు ప్రస్థుతానికి అనిపించింది. ప్రభాకర్ మారితే ముందు ముందు ప్రేమించి అభిమానించగ లదేమో-

వారంరోజుల్లో తనంతటతనే సినిమాకి వెడదామా అని అడిగాడు ప్రభాకర్ ఒక రోజు. లోలోపల సంతోషం కల్గినా అది ప్రదర్శించ కుండా "సినిమాలంటే మీకిష్టం లేదుగా! నాకోసం ఎందుకులెండి, నాకూ పెద్ద చూడాలని ఏం కోరికలేదు" అంది నిర్లిప్తంగా.

"లేదులే వెడదాంపద... నేనూ చూసి చాలా రోజులయింది. తయారుకా! వంట చెయ్యొద్దులే. ఎక్కడో భోంచేసి వచ్చేద్దాం" అన్నాడు.

అతనిలో ఇరుగుపొరుగులకి తను, తనభార్య మామూలుగా సంసారం చేసుకుంటున్నాం మీరనుకున్నట్టు ఏం విడిపోలేదు అని చూపాలన్న ఆరాటం మొదలైంది. మరోరోజు ఇద్దరు స్నేహితుల ఇళ్లకి తీసుకెళ్లాడు. వాళ్లు నిజంగానే ప్రభాకర్ కాపురం కుదుటపడిందని సంతోషించారు. భోజనానికి పిలిచారు ఓపూట. వారం పదిరోజులు ఇటు అటు తిరగడం అది సరదాగానే గడిచింది.

ఓరోజు భోంచేస్తూ "ఈ శని ఆదివారాలు శలవులు. సోమవారం శలవుపెడ్తున్నాను. ఓ మూడురోజులు మా ఇంటికి వెళ్లివద్దాం. శుక్రవారం రాత్రికి బయలుదేరుదాం" అన్నాడు విద్యవంక చూసి.

విద్య ఏమంటుందా, రానంటే ఏం చెయ్యాలి, రాను అంటే మళ్లీ గొడవలు మొదలవుతాయా? ఈ పదిహేను రోజులుగా టెన్షన్ తగ్గి కాస్త మనశ్శాంతి చిక్కింది అతనికి. మళ్లీ గొడవలు రావడం అతనికిష్టంలేదు. కాని తన భార్య మారింది. తనతోసరిగా ఉంది,

తనంతట తనే వచ్చింది నాదగ్గిరకి అని వాళ్ల వాళ్లకి చూపాలని మహా ఆరాటంగా ఉందతని కి. తనతోసరిగా ఉంది. తన వాళ్ల ఇంటికివచ్చి తిన్నగావుంటే ఇంకఫరవాలేదు, విద్య నిజంగా మారింది లేనిది ఈ దెబ్బతో తేలిపోతుంది అని నిర్ణయించుకొని మనసులో కాస్త జంకు తూనే అడిగాడు.

విద్య అరక్షణం ఆలోచించకుండా "అలాగే వెడదాం. అసలు నేనే అడగాలనుకున్నాను మిమ్మల్ని" అంది.

ప్రభాకర్ గుండెలమీంచి పెద్ద బరువు తొలగినట్టు తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

'వస్తాను కాని అక్కడ నాకేదన్నా అవ మానం జరిగితే నాతరపున ఉండాలిమీరు' అనాలని నోటిదాకా వచ్చింది విద్యకి. కాని అనలేదు. విద్యకీ అతను నిజంగా మారాడో లేదో దాన్నిబట్టే తెల్సిపోతుందిగదా చూద్దాం అనిపించి ఊరుకుంది. నిజంగా ప్రేమ ఉంటే భార్యమీద ఈగ వాలనీడు. తనవాళ్లయినా భార్యని అవమానిస్తే సహించడు. వాళ్లేదన్నా ఈయనగారేమంటారో చూద్దాం అనుకుంది విద్య.

★ ★ ★

అత్తవారింట్లోకి అడుగుపెడుతూంటే కొత్తపె ళ్లి కూతురిలాగే బెరుకుగా అన్పించింది విద్య కి.

వీధి వరండాలో పేపరు చదువుతున్న మామగారు కొడుకుని, కోడలిని చూసి రోజూవ చ్చిపోయే వాళ్లేనన్నట్టు పట్టించుకోకుండా పేప రు చదవడంలో మునిగిపోయారు.

ప్రభాకర్‌కీకాస్త కష్టం అన్పించినా సర్దు కుంటూ లేని నవ్వు తెచ్చుకుని "బాగున్నారా నాన్నా, ఆమధ్య బ్లెడ్‌ప్రెషర్ ఎక్కువైందన్నా రు ఎలా ఉంది" అంటూ పలకరించాడు.

"ఆ... బాగానే ఉంది. వెళ్లు లోపలికి..." అన్నారాయన. ఈలోగా తల్లి లోపల్నించి వచ్చి "ఏమిరా చిన్నాడా? ఫారెన్‌నించి రావడం రావడం అటువెళ్లి పోయేవెంట్రా? ఇక్కడికొచ్చి వెడతావనుకున్నాం. వచ్చి ఇరవై రోజులయి ఇప్పుడా కన్పించడం" అంటూ కోడలుపక్కన లేనట్టే పలకరించలేదు.

"రాగానే ముందు జాయిన్ అవమన్నారు. అటువెళ్లి జాయిన్ అయివద్దామనుకునేలోగా విద్య వచ్చింది. అందుకని కాస్త ఆలశ్యం అయింది".

"నీవు రాశావా వచ్చినట్టు" అనుమానంగా చూస్తూ ఆరాతీసింది "అవునులే ఎంతయినా పెళ్లాం బెల్లం, రాయకుండా ఉంటావా" అని చేర్చింది వంకర నవ్వునవ్వి.

"అవునండి... పెళ్లానికి ఫలానా రోజువస్తు న్నానని రాయడంలో వింత ఏముంది? అడగ డానికి ఏముంది అందులో" విద్య నవ్వుతూ అంది.

"అది కాదమ్మా... అసలు నేనురా...." ఏదో గాభరాగా చెప్పబోయాడు.

"అబ్బ... మీ అమ్మగారేం సంజాయిషీలు అడగడంలేదండి బాబూ! కొడుకు, కోడలు చక్కగా, జంటగా వచ్చారని ఆవిడ సంతోషప డి, రాసిమంచిపని చేశావు అని మెచ్చుకుంటు న్నారు" తెలివిగా దెబ్బకొట్టింది విద్య.

అత్తగారి మొహం మాడింది. ప్రభాకర్ గాభరాగా తల్లిదండ్రులవంక చూశాడు.

"లోపలికి వెళ్లండిరా! బయటే నిలబడి ఏమిటామాటలు" తండ్రి గంభీరంగా అన్నా రు.

"పదనాయనా... కోడలు ఎన్నాళ్లకి నట్టింట కాలుపెట్టింది? మా జన్మలు తరించాయి. రా అమ్మారా..." ఆవిడ మాటల్లో వ్యంగ్యం తప్ప ఆదరణ ఆప్యాయత లేదని అర్ధమైనా విద్య విననట్టు లోపలికి నడిచింది.

తిన్నగా ప్రభాకర్ గదిలోకి చొరవగా వెళ్లి సామాను పెట్టించింది. తోటి కోడలు ఎదురయి నవ్వనా వద్దా అన్నట్టు సందిగ్ధంలో పడినట్టు చూస్తూవుండిపోయింది.

"బాగున్నారా అక్కయ్యా" విద్యే పలక రించింది. "బావగారేరి" చనువుగా అడిగింది. విద్యలో మార్పు చూసి సంభ్రమపడ్డట్టు చూ సింది తోటికోడలు.

"ఏమ్మా కోడలా మొగుడులేందే అత్తింటికి రానూడదనుకున్నావా? ఆరు నెలల్లో అత్త మామ ఒకరున్నారు. పెళ్లయిన ఆడది అత్తింట ఉండాలిగాని పుట్టింటకాదు ఉండా







ల్సింది అని గుర్తులేదా'' అత్తగారు నవ్వుతూనే అంది.

"ఎందుకు జ్ఞాపకం లేదండి. పెళ్లయిన ఆడది ఆమాట ఎలా మరిచిపోతుందండి. ఎటొచ్చీ రావడానికి వీలువివరం కల్సిరాలేదు. పరీక్షలయ్యాక అనుకున్నాను. తరువాత నాకు, అమ్మకి, నాన్నకి అందరికి వరసగా వంట్లోబాగు లేక రాలేదు'' కోపం తన్నుకొస్తున్నా వినయంగానే జవాబిచ్చింది విద్య.

"ఏమోలే... మొగుడు లేకపోతే నిన్ను అష్టకష్టాలు పెడ్తామేమోనని భయపడి రాలేదేమోనని...'' ఆవిడ ఏదోలా ఎత్తిపొడిచి తనని రెచ్చగొట్టాలని చూస్తున్న సంగతి విద్యకి అర్థమైంది.

"ఆ భయం నాకు లేదులెండి. ఈ కాలం ఆడపిల్లలు అంతవెర్రివాళ్లు కాదని నాకు తెలుసు మీకు తెలియకపోయినా! ఏమిటలా నిలబడిపోయారు వెళ్లి స్నానం చేసిరండి. అక్కయ్యగారూ ముందు కాస్త కాఫీ ఇస్తారా! రైల్లో వెధవకాఫీ తాగబుద్ధి వేయలేదు'' తనే చొరవగా అడిగింది.

తోటికోడలు తేరుకొని "....ఆ... కాఫీ కలుపుతాను'' అంటూ వెళ్లిపోయింది.

అత్తగారి మొహంమాడింది. ప్రభాకర్ ఏం మాట్లాడాలో తెలియనివాడిలా కుర్చీలో కూర్చుండిపోయాడు.

విద్య పెట్టె తీసి ప్రభాకర్ బట్టలుతీసి, సబ్బు అది అతని చేతిలో పెట్టి "వెళ్లండి స్నానం చేసిరండి, మీకు కాఫీ బాధలేదుగా'' మొగుడిమీద తన కెంతచనువు, అధికారం ఉన్నాయో చూపించి వాళ్లని ఉడుక్కునేటట్టు చేయడం విద్య ఉద్దేశం.

అత్తగారు మొహం ముడుచుకుని వంటింట్లోకి వెళ్లిపోవడం చూసి లోలోపల నవ్వుకుంది. ఆవిడ వెనకాలే చనువుగా వంటఇంట్లోకి వెళ్లింది. "ఏం టిఫిను చేస్తున్నారు ఇవాళ. దోసెలా... ఆయనకి చాలా ఇష్టం. కొడుకు వస్తున్నాడని చేస్తున్నారా! కూర చెయ్యండి దోసెలకి. లేకపోతే ఆయన తినరు. అక్కయ్యగారూ, నేను స్నానం చేసి వచ్చి దోసెలు వేస్తాను. నే చేస్తే హోటలు మసాలాదోసెలా ఉందంటారు ఆయన''

అత్తగారు, పెద్దకోడలు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు విద్య ధోరణికి. ఏదోనాటకం చూస్తున్నట్టు వింతగా ఉంది వాళ్లకి.

విద్యలో ఈ మార్పు వాళ్లు ఆశించలేదేమో, విద్య ప్రవర్తన ఇలా ఉంటుందని వాళ్లెదురు చూడలేదేమో నాటకంలో పాత్రలు డైలాగులు మర్చిపోయినట్టు తడబడ్తున్నారు.

విద్య చనువుగా దోసెలు వేసింది. తరువాత కూర, అది తరిగి వంటింట్లో సాయం చేసింది.

"నీకెందుకులే అమ్మా, మా ఇంట్లోపనులు చేయడం! నీ వెళ్లి కూర్చో" అంది అత్తగారు.

"ఎవరింట్లోవాళ్లు చేసుకుంటే తప్పేంవుందండి, నాకేం రాదనుకున్నారా. కిందటి మాటంటే కాలేజిలు, చదువుల గొడవలో నేర్చుకోలేదు. ఈ ఆరునెలల్లో అమ్మ నన్ను తిట్టి వంటరాకపోతే ఎలా అంటూ అన్నీ నేర్పింది" అంది. ఇదీ నా ఇల్లే అని తెలపాలని.

భోజనాలు అయి ఎవరి గదుల్లోకి వాళ్లు వెళ్లారు.

"మా అమ్మావాళ్లు నీలో మార్పుకి ఆశ్చర్యపోతున్నారు. ఈ కోడలికి ఇంతబుద్ధి ఎలావచ్చిందని మతులుపోయినట్లున్నాయి వాళ్లకి-" ప్రభాకర్ గదిలో అన్నాడు.

"ఏం... నేనేం దెయ్యాన్నీ, రాక్షసిని కాదు- మనిషిని. మనిషిని మనిషిలా చూడగలిగితే ఏ సమస్యలూ ఉండవని తెలియచెప్పడానికి ప్రయత్నిస్తున్నాను-" అంది విద్య నవ్వి.

"ఏమో- కిందటిసారికి ఈసారికి నీలో చాలా మార్పు..."

"కావాలని తెచ్చుకొని, ఓ ఛాన్సు ఇచ్చి చూద్దామని వచ్చాను. ఈసారి నన్ను, నావాళ్లని ఏమన్నా అననీండి- అమర్యాదగా మాట్లాడనీండి. ఈసారీ నాలో దెయ్యం మేలు కొంటుంది"

"సరే... సరే బాబూ ఊరుకో! మళ్లీ గొడవలు మొదలుపెట్టకు-" భయంగా అన్నాడు.

విద్య ఓ కునుకు తీసి లేచేసరికి మూడు గంటలవుతోంది. బద్ధకంగా పక్కమీద పడుకున్న విద్యకి పక్కగదిలోంచి సన్నగా మాటలు వినిపించాయి. అది ప్రభాకర్‌గొంతు.

"లేదమ్మా... నిజంగా విద్య చాలా మారిపోయింది. లేకపోతే పొగరు వేషాలువేస్తే నే దగ్గిరకు రానిచ్చేవాడినా?"

"ఏమోరా! అదేదో పెద్దప్లాన్‌తో వచ్చినట్టు కనిపిస్తోంది నాకు. లేకపోతే ఒక్కసారి ఇంత మార్పా. నిన్నో చవటని చేసి ఆడించాలని ఏదో ఎత్తులో వచ్చినట్టే ఉంది".

"ఆ... నేనేం అంత చవటననా? ఉద్దేశం. నిజంగానే విద్య మారిందమ్మా"

"ఏమోనాయనా నీఇష్టం, నీపెళ్ళాం, నీకాపురం! మాకేంపోయింది. నెత్తికెక్కించి ఆడించుకోమాకేం" ఆవిడ మాటల్లో కొడుకు కూడా పెళ్లాం పక్షం మాట్లాడేసరికి అసూయ ధ్వనించింది.

"ఏమిటమ్మా! విద్య వచ్చిందని నీకేం సంతోషంగా లేదా. తను మారిపోయింట్గా, మళ్లీ ఎందుకు గొడవలు" కాస్త విసుగ్గా అన్నాడు.

"అమ్మో నాకేం బాధనాయినా? మీరు మీర హాయిగా ఉంటే మాకెందుకు బాధ బాబూ. కన్నకడుపుకనుక వుండబట్టలేక అన్నాను. అయినా పెళ్ళాం బెల్లంకాని మొగాడెవడులే" అంది.

తరువాత మాటలు వినబడలేదు.

"ఫరవాలేదు! ప్రభాకర్ ఆమాత్రం తన పక్షం మాట్లాడాడు చాలు" అనుకుంది విద్య.

మధ్యాహ్నం టీ తాగుతుండగా "అత్తయ్యగారూ... మీరు మాకేమన్నా ఇంటికి కావాల్సిన సామాన్లు ఇస్తారా? ఇంట్లో బొత్తిగా ఏంలేవు. ఫ్రిజ్, ఓ బీరువా, మంచాలు, ఓ డైనింగు టేబుల్ అవి కావాలి. మీరేం ఇచ్చేది చెబితే మిగతావి మేంకొనుక్కుంటాం. బొత్తిగా ఇంట్లో అసలు ఏంలేకుండా కాపురం ఎలా? ఫ్రెండ్సు వాళ్లువస్తే కూర్చోపెట్టడానికి కుర్చీలన్నాలేవు. గిన్నెలవి కూడా కావాలి. మీరు సామాన్లు ఇస్తానంటే లారీ మాట్లాడతారు" అంది.

అత్తగారు తెల్లబోతూ "మేం ఎందుకిస్తాం? నీ పుట్టింటివాళ్ళిస్తే తెచ్చుకో. కాదంటే నీ మొగుణ్ణి కొనమను. నీ కాపురానికి కావల్సినవి మేం ఇవ్వడం ఏమిటి" ఆవిడ కాస్త దురుసుగా అంది.

"అబ్బే... మాఇంట్లో అన్నీ బోలెడున్నాయి. మళ్ళీ ఎందుకు కొనడం అని ఆయనఅంటే,




మీరిస్తారు కాబోలు అనుకున్నాను. మా అమ్మ మాకు కావల్సిన సామాన్లకి డబ్బిచ్చిందనుకోండి. కానీ ఈయన మిమ్మల్ని అడగాలి, మా ఇంట్లో అన్నీ వున్నాయి అన్నారు ఇదివరకు. అంటే, మళ్ళీవున్నవే కొనడం ఎందుకు మీరిచ్చినవిచూసి మిగతావి కొందామనుకున్నాను'' గడుసుగా అంది. అత్తగారు ధుమధుమలాడుతూ కొడుకువైపు చూసింది. ప్రభాకర్ మొహం కళ తప్పింది.

''ఏరా... సామానిస్తానన్నానా నీకు? బాగుంది నాయనా... ఇటు ఆడపిల్లలకి కాపురానికి కావాల్సినవి ఇచ్చి, అటు కోడళ్ళు తెచ్చుకోవాల్సింది కూడా మేం ఇవ్వాలా'' వ్యంగ్యంగా అంది. ప్రభాకర్ మొహం నల్లబడింది.

''ఎవ్వరూ ఇవ్వనక్కరలేదు. నా ఇంటికి కావల్సినవి నేను కొనుక్కోగలను'' అని విసురుగాలేచి వెళ్ళిపోయాడు.

రాత్రి ''అమ్మని ఎందుకు సామాన్లు అడిగావు? మనకేం కావాలో చెబితే ఒక్కొక్కటి కొనేవాడినిగదా'' కోపంగా అడిగాడు విద్యని.

''బాగుంది... నాకేం తెలుసు. ఇన్నాళ్ళూ ఎన్నిసార్లడిగినా మావాళ్ళని అడగాలి, మా ఇంట్లో ఇవి వున్నాయి, అవి వున్నాయి అంటే వాళ్ళిస్తారు కాబోలు మన కాపురానికి కావల్సినవి అని అనుకున్నాను'' విద్య గడుసుగా అంటించింది. ''మాఅమ్మ కొంత డబ్బిచ్చింది. ముందుగా ముఖ్యమైనవి కొందాం. తరువాత మీరు ఒక్కొక్కటి కొందురుగాని'' లాలనగా అంది. ''చూశారా... మీవాళ్ళూ మీవాళ్ళూ అని ఇన్నాళ్ళూ వాళ్ళకోసం కట్టుకున్న పెళ్ళాన్ని కాలదన్నారు. మీ సంసారానికి కావల్సినవి అమర్చుకోడానికి కూడా వాళ్ళ పర్మిషన్ కావాలి. పెళ్ళాన్ని అవమానం చేశారు. ఇప్పటికన్నా తెల్సిందా, ఎవరంతటివాళ్ళు వాళ్ళయ్యాక తల్లిఅయినా, కొడుకయినా, కూతురయినా పెళ్ళయ్యాక ఎవరి సంసారం వాళ్ళు చూసుకోవాలి. కన్నవాళ్ళు కట్టుకున్న భార్యో భర్తో వచ్చేవరకే ఆదుకుంటారు. ఒక్కసారి పెళ్ళవగానే రెక్కలొచ్చిన పక్షులని పక్షులు గూట్లోంచి తరిమేస్తాయి. మనుషులుగనక మమకారాలుండ వచ్చుగాని ఎవరి గొడవ వాళ్ళు చూసుకోమని వదిలేస్తారు. కష్టం, సుఖంలో తోడునీడయ్యేది భార్యకి భర్త, భర్తకి భార్యకాని అమ్మానాన్నకాదు వయసువచ్చాక. ఏం... ఇప్పటికన్నా అర్థం అయిందా?'' విద్య లాలనగా అతని జుట్టు సవరిస్తూ అంది.

ప్రభాకర్ ఒక్కసారిగా విద్యవడిలో తలదాచుకున్నాడు.

★ ★ ★

విద్యవెళ్ళిన నెలా పదిహేనురోజుల తరువాత వచ్చిన ఉత్తరాన్ని ఆరాటంగా అందుకుని విప్పింది నిర్మల.

''ఆంటీ... థాంక్స్- మీ సలహాని అమలులో పెట్టాను. మీరు చెప్పింది నిజమేనని పిస్తూంది. ఆయనలో మార్పు వచ్చింది- కొట్టొచ్చినట్టు తెలిసే మార్పు వచ్చింది. నాలో మార్పుకి సంతోషించి కొంత, మళ్ళీ గొడవ అయితే నేను వెళ్ళి పోతానేమోనన్న భయం కొంత. మొత్తానికి ఆయన మారారు... మారుతున్నారు. తొంభైశాతం నేకోరుకున్న మార్పు వచ్చింది. ఇంకో పదిశాతం కొద్దిరోజులలో సాధించగలనన్న నమ్మకం కల్గుతోంది. మనిషి స్వతహాగా కాస్త షార్ట్‌టెంపర్డ్. ఓర్మి, సహనం తక్కువ. దానికితోడు పెంపకం పాడుచేసింది. ఇప్పుడిప్పుడే దారికి వస్తున్నారు. థాంక్స్ ఆంటీ... నా ఆవేశానికి, అహంకారానికి అర్థం లేదని చెప్పి, పక్కదారిలో వెళ్ళి ఏదో సాధించగలననే నా అజ్ఞానాన్ని సరిదిద్ది. 'పక్కదారంట వెడితే ఆ దారి ఎటుపోతుందో తెలియదు. తెలియని దారిని ఎన్నుకుంటే అవస్థలపాలవుతావు. నీగమ్యం చేరలేవు' అని బోధపరిచి, చేయిపట్టి, సరిఅయిన దారికి మళ్ళించిన మీకు నేను ఎలా కృతజ్ఞతలు చూపగలను! థాంక్స్ ఆంటీ... నేను సంతోషంగానే వున్నాను. ఇప్పుడిప్పుడే ఆయన్ని ప్రేమించడం నేర్చుకుంటున్నాను. ఆయన నన్ను పూర్తిగా నమ్మారు. ఆయన జీవితానికి నేను తోడు నీడఅయి నిలుస్తానన్న నమ్మకం ఆయనకి కలిగిస్తున్నాను. త్వరలో ఆయన్ని తీసుకువస్తాను ఆంటీ... థాంక్స్ ఆంటీ!''

విద్య ఉత్తరం చదువుతూంటే నిర్మల కళ్ళు ఆనందంతో నిండాయి.





# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన కొన్ని ముఖ్యాంశాలు:

1. మీ **"చతుర సమీక్ష"** అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **చతుర సమీక్ష కు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

## కూపన్

జూలై 'చతుర' నవల : జీవితం చేజారనీయకు

సమీక్షకుని పేరు: ..............................................

చిరునామా: ..............................................

..............................................

..............................................

..............................................

# చేతుర కతలు

## స్పెషలిస్ట్

కోటీశ్వరుడు కనకయ్యగారి అర్ధాంగికి అర్ధాంతరంగా జబ్బు చేసింది. ఇటిల్లిపాదీ హడావిడి పడిపోతున్నారు. నౌకర్లందరూ కాళ్ళ కింద నిప్పులుపడ్డట్టు కంగారుగా అటూఇటూ పరిగెడుతున్నారు. ఇంటాయన ఓ చేత్తో భార్యామణిని బుజ్జగిస్తూనే మరో చేత్తో ఫోన్లమీద ఫోన్లు చేసేస్తున్నాడు.

మరో అరగంటలో ఆవిడ భారీ శరీరంలోని ప్రతి అవయవానికీ ఒక్కొక్కరు చొప్పున స్పెషలిస్టులందరూ వచ్చేశారు. ఆ వచ్చిన డాక్టర్లందరూ ఆవిడ మంచంచుట్టూ గుమిగూడారు.

''ఏంటమ్మా! ఎక్కడ నొప్పి?'' అంటూ.. అనునయంగా అడిగారో పెద్ద డాక్టరుగారు.

ఆవిడ 'ఆమాత్రం తెలీదూ?' అన్నట్టు ఆయనకేసి నిరసనగాచూసి చేత్తో పొట్ట చూపించింది.

అందరూ వెనక్కి తప్పుకొని పొట్టకు సంబంధించిన డాక్టరును ముందుకు తోశారు.

పొట్ట డాక్టరుగారు హడావిడిగా స్టెత్ సరిజేసుకుంటూ, ''నొప్పి పొత్తి కడుపులోనా లేక పైభాగంలోనా? బొడ్డు కిందనా, పక్కనా?'' అని అడిగాడు.

ఆవిడ అతనివంక గుడ్లురిమిచూసి తలపట్టుకొంది.

''ఓహో... తలనొప్పా!'' అని నిట్టూర్చి అందరూ కలిసి ఈసారి తలకి సంబంధించిన డాక్టరును ముందుకు తోశారు. తల స్పెషలిస్టుగారు కళ్ళద్దాలు సవరించుకుంటూ ''నొప్పి' తలవెనుక భాగంలోనా, ముందువేపా లేక మాడుమీదా?'' అని అడిగారు.

ఆవిడ రైలు ఇంజనులా బుసకొడుతూ కాళ్ళు గట్టిగా ఝాడించింది.

ఈసారి కాళ్ళకు, కీళ్ళకు సంబంధించిన స్పెషలిస్టుగారు ముందుకొచ్చారు.

అలా అందరూ అన్నివిధాలా ప్రశ్నించి కూడా ఆవిడ నుండీ ఏ జవాబూ రాబట్టలేకపోయారు. చివరికి వాళ్ళందర్లోకీ సీనియర్ డాక్టరుగారు, ''చూడమ్మా! మీరు ఫలానా చోట నొప్పి అని చెప్పకపోతే మేం ఏం చేయగలం?'' అన్నారు దీనంగా.

''నా నొప్పి ఏమిటో నేనే చెబితే మరి మీరంతా ఎందుకు?'' అంటూ గాండ్రించింది ఆవిడ.

వాళ్ళలోవున్న ఓ కుర్రడాక్టరు వున్నట్లుండి ''సారీ మేడమ్! మీ జబ్బేమిటో అర్ధమయింది. మా ఫ్రెండొకడు ఇలాంటివాటికి స్పెషలిస్టు, నిన్ననే అమెరికానుండి వచ్చాడు. వాడైతే మీకు ఖచ్చితంగా నయం చేయగలడు. ఎలాగైనా వాణ్ని రప్పిస్తాను'' అంటూ ఫోన్ దగ్గరకు పరుగెత్తాడు.

అందరూ ఆ ఫారిన్ రిటర్న్డ్ డాక్టరుకోసం ఊపిరి బిగపట్టుకొని ఎదురు చూస్తున్నారు.

మరో పది నిమిషాల్లో కొత్త డాక్టరుగారు వచ్చి సరాసరి పేషెంట్ దగ్గరికెళ్ళారు. ఆవిడను ఓసారి కిందినుండి పైదాకా పరీక్షగాచూసి, ఆ తరువాత కళ్ళు, నోరు తెరచిచూసి పొట్ట నొక్కిచూసి ఓ ఇంజక్షను ఇచ్చాడు. అయిదొందల ఫీజు వసూలు చేసుకొని వెళ్ళిపోయాడు.

మరో పది నిమిషాల్లో ఆవిడ తేరుకున్నారు. మంచం దిగి ఉత్సాహంగా అడుగులు వేశారు.

డాక్టర్లంతా తమ తమ ఫీజులు వసూలుచేసుకొని 'హమ్మయ్య' అనుకుంటూ బయటపడ్డారు.

"ఎవరయ్యా ఈ కొత్త డాక్టరు, గట్టివాడిలాగే ఉన్నాడే!" అనడిగారు అందరూ ఏకగ్రీవంగా.

"ఆ--వాడా! పశువుల డాక్టరు దగ్గర కాంపౌండర్‌లెండి" అన్నాడా కుర్ర డాక్టరు.

-స్వర్ణలత

# ది ఇలస్ట్రేటర్

ఈమధ్యనే కొత్తగా ప్రారంభించిన 'రవళి' పత్రికకు తాను వేసిన కొన్ని బొమ్మలు శాంపిల్‌గా తీసుకొని వెళ్ళాడు రమణ. అవకాశం ఇస్తే ఆ పత్రికలో కథలకు బొమ్మలు వేద్దామని అతని ఆశ.

--నిజానికి అతను ఓ రచయిత.

లోగడ అతను రాసిన కథలు వివిధ పత్రికలలో అచ్చయ్యాయి కూడా.

కానీ ఈమధ్య పత్రికలవాళ్ళకి నచ్చేటైపు కథలు తానురాయలేననిపిస్తోంది. పోనీ కాపీ కొట్టి రాద్దామా అంటే ఈపాటికే అందరూ కాపీ కొట్టేస్తున్నారు-- తనకేమి మిగల్చకుండా. అందుకే అతని దృష్టి...బొమ్మలపై పడింది.

కష్టపడి ఏడాదిన్నరపాటు ప్రాక్టీస్ చేసిన ఫలితంగా "గీత కార్మికుడిగా" మారిపోయాడు.

"నమస్కారం సార్"... తనను తాను పరిచయం చేసుకొని, వచ్చిన పనిని వివరించి తెచ్చిన బొమ్మలు చూపించాడు రమణ. ఏమూడ్‌లో వున్నారో 'రవళి' ఎడిటర్‌గార్కి రమణ బొమ్మలు నచ్చాయి. మారు ప్రశ్నలేం లేకుండా ఓ కథ ఇచ్చి బొమ్మవేసుకు రమ్మన్నారు రెండురోజుల్లోగా. ఆనందంగా ఆ కథతో ఇంటి దారి పట్టాడు రమణ.

★ ★ ★

ఆ సాయంత్రం తాపీగా కూర్చుని తాను తెచ్చిన కథను చదవటం మొదలుపెట్టాడు-బొమ్మవెయ్యడానికి ఐడియాకోసం. చదువుతున్న రమణ ముఖంలో రంగులు మారాయి. చదవటం పూర్తిచేసి అతను ఓ ఫైల్‌తెచ్చి చూశాడు. ఆ ఫైల్‌లో గతంలో అచ్చయిన అతడి కథలు వున్నాయి ఓ వరుసప్రకారం.

—సందేహంలేదు. ఈ వెధవెవడో తన పదేళ్లనాటి కథని మక్కీకు మక్కీగా కాపీ కొట్టాడు. 'రవళి' ఎడిటర్ దాన్ని సెలక్ట్ చేసేశాడు. ఈ "వెధవ" చేసిన వెధవ పనిగురించి ఎడిటర్ గారికి తెలియపర్చాలి అనుకుంటూ ఆ ఫైల్ మూయబోయాడు.

సరిగ్గా అప్పుడు పడిందతని దృష్టి! తాను రాసిన ఆ కథకు ఏగొప్ప చిత్రకారుడో గానీ బ్రహ్మాండంగా గీసిన అద్భుతమైన బొమ్మ!

తళుక్కున ఓ ఆలోచన మెరిసిందతనిలో.

వెంటనే ట్రేసింగ్ పేపర్ తీసుకొని ఆ బొమ్మను ట్రేస్‌చెయ్యడం మొదలుపెట్టాడు ఆనందంగా.

**-చిరుమామిళ్ళ మనోహర్**





చిత్రాలయ మూవీస్
అందరికంటే ఘనుడు
శ్రీధర్ ఇళయరాజా
శివ-సుబ్రహ్మణ్యం జూడో రత్నం



# చతుర

## అదో వింత లోకం

అక్కడ మగవాళ్లందరూ గౌన్లు, హైహీల్స్ వేసుకొని జడ తిప్పుకుంటూ వయ్యారంగా నడుస్తారు!

సాయంకాలం కాగానే వంటా వార్పూ ముగించి ఎంచక్కా తయారై ఉద్యోగానికెళ్లిన ఇంటావిడ కోసం, ఆవిడ తెచ్చే మల్లెపూల కోసం ఎదురుచూస్తూ ఉంటారు!

ఆడవాళ్లంతా పాంట్, షర్ట్ వేసుకొని సిగరెట్ కాలుస్తూ, విస్కీ సేవిస్తూ ఉంటారు!

తమకు నచ్చిన ఓ అబలుడికి నడుంచుట్టూ బంగారు మొలతాడు కట్టి కళ్యాణమాడుతారు!

## ఆనంద్ అనుకోకుండా ఆ వింతలోకంలో అడుగు పెట్టాడు!

ఆ వింతలోకం ఎక్కడుంది?
ఆనంద్ అక్కడికి ఎలావెళ్లాడు? ఏమయ్యాడు?
ప్రమాదాల 'ప్రమదావని'లో అడుగుపెట్టిన ఆనంద్‌కు ఎదురయిన అనుభవాలు ఏమిటి?
మిమ్ములను హాస్యపు జల్లులో ముంచెత్తే నవ్వుల ఖజానా! నవ్విస్తూనే ఆలోచింపజేసే నజరానా!

## వచ్చేనెల చతురలో

చతుర నవలల పోటీలో ప్రత్యేక బహుమతి పొందిన పి.ఎస్.వి. ప్రసాద్ నవల 'ప్రమదావని' మీరు చదవబోతున్నారు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications; Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad- 500016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad- 500482

వివాహములకు....




# చందన కంచి సారీస్

కోటగుమ్మం, రాజమండ్రి.

గమనిక :- స్త్రీలకు నచ్చే అన్నిరకముల ప్రత్యేక పట్టు చీరలతోపాటు అన్ని ఫ్యాన్సీ చీరలు సరసమైన ధరలకు అందించటం మా ప్రత్యేకత.

